తరుణ భారతి గ్రంథమాల

# టోటో-చాన్

## కిటికీలో చిన్నారి



రచన

**టెట్సుకో కొరియనాగి**

అనువాదం

**వాసిరెడ్డి సీతాదేవి**

చిత్రాలు

**చిహిరో యివాసాకి**



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

ISBN 81-237-3030-6

ప్రథమ ముద్రణ 2000 (*శక 1921*)



**Totto-Chan (*Telugu*)**

**రూ. 40.00**

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్,
న్యూఢిల్లీ-110016 ద్వారా ప్రచురింపబడినది.

అంకితం

సొసాకు కొబయాషి

స్మృతికి



# విషయ సూచిక

# ముందు మాట

టోమో అనే బడి గురించి, దాన్ని స్థాపించి నిర్వహించిన సొసాకు కొబయాషి గురించి రాయడం, నేను చాలా కాలంగా చెయ్యాలనుకున్న ముఖ్యమైన పనుల్లో ఒకటి.

నేను చెప్పిన దానిలో అభూత కల్పనలు లేవు. అన్నీ వాస్తవాలే. జరిగిన సంఘటనలే. చాలా సంఘటనలు ఇంకా గుర్తుండడం నా అదృష్టం. నేను చేసిన ఒక వాగ్దానాన్ని నెరవేర్చ లేక పోయాను. అది నేను పెద్దయ్యాక టోమో బడిలో పని చేస్తానని చేసిన వాగ్దానం. అందుకే కొబయాషి గురించి, ఆయన పిల్లలపట్ల చూపిన ప్రగాఢమైన ప్రేమగురించి, విద్యార్థుల్ని విజ్ఞానవంతుల్ని చెయ్యడానికి ఆయన అమలు పరచిన పద్ధతుల గురించి, వీలయినంత ఎక్కువ మందికి తెలియజెప్పాలనే ప్రయత్నమే ఇది.

కొబయాషి 1963 లో చనిపోయాడు. ఈ నాడు ఆయన బ్రతికి వుండి వుంటే ఇంకెన్నో విషయాలు నాకు చెప్పి వుండేవాడు. ఇంతకాలంగా నా మనసులో మధుర స్మృతుల్లా మిగిలిపోయిన ఆ సంఘటనలు, ఒక ప్రయోజనం కోసం రూపొందించిన కార్య క్రమాలేనని చెప్పగలను. "అయితే, కొబయాషి మనసులో ఈ ఆలోచన ఉండివుంటుంది. ఆయన ఈ విషయం కూడా ఆలోచించడం చిత్రంగా వుంది" అని నేను కనిపెట్టిన ప్రతి విషయానికీ ఆశ్చర్యపోతూ వుంటాను. ఆయనయెడల ఏర్పడిన కృతజ్ఞతా భావంతో నా హృదయం నిండిపోతూ వుంటుంది.

ఇక నా విషయానికి వస్తే "నువ్వు చాలామంచి పిల్లవు." ఆ సంగతి నీకు తెలుసా? అంటూ ఎప్పటి కప్పుడు నా అభివృద్ధికి కారణభూతుడయ్యాడు.

నా అభివృద్ధికి లభించిన ఆయన తోడ్పాటును అంచనా కట్టడం తేలికకాదు. నేను టోమోలో చేరకపోయి ఉంటే, కొబయాషిని కలవక పోయి వుంటే నాకు బహుశా "అల్లరిపిల్ల" అనేపేరు వచ్చి ఉండేది. అలా జరిగివుంటే నేను ఎంత మానసిక వ్యధకు గురి అయి వుండేదాన్నో! ఎంత అయోమయంలో పడిపోయేదాన్నో!

1945 లో టోక్యో పై జరిగిన బాంబు దాడులో టోమో పూర్తిగా ధ్వంసం అయిపోయింది. కొబయాషి ఆస్కూలు తన స్వంత డబ్బుతో కట్టించాడు. అందువల్లనే పునర్నిర్మాణానికి చాలా సమయం పట్టింది. యుద్ధం తర్వాత పాతబడిన స్థలం లోనే ఒక కిండర్‌గార్డెన్ ప్రారంభించాడు. ఇప్పుడు కునిటాచి సంగీత కళాశాలకు అనుబంధంగా నడుస్తున్న శిశువిద్యా విభాగాన్ని ఆయనే రూపొందించాడు ఆ సమయం లోనే. ఆయన తన అరవైతొమ్మిదో ఏట మరణించాడు. ఆయన కలలు కన్న ఆదర్శ పాఠశాలను నిర్మించకుండానే కన్ను మూసాడు.

టోమోగా కుయన్ టోక్యోలో నైరుతి దిశన ఉండేది. ఆ బడికి వెళ్ళాలంటే జియుగేకా స్టేషన్ నుంచి మూడు నిముషాల నడక. ఆ ప్రదేశంలో ఇప్పుడు పీకాక్ సూపర్‌మార్కెట్, వాహనాలను నిలిపే స్థలం ఉన్నాయి. ఇప్పుడు ఆబడి, ఆ వాతావరణం అక్కడ లేదని నాకు తెలుసు. అయినా ఒక రోజు చూడాలనిపించి అక్కడకు వెళ్ళాను. ఇప్పుడు వాహనాలు పార్కు చేసి వుండే స్థలం లోనే రైలు పెట్టెలబడి ఉండేది. నా కారుచూసి, ఆకార్లు నిలిపే స్థలంలో వుండే వ్యక్తి "ఆగండి! ఆగండి! ఇక్కడ ఖాళీ లేదు," అంటూ కేకలు పెట్టాడు.

"నేనిక్కడకు కారు ఆపాలని రాలేదు. నా బాల్య స్మృతుల్ని నెమరు వేసుకుందామని వచ్చాను" అనాలనిపించింది. ఒకవేళ అన్నా నా మాటలు అతడికి అర్థం కావు-నాకారు ముందుకు సాగిపోయింది. విషాదంతో నాగుండె బరువెక్కింది. కళ్ళనుంచి నీరు చెక్కిళ్ళమీదగా కారుతోంది.

ప్రపంచంలో చాలా మంది విద్యావేత్తలు ఉన్నారని నాకు తెలుసు. వాళ్ళు ఉన్నత ఆదర్శాలు కలవారు. పిల్లల పట్ల ప్రగాఢమైన ప్రేమగల వాళ్ళు. ఆదర్శప్రాయమైన పాఠశాలల్ని నెలకొల్పాలనే కలలు కన్నవాళ్ళు. కాని అలాంటి ఆదర్శాలను ఆచరణలో పెట్టడం ఎంత కష్టమో నాకు తెలుసు. ఎన్నో

సంవత్సరాల అధ్యయనం తర్వాత కొబయాషి 1937లో, టోమో ప్రారంభించాడు. కాని ఆ బడి 1945 లో కాలి బూడిదైపోయింది. టోమో అతి కొద్ది కాలమే నడిచింది.

కొబయాషి తన కలలను పండించుకుంటున్న కాలంలోనే నేను ఆబడిలో చదివాను. యుద్ధమే రాకుండా ఉంటే ఆయన సంరక్షణలోకి ఇంకెంతమంది పిల్లలు వచ్చివుండేవారో! తల్చు కుంటే ఎంతో బాధ కలుగుతుంది. ఆయన శ్రమంతా ఆ విధంగా వ్యర్థం అయిపోయింది.

నేనీ పుస్తకంలో కొబయాషి విద్యాబోధన లో అమలుపర్చిన పద్ధతులను చెప్పడానికి ప్రయత్నించాను. పిల్లలు సహజంగా మంచి వాళ్ళయి వుంటారనీ, చెడు వాతావరణంలో, పెద్దవాళ్ల సంరక్షణలో వాళ్ళు చెడిపోతారనీ ఆయన నమ్మారు. పిల్లల్లో వుండే మంచి తనాన్ని వెలికితీసి, వికసింప చెయ్యడమే ఆయన ప్రధాన ధ్యేయం. వారి వ్యక్తిత్వాలను తీర్చి దిద్దడమే ఆయన ఆశయం.

ఆయన సహజత్వానికి విలువ నిచ్చేవాడు. పిల్లలు వీలయినంత సహజ వాతావరణంలో పెరగాలని ఆయన ఉద్దేశ్యం. ఆయన ప్రకృతిని ఆరాధిం చేవాడు. చిన్న కూతురు మియోచాన్‌ను తనతో షికార్లకు తీసుకు వెళ్ళేవాడు. "పదమ్మా షికారుకువెళ్దాం. ప్రకృతిలో మోగే లయబద్ధమైన ధ్వనులను విందాం" అనేవాడని మియోచాన్ చెప్పింది.

ఆయన కూతుర్ని ఒక పెద్ద చెట్టు కిందకు తీసుకెళ్ళేవాడు. చల్లగా వీస్తున్న గాలికి ఆచెట్టు ఆకులూ రెమ్మలూ, కొమ్మలూ, ఎలా ఊగుతున్నాయో చూడమనేవాడంట. ఆకులకూ, కొమ్మలకూ, కాండాలకూ ఉన్న పరస్పర సంబంధాన్ని గురించి వివరించేవాడట. గాలి బలంగా వీచినప్పుడు ఆకులు ఎలా ఊగుతాయో మెల్లగా వీచినప్పుడు ఎలా ఊగుతాయో వివరించేవాడట. వాళ్ళిద్దరూ నిశ్చలంగా నిలబడి ప్రకృతిని తిలకించేవారట. ఒక వేళ గాలి లేక పోతే తలఎత్తి చూస్తూ ఉండి పోయేవారట. ఎంత సేపైనా ఓపికగా, ఒక చిన్నగాలి తెమ్మెర రాక పోతుందా అని ఆశతో చూసేవారట. వాళ్ళు గాలినే కాదు, నదిని కూడా చూసేవారట. దగ్గర్లో వున్న టామా నది ఒడ్డు కెళ్ళి నీటి ప్రవాహాన్ని ఆసక్తిగా చూసేవాళ్ళట. వాళ్ళకు అలాంటి సమయాల్లో అలసట అంటే ఏమిటో తెలిసేదికాదట. అవన్నీ మియోచాన్ నాతో చెప్పింది.

యుద్ధ కాలంలో జపాన్ అధికారులు ఇలాంటి అసామాన్యమైన ప్రాథమిక పాఠశాలలను ఎలా నడవనిచ్చారనీ, ఇలాంటి స్వేచ్ఛా పూరిత వాతావరణంలో విద్యాబోధనను ఎలా అంగీకరించారనీ మీకు సందేహం కలగవచ్చు. కొబయాషికి ప్రచారం ఇష్టం వుండేది కాదు. ఆమాట కొస్తే యుద్ధానికి పూర్వం కూడా ఏనాడూ ఆయన తన పాఠశాల గురించి ప్రచారం చేసుకోలేదు. ఫొటోలు కూడా ఎక్కడా అచ్చు వేయించలేదు. ఇలాంటి వాటికి ఆయన చాలా దూరంగా వుండేవాడు. యాభైమంది పిల్లలతో నడిపే ఈ అసాధారణ పాఠశాల ఎవరి దృష్టిలోనూ పడక పోవడానికి ఇది కూడా ఒక కారణం కావచ్చు. అంతేకాదు శిశు విద్యాబోధనలో విశేష కృషి చేసిన ఆయనంటే విద్యాశాఖాధికారులకు ఎంతో గౌరవం.

టోమోలో నవంబరు మూడవ తేదీ ఆటల దినంగా పాటించడం జరిగేది. ఆరోజు తాలూకు జ్ఞాపకాలు నాకింకా ఉన్నాయి. అదొక అద్భుతమైనరోజు అందుకే ఆరోజు పాతవిద్యార్థులు కుమాంబుట్సు ఆలయంలోని ఒక గదిలో కలుసు కుంటారు. ఆ కలయిక ఒక అద్భుతమైన సన్నివేశం. నలభై ఏళ్ళొచ్చినా, ఏభయోపడిలోపడ్డా, పిల్లల తల్లులమైనా నవంబరు మూడో తేదీన అందరం కలుసుకుంటాం. వయసును మర్చిపోయి, పసి పిల్లల్లా అయిపోతాం చిన్నప్ప టి చిలిపి పేర్లతోనే పిల్చుకుంటాం. కొబయాషి మాకు వదిలిపోయిన వారసత్వంలో ఇది కూడా ఒకభాగం. ఇది ఆనందకరమైన పునర్మిలనం.

నన్ను నా మొదటి పాఠశాల నుంచి తొలగించిన మాట నిజం. కాని వీధి మేళాల వాళ్ళ గురించిగానీ, బల్లసొరుగు గురించి గానీ నాకు గుర్తు లేదు. మా అమ్మే చెప్పింది. నన్ను ఆ బడినుంచి తొలగించారనే విషయం నాకు విస్మయాన్ని కలిగిస్తుంది. నిజంగా నేను అంతగా అల్లరి చేసేదాన్నా! ఐదేళ్ళ కిందట నేనొక టెలివిజన్ కార్యక్రమంలో పాల్గొన్నాను. నన్ను ఒక స్త్రీ పరిచయంచేసింది. ఆమె నా మొదటి బడిలో పనిచేసిన టీచరట. నా తరగతి కి పక్క గదిలో వున్న తరగతి టీచరట. ఆమె చెప్పిన విషయాలు విని నేను అవాక్కయి పోయాను.

ఆమెచెప్పింది- "నువ్వు నేనుండే పక్కగదిలో చదివేదానివి." నేనెప్పుడు టీచర్ల గదికి వెళ్ళినా నువ్వు వరండాలో నిల్చుని కన్పించేదానివి. అంటే

ఎప్పుడూ ఏదో ఒక గొడవ చేస్తూండేదానివన్నమాట. నన్ను చూడగానే "నేనేం తప్పుచేసాను. ఎందుకు నన్నిలా నిలబెట్టారు" అని అడిగేదానివి. ఒక రోజు మీకు వీధి మేళాలవాళ్ళంటే ఇష్టం లేదా? అని అడిగావు. నీకు ఏం సమాధానం ఇవ్వాలో నాకు తెలిసేది కాదు. నాకు అటుగా వెళ్లాల్సిన పనిపడినప్పుడల్లా వరండాలోకి తొంగి చూసేదాన్ని. నువ్వు అక్కడ కన్పిస్తే అటు వెళ్ళడం మానేసేదాన్ని. నీ టీచరు "ఆ పిల్ల ఎందు కలా తయారైందో అర్థం కావడంలేదు." అని అంటూవుండేది. నిన్ను గుర్తించాను. "నీ ఆనాటి రూపం నాకింకా కళ్ళల్లో మెదులుతూనే వుంది."

నన్ను వరండాల్లో నిలబెట్టి శిక్షించేవారన్న విషయం నాకు బొత్తిగా గుర్తులేదు. చాలా ఆశ్చర్యపోయాను. ఆమెతల నెరసింది. కాని ఆమె ఇంకా ఉత్సాహంగానే ఉంది. ఆమె ముఖంలో దయాగుణం ఉట్టి పడుతోంది. నన్ను నిజంగానే ఆ స్కూలు నుంచి బహిష్కరించారనే విషయాన్ని ఆమె ధృవపరచింది.

నా ఇరవయ్యవ పుట్టిన రోజు దాకా అమ్మ నాకీ విషయం చెప్పలేదు. ఆమెపట్ల నాహృదయంలో కృతజ్ఞతా భావం పెల్లుబికింది, అంతవరకూ ఆ విషయం చెప్పకుండా ఉన్నందుకు.

"నువ్వు ఒక ప్రాథమిక పాఠశాల నుంచి మారి, మరో పాఠశాలలో ఎందుకు చేరావో నీకు గుర్తుందా తల్లీ!" అమ్మ ఒక రోజు అడిగింది. నేను గుర్తులేదన్నాను. "నిన్ను మొదటిబడి నుంచి తొలగించారు," అమ్మ నిర్లిప్తంగా చెప్పింది.

ఆ రోజు అమ్మ నన్ను ఒక బడినుంచి తొలగించ బడినందుకు తిట్టలేదు. రెండో బళ్ళోనుంచి కూడా వెళ్ళగొడ్తే ఏమైపోతావే! అని నిలదీయలేదు. అమ్మ అలాచేసివుంటే టోమోలో అడుగు పెట్టడానికి భయంతో ఎంత వణికి పోయేదాన్నో! ఆ మొక్కలు, చిగుళ్ళువున్న ఆగేట్లు, అంత అద్భుతంగా కన్పించి వుండేవి కావు. అక్కడి రైలు పెట్టెలు నాకు అంత ఆనందాన్ని ఇచ్చేవికావు. అటువంటి అమ్మను పొందడం నిజంగా నా అదృష్టం!

యుద్ధం ప్రారంభం అయ్యాక కొన్ని ఫొటోలు టోమోలో తీశారు. స్కూలు వదిలి వెళ్ళిపోయేముందు తీసిన ఫొటోలు బాగా వచ్చాయి. సాధారణంగా

స్కూలు విడిచి వెళ్ళిపోయే వాళ్ళు అసెంబ్లీహాలు ముందున్న మెట్ల మీద ఫొటో తీయించుకుంటారు. కొందరు తమ స్నేహితులను "రావోయ్! రా?" అని పిల్చేవారు. వాళ్ళతో పాటు అక్కడున్న పిల్లలందరూ ఫొటో కోసం వచ్చినిల్చునేవారు. అందువల్ల ఆ సంవత్సరం బడివదిలిన పిల్లలెవ్వరో పోల్చుకోవడం సాధ్యమయ్యేదికాదు. మేమందరం కలుసుకున్నప్పుడు ఎంతో ఉద్వేగంతో ఆకబుర్లు చెప్పుకొనేవాళ్ళం. ఈ విషయంలో హెడ్ మాస్టరు కలుగ జేసుకొనేవాడు కాదు. బహుశా ఫొటోల్లో ఏకొద్దిమందోకాకుండా, వీలయినంత ఎక్కువ మంది ఉంటేనే జీవనం తొణికిసలాడుతుందని ఆయన అభిప్రాయం కావచ్చు. ఇప్పుడు ఆఫొటోలే టోమోకు నిజమైన ప్రతినిధులు

టోమో గురించి ఎంతయినా చెప్పగలను. కాని టోటో చాన్ లాంటి ఒక చిన్న పిల్ల, పెద్దలు ప్రోత్సహిస్తే తన వ్యక్తిత్వాన్ని ఎలా తీర్చిదిద్దుకోగలదో, పదిమంది మధ్య ఎలా మసులుకొని ఇతరుల అభిమానాన్ని చూరగొనగలదో చెప్పగలిగితే, అంతకంటే నాకు సంతృప్తి కరమైన విషయం మరొకటి వుండదు.

టోమోలాంటి పాఠశాలలు ఈనాడు వుంటే సమాజంలో ఇంత హింస వుండేదికాదు. బడి మానేసే పిల్లల సంఖ్య కూడా ఇంత వుండేది కాదని నా అభిప్రాయం. టోమోలో బడి అయిపోయాక కూడా పిల్లలకు ఇంటికి పోవాలని పించేది కాదు. ఉదయం పూట బడికి వీలయినంత త్వరగా వెళ్ళిపోవాలనిపించేది. అటువంటి బడి అది.

సొసాకు కొబయాషి టోక్యోకు వాయవ్యంగా వున్న ఓ పల్లెటూరులో 1893 జూన్ 18వ తేదీన జన్మించాడు. ఒక అద్భుతమైన పాఠశాలను నెలకొల్పాలనే సంకల్పం ఆయనలో బలంగా వుండేది. ప్రకృతి, సంగీతం అతనికి ప్రీతిపాత్రమైన విషయాలు. బాల్యంలో ఆయన తన ఇంటికి దగ్గరలో వున్న ఒక నది ఒడ్డున నిలబడేవాడు. దూరంగా హరునా పర్వతం కన్పిస్తూవుండేది. ఆ కొండ ఒక ప్రేక్షకురాలిగా, గలగల ప్రవహించేనది ఒక వాద్యకారుల బృందంగా ఆయనకు అనిపించేది. అంతేకాదు తనను సంగీత స్వరకర్తగా భావించుకొనే వాడు.

ఆయనది పేద కుటుంబమనే చెప్పాలి. ఆరుగురు సంతానంలో ఆయనే చివరివాడు. ప్రాథమిక విద్యపూర్తి చెయ్యగానే ఉపాధ్యాయుడిగా ఒక స్కూల్లో

పనిచెయ్యాల్సి వచ్చింది. అంత చిన్న వయసులో అవసరమైన ధృవీకరణ పత్రాలను పొందడానికి ఎంతో శ్రమపడాల్సి వచ్చింది. అయినా అది ఆయనలోని ప్రతిభకు తార్కాణం. ఆతర్వాత టోక్యోలోని ఒక బడిలో సహాయ ఉపాధ్యాయుడిగా ఉద్యోగం సంపాదించుకో గలిగాడు.

అక్కడ ఆయన విద్యాబోధనను సంగీతంతో సమ్మిళితం చేశాడు. ఈ సమ్మేళనం వల్ల ఆయన చిరకాలవాంఛ నెరవేరింది. జపాన్‌లోకల్లా అత్యున్నతమైన సంగీత సదనంలో ఆయనకు ప్రవేశం లభించింది. ఇప్పుడు దాన్నే టోక్యో సంగీత, లలిత కళల విశ్వవిద్యాలయం అంటున్నారు. అక్కడ సంగీతంలో పట్టభద్రుడయ్యాడు. ఒక ప్రాథమిక పాఠశాలలో సంగీత మాస్టారుగా చేరాడు. హారుజినకమురా ఆపాఠశాలను స్థాపించాడు. ఆయన ఒక అద్భుతమైన వ్యక్తి. వ్యక్తిత్వ వికాసంలో ప్రాథమిక విద్య ప్రాధాన్యత వహిస్తుందని నమ్మేవాడు. వీలయినంత తక్కువమందితో తరగతులను ఏర్పాటు చేసేవాడు. పిల్లల్లోని ప్రతిభనూ, ఆత్మ గౌరవాన్నీ పెంపొందించేందుకు తగిన స్వేచ్ఛాయుత పాఠ్యాంశాలు వుండాలని బోధించాడు. అక్కడ ఉదయంపూట మాత్రమే పాఠాలు వుండేవి. మధ్యాహ్నమంతా షికార్లు, బొమ్మలుగీయడం పాడడం, మొక్కలు సేకరించడం, హెడ్‌మాస్టరు చెప్పే విషయాలు వినడం మాత్రమే ఉండేవి. నకమురా ప్రవేశ పెట్టిన పద్ధతుల ప్రభావం కొబయాషి మీద చాలా ఉంది. అందువల్లనే టోమోలో అలాంటి పాఠ్యాంశాలనే ప్రవేశ పెట్టాడు.

నకమురా పాఠశాలలో పనిచేస్తున్న రోజుల్లోనే, బాలల కోసం ఒక సంగీత రూపకాన్ని రాశాడు. ఈ రూపకం బారన్ ఇవసాకి అనే ఒక పారిశ్రామిక వేత్తకు చాలా నచ్చింది. ప్రపంచంలోకెల్లా అతి పెద్దదయిన పారిశ్రామిక సంస్థ మిట్సుబిషిని స్థాపించింది ఈ ఇవసాకీ కుటుంబమే. ఇవసాకీ కళా పోషకుడు. ఆయన జపాన్ ప్రముఖ గాయకుడైన కొసాక యామాడాకు సహాయం చేసేవాడు. పాఠశాలకు ఆర్థిక సహకారం అందించేవాడు. విద్యావిధానాలను అధ్యయనం చేసేందుకు కొబయాషిని యూరప్ పంపించాడు.

1922 నుంచి 1924 వరకు కొబయాషి యూరప్ లో గడిపాడు. పారిస్‌లో పాఠ్యశాలను దర్శించాడు. ఎమిలీజా క్వైస్ రూపొందించిన యురిథమిక్స్‌ను

అధ్యయనం చేశాడు. విదేశాలనుంచి తిరిగివచ్చాక మరో వ్యక్తితో కలిసి సీజో కిండర్ గార్డెన్‌ను నెలకొల్పాడు. బాలలను ముందుగా ఏర్పరచుకున్న ఆలోచనలలో దించవద్దనీ, వారిని స్వతంత్రంగా ఎదగ నివ్వాలనీ టీచర్సుకు చెప్పేవాడు. “వాళ్లను ప్రకృతికి వదిలెయ్యండి. వారి ఆలోచనల్ని కత్తిరించకండి. మీరు కనేకలలకంటే వారి కలలే విశాలమైనవి. అపూర్వమైనవి.” టీచర్సుతో అంటూవుండేవాడు. జపాన్‌లో ఆ కిండర్ గార్డెన్ దాని కదేసాటి.

1930లో కొబయాషి మరోసారి యూరప్ వెళ్ళారు డాక్ క్రోజ్ దగ్గర మరో సంవత్సరం అధ్యయనంలో గడిపాడు. అక్కడుండగానే ఆయన ఒక నిర్ణయానికి వచ్చాడు. అది జపాన్ వెళ్ళగానే స్వంతంగా ఒక పాఠశాల నెలకొల్పాలని.

1937 లో టోమోగాకుయెన్ స్థాపించాడు. అప్పుడే జపాన్ యురిథమిక్స్ ఎసోసియేషన్ కూడా స్థాపించాడు. జపాన్‌లో మొదటిసారిగా యురిథమిక్స్ ప్రవేశపెట్టిన వ్యక్తిగా ఆయనకు గుర్తింపు ఉంది. తర్వాతి కాలంలో కునిటాచి సంగీత కళాశాలకు ఆయన ఇచ్చిన చేయూత ప్రశంసనీయమైనది. ఆయన బోధనా పద్ధతులతో ప్రత్యక్షంగా అనుభవం వున్నవారిలో కొద్దిమందిమి మాత్రమే మిగిలి ఉన్నాం. టోమో లాంటి మరో పాఠశాల స్థాపించకుండానే ఆయన మరణించడం విచారకరమైన విషయం. టోమో తగలబడి పోతుండగానే ఆయన మరోపాఠశాల నిర్మాణం గురించి కలలు కన్నారు. “మళ్ళీ ఎలాంటి బడి నిర్మిద్దాం?” అని అడిగాడు.

అంత అలజడిలో కూడా ఆయన నిరాశచెందలేదు. ఓటమిని అంగీకరించలేదు.

ఈ పుస్తకం రాయడం ప్రారంభించాక నాకొక చిత్రమైన విషయం తెలిసింది. ప్రతిరోజూ టెలివిజన్ లో వచ్చే నా కార్యక్రమం “టెట్సుకోగది” ప్రొడ్యూసర్ ఒక దశాబ్దంగా కొబయాషి గురించి పరిశోధన చేస్తున్నాడట. ఆ నిర్మాతతో చాలా సంవత్సరాలుగా నేను కలిసి పనిచేస్తున్నాను. ఆయన కొబయాషిని చూడలేదు. ఒక స్త్రీ ద్వారా ఆయన గురించి విన్నాడు. అంతే ఆయనకు కొబయాషి మీద గౌరవం ఏర్పడింది. కొబయాషి గురించి నిర్మాతకు చెప్పిన ఆమె చిన్న పిల్లల యురిథమిక్స్ పాఠాలకు పియానో వాయిస్తుందట. “పిల్లలు

అటువంటి అడుగులు వెయ్యలేరు," అంటూ ఆమె వాయిస్తున్న లయను సరిదిద్దాడట. పిల్లల గురించి కూలంకషంగా తెలుసుకున్న వ్యక్తి ఆయన. వాళ్ళ కదలికలు ఆయనకు తెలుసు. వాళ్లు ఊపిరి ఎలా పీల్చుకుంటారో కూడా ఆయనకు తెలుసు. కజిహికో సానో త్వరలోనే తన పరిశోధన పూర్తి చేస్తారనీ, ఒక అద్భుత వ్యక్తి గురించి ఇంకెన్నెన్నో విషయాలను ప్రపంచం ముందు ఉంచుతారనీ నేను ఆశిస్తున్నాను.

ఇరవై ఏళ్ళక్రితం ఒక స్త్రీల పత్రికలో టోమో గురించి ఒక వ్యాసం రాశాను. అది కొడక్‌షా సంపాదకుడి దృష్టికి వచ్చింది. అతను ఉత్సాహ వంతుడైన యువకుడు. ఒకరోజు దస్తాలకొద్దీ తెల్లకాగితాలు తీసుకొని నన్ను చూడడానికి వచ్చాడు. టోమో గురించి పుస్తకం రాయమని కోరాడు. ఆ కాగితం మరో విధంగా ఉపయోగించుకున్నందుకు నేను సిగ్గు పడ్డాను. తనకోరిక, తీరకముందే ఆయన డైరెక్టర్ అయ్యాడు, అతని పేరు కెట్సుహిసాకాటో. అసలు ఈ పుస్తకం రాయాలన్న అలోచన కలిగించింది ఆయనే. కొడక్‌షావారి "యంగ్ ఉమెన్" అనే పత్రికలో సీరియల్‌గా ప్రచురిస్తామన్నారు.

ఆ విధంగా ఫిబ్రవరి 1979 లో ప్రారంభించిన సీరియల్ 1980 డిసెంబరు వరకు సాగింది.

ప్రతినెలా ఒక బొమ్మ వెయ్యాలి. దాని కోసం టోక్యోలోని 'చిహిరో ఇవసాకి బొమ్మల పుస్తకాల షాపుకు, వెళ్ళేదాన్ని. చిహిరో ఇవసాకి పిల్లల బొమ్మలు చిత్రించడం లో ప్రవీణురాలు. పిల్లల రూపాల్ని అంత సజీవంగా చిత్రించగల ప్రతిభావంతులు ప్రపంచంలో మరొకరు లేరనే నా అభిప్రాయం. చిన్న పిల్లల మనస్తత్వాన్నీ, వైఖరులనూ ఆమె సంపూర్ణంగా తెలుసుకుంది. ఆరు నెలల బిడ్డకూ, తొమ్మిది నెలల బిడ్డకూ మధ్యవుండే వైవిధ్యాన్ని ఆమె పసిగట్ట గలిగేది. ఆమె చిత్రాలను నాపుస్తకం కొరకు ఉపయోగించుకొనే అవకాశం లభించినందుకు నాకు ఎంతో ఆనందం కలిగింది. అవి నా రచనకు అద్దినట్లు సరిపోవడం నాకు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఆమె 1974 లో మరణించింది. ఆమె బ్రతికి వుండగానే నేను ఈ పుస్తకం మొదలు పెట్టానా అనే విషయం తెలుసుకోవడానికి ఎందరో ఉత్తరాలు రాస్తుంటారు. ఆమె

చిత్రాలు ఎంత సహజంగా వుంటాయో దీనిని బట్టి ప్రత్యేకంగా చెప్ప నక్కర్లేదు.

చిహిరో ఇవసాకి దాదాపు ఏడువేల బొమ్మల్ని చిత్రించింది. చాలా చిత్రాలు ఒరిజినల్ రూపంలో చూసే అదృష్టం నాకు కలిగింది. ప్రదర్శనశాలలో సహాయకుడిగా పని చేస్తున్న ఆమె కుమారుడూ, అతని భార్యా ఈవిషయంలో నాకు ఎంతో సహకరించారు. ఆమె బొమ్మల్ని ఈ పుస్తకంలో వేసేందుకు అనుమతి ఇచ్చిన చిహిరో భర్తకు నేను సదా కృతజ్ఞురాలను. నన్ను తొందరపెట్టి ఈ పుస్తకాన్ని పూర్తి చేయించిన తాడా ఐజవాకు కూడా నేనుకృతజ్ఞురాలను. ఆయన ఆ ప్రదర్శనశాల పర్యవేక్షకుడు. అంతేకాదు, ఆయన నాటక రచయిత కూడా! ఆ ప్రదర్శన శాలకు ఇప్పుడు నేను ట్రస్టీగా ఉన్నాను.

మియోచానూ, టోమోలోని ఇతర మిత్రులు నాకు ఎంతో సహాయం అందించారు, జపనీస్ ఎడిషన్‌కు సంపాదకుడిగా ఉండిన కీకో ఇహమోటోకు కూడా నా హృదయపూర్వక కృతజ్ఞతలు. "ఈ పుస్తకాన్ని బ్రహ్మాండంగా తీసుకురావాలి" అనేవాడు ఆయన.

"కిటికీ వెలుపల" అనే నానుడి నుంచి ప్రేరణపొంది ఈ పుస్తకానికి ఈ పేరు పెట్టాను. అంచుల మీద వుండడం లేక కష్టాల్లో వుండడం అనే వ్యక్తీకరణకు, ఆమాట వాడుకలో వుంది. నా మొదటి బడిలో వీధి మేళాం వాళ్ళను చూడడానికి కిటికీ దగ్గర నిలబడ్డప్పుడు నన్ను నేను అలాగే భావించు కొనేదాన్ని. అందరికీ దూరంగా విడిపోయి నిల్చున్నట్టుగా అన్పించేది. అంతేకాదు ఆ ఆనందమయ కిటికీ నాకోసం చివరకు టోమోలో తెరచుకుంది.

ఆటోమో ఇప్పుడు లేదు. కాని ఈ పుస్తకం చదువు తున్నప్పుడు మీ ఊహల్లో అది రూపుకడితే అంత కంటే నాకు ఆనందం కలిగించేది మరొకటి వుండదు.

టోక్యో, 1982

*

టోటోచాన్ ప్రచురించబడిన మూడేళ్ల కాలంలో జరిగిన విషయాలు తెల్సుకుంటే ఆశ్చర్యంతో పాటు ఆనందం కలుగుతుంది. ఈ పుస్తకం రాస్తున్నప్పుడు కానీ, ప్రచురిస్తున్నప్పుడు కానీ ఇంత ప్రాచుర్యం పొందుతుందని

నేను భావించలేదు. మొదటి సంవత్సరంలో నలభైఐదు లక్షల కాపీలు అమ్ముడు పోయాయి. ఇప్పటికి ఆ సంఖ్య అరవై లక్షలకు చేరింది. ఇది జపనీస్ ప్రచురణా రంగంలోనే ఒక చరిత్రను సృష్టించింది. అయినా నాకది గొప్పగా అనిపించలేదు. జపానుదేశపు నాలుగు చెరగుల నుంచి ఉత్తరాలు కుప్పలు కుప్పలుగా వచ్చి పడ్డప్పుడు కాని నాకు నాపుస్తకం అంతమంది చదువు తున్నారని తెలియలేదు.

ఐదు సంవత్సరాల పిల్లలనుంచి, నూటమూడు సంవత్సరాల వయసున్న వృద్ధుల వరకు, అన్ని వయసుల వారి ఉత్తరాలను అందుకోగలిగాను. ఆ ఉత్తరాలు నన్నెంతగానో ఆనందింప చేశాయి. ప్రాథమిక పాఠశాల విద్యార్థుల నుంచి వచ్చిన ఉత్తరాల సంఖ్య చూసి ఆశ్చర్యపోయాను. అంత చిన్న వయసు బిడ్డలు ఈ పుస్తకం చదువుతారని నేను ఊహించలేదు. రెండో తరగతి పిల్లలు డిక్షనరీ సహాయంతో ఈ పుస్తకం చదువుతున్నారని తెలిసి కదిలిపోయాను. అంగవైకల్యంగల పిల్లవాడు కన్పిస్తే "అడుగో! యాసువాకీచాన్" అనో లేక "అతను టోమోనుంచేవచ్చాడు" అనో అంటున్నారని రెండవ తరగతి చదువుతున్న ఒక పిల్ల రాసింది. అలాంటి పిల్లవాడు కనిపిస్తే ఆ అమ్మాయి పరుగెత్తు కెళ్ళి "హలో" అంటూ అతడ్ని పలకరిస్తుందట! అతను తిరిగి సమాధానం ఇస్తే పొంగి పోతుందట! నలభై సంవత్సరాల తర్వాత! నిజంగా పిల్లలు అద్భుతమైనవాళ్లు!

టోమో తగలబడి పోయిందని చదివిన పిల్లలు యుద్ధం ఎంత చెడ్డదో గ్రహించామన్నారు. అలాంటి పుస్తకం రావాల్సిందేనన్నారు. పిల్లల్ని అమితంగా ప్రేమించిన ఒక మహానుభావుడు ఉండేవాడని. ఉపాధ్యాయులూ తల్లి దండ్రులూ తెలుసుకోవాలన్నదే నా అభిలాష. ఈ నాటి సమాజానికి ఆయన భావాలు సరిపడేవి కావని టీచర్లు నిర్లక్ష్యంగా కొట్టిపారేస్తారేమోనని భయపడ్డాను.

కాని, పుస్తకం వెలువడిన కొత్తలో టీచర్లు రోజూ మధ్యాహ్నం సమయాల్లో పిల్లలకు చదివి వినిపించేవారు. ఆ పుస్తకంలోని కొన్ని భాగాలను వినిపించి, అనుకూలమైన బొమ్మలు గియ్యమని చిత్ర లేఖనం నేర్పించే ఉపాధ్యాయులు పిల్లల్ని పురమాయించే వారనీ, కొందరు జూనియర్ స్కూలు టీచర్లు అప్పటి విద్యావిధానం మీద విసుగుచెంది రాజీనామా చెయ్యాలనుకున్నారని చెప్పేవారు. కానీ ఈ పుస్తకం ద్వారా కొబయాషి కృషినీ, అభిప్రాయాలనూ తెలుసుకొని

మరో ప్రయత్నం ఎందుకు చెయ్యకూడదని అభిప్రాయ పడ్డారట. అలాంటి ఉత్తరాలు చదివినప్పుడు నాకళ్ళల్లో నీరు తిరిగేది.

టోటో చాన్‌కు ఇంత ప్రాచుర్యం ఎందుకొచ్చిందో తెలుసుకోవడానికి ప్రశ్నల పరంపరలను ప్రసారసాధనాలు ప్రజల ముందుకు తెచ్చాయి. అనేక పత్రికల్లో దానిని గురించి అభిప్రాయాలు వెల్లడవడమే కాకుండా, ఆ పుస్తకం గురించి మరో పుస్తకం రావడం ఆశ్చర్య కరమైన విషయం. ఈ పుస్తకం ఇంత ప్రాచుర్యాన్ని పొందడానికి నాకు ఒక కారణం కన్పిస్తోంది. ఆనాడు జపాన్‌లో విద్యావిధానం అనేక సమస్యల్ని ఎదుర్కొంటున్నది, సంస్కరణల గురించి ఆలోచిస్తున్న సమయంలో ఈ పుస్తకం వెలువడింది. ఈ పుస్తకం అన్ని వయసులవారు చదవ వలసిన పుస్తకం. అందువల్లనే అన్ని ప్రతులు అమ్ముడుపోయింది.

అంతే కాదు, జపాన్‌లో ఒక స్త్రీ రాసిన పుస్తకం అన్ని కాపీలు అమ్ముడు పోవడం అదే ప్రథమం. మొదట్లో పురుషుల నుంచి పెద్దగా ప్రోత్సాహం లభించలేదనే చెప్పాలి. "ఆడపిల్ల ఆలోచనలు" అనీ "చౌకబారువినోదం" అనీ కొట్టి పారేశారు. కాని కుటుంబాలు పోత్సహించాయి. వారికి నా కృతజ్ఞతలు.

బధిరనటుల్ని తయారు చేసే సంస్థకు నా పుస్తకం మీద వచ్చే రాయల్టీని ఇవ్వాలను కున్నాను. ఒక కమిటీని ఏర్పాటు చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరాను. ఆ ఏర్పాటు చెయ్యడానికి ప్రభుత్వానికి 25 సంవత్సరాలు పట్టింది. అదీ నేను సంఘసేవకురాలిగా ఉన్నాను కనుక. ఇలాటోటో ఫౌండేషన్ అనే పేరు మీద సంఘసేవా సంస్థ ప్రారంభించడం జరిగింది. పోయిన జూలై మాసంలో మా ఆశయం సిద్ధించింది. అంతర్జాతీయ నాటకోత్సవాల సందర్భంగా, ఇటలీ దేశపు పాలర్‌మోలో, నలభైఐదు దేశాలనుంచి వచ్చిన ప్రతినిధుల సమక్షంలో 'క్యోజెన్' నాటకం ప్రదర్శించడం జరిగింది. ఈ ఉత్సవాలను అంతర్జాతీయ మూగ, బధిర సంస్థవారు నిర్వహించారు. మూగ, బధిరులు పాల్గొన్న జపనీస్ నాటకం మొదటి సారిగా విదేశాలలో ప్రదర్శించడం జరిగింది. మీలో చాలా మంది టోటోచాన్ చదివినందువల్లనే ఇది సాధ్యపడింది.

పుస్తకం అత్యధిక సంఖ్యలో అమ్ముడు పోవడం, టోటోచాన్ ఫౌండేషన్ ఏర్పడడం వల్ల నాకు ఒక అద్భుతమైన అవకాశం లభించింది. రాజుగారి

వార్షిక స్ప్రింగ్ గార్డెన్ పార్టీకి నాకు ఆహ్వానం అందింది. ఆపార్టీకి నోబుల్ ప్రైజుగెలుచుకొన్న "కెనిచీఫ్యూకీ" కూడా ఆపార్టీకి వచ్చారు. "అంతపెద్ద సంఖ్యలో మీ పుస్తకం అమ్ముడుపోవడం చాలా గొప్ప విషయం" అని రాజుగారు నన్ను ఉద్దేశించి అన్నప్పుడు నా ఆనందానికి అవధుల్లేవు.

1981 వ సంవత్సరాన్ని అంగవైకల్యాల సంవత్సరంగా జపాన్ ప్రకటించింది. ప్రైంమినిస్టర్ సుజికి నుంచి నేను అవార్డు పొందాను. ఇంకా ఎన్నో ఇతర పురస్కారాలు కూడా పొందాను. పిల్లల రచయత "యుజో యా-మామోటో" స్మారక అవార్డు "వేసైడ్‌స్టోన్" కూడా నాకు లభించింది. ఇది సాహిత్య బహుమతి.

టోటోచాన్‌ను, సినిమాగా, టి.వి. నాటకంగా, కార్టూన్ సినిమాగా, సంగీత రూపకంగా-రూపొందిస్తామని ఎందరో నా అనుమతిని కోరారు- కాని పిల్లల ఊహాల్లో అప్పటికే ఆపుస్తకంలోని చిత్రాలు దృఢంగా అల్లుకు పోయాయని నాకు తెలుసు, అందుకే వారి అభ్యర్థనను తిరస్కరించాను. కాని దీన్ని సంగీత రూపకంగా మలచడానికి మాత్రం అంగీకరించాను. షిన్సీ నిహాన్ సింఫోని దాన్ని జపాన్‌లో అనేక చోట్ల ప్రదర్శిస్తోంది. ఈ స్వర సమ్మేళనానికి నా వ్యాఖ్యానాన్ని జోడిస్తున్నారు. క్యాసెట్లు కూడా తయారు చెయ్యడం జరిగింది.

ఈ పుస్తకం అచ్చు అయిన సంవత్సరం తర్వాత, అంటే 1982 లో డొరతీబ్రిటన్ చేసిన ఇంగ్లీషు అనువాదం పూర్తి అయింది. ఆమె స్వయంగా కవయిత్రి, స్వరకర్త. నారచనలోని మూల ప్రాణాన్ని ఆమె పట్టుకోగలిగింది. ఆమె అనువాదం చదువుతూ నేనే పరవశించి పోయాను. జపాన్‌లో అత్యధిక సంఖ్యలో అమ్ముడుపోయిన, ఇంగ్లీషు పుస్తకంగా రికార్డు నెలకొల్పింది. నాలుగు లక్షల ప్రతులు అమ్ముడయ్యాయి.

ఇంగ్లీషు అనువాదం అదేసమయంలో అమెరికాలో వెలువడింది. ఈ సందర్భంగా జాన్ కర్సన్ తీసిన "టునైట్" ప్రదర్శన లో పాల్గొన్నాను. ఉపన్యాసాలు ఇవ్వమనీ, వార్తా ప్రదర్శనలలో పాల్గొనమని ఆహ్వానాలు వచ్చాయి. "ది న్యూయార్క్ టైమ్స్"లో ఆ పుస్తకాన్ని సమీక్షించారు. టైమ్ పత్రిక జపాన్ మీద ప్రత్యేక సంచిక వేసి, నా ఇంటర్వ్యూకు ఒక పూర్తి పేజీ కేటాయించడం జరిగింది.

టోటోచాన్ అనువాదాలు చైనాలోనూ, కొరియాలోనూ ఇప్పటికే ప్రచురించ బడ్డాయి. చైనా, జపాన్ నుంచి అనుమతి తీసుకోలేదు. ఒక పెద్ద మనిషి పంపిన ఒక అనువాద ప్రతిని చూశాక నాకా విషయం తెలిసింది. చైనాలో రెండు మూడు రకాల అనువాదాలు వచ్చి వుంటాయని నా అనుమానం. పోలెండు, ఫిన్లాండుల్లో అనువాదాలు ప్రచురించే అవకాశాలు ఉన్నాయి. జెకోస్లవేకియా ప్రచురణకర్తతో సంప్రదింపులు జరుగుతున్నాయి. ఇతర యూరప్‌దేశాల నుంచి కూడా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈవిధంగా జపాన్ గురించి ఇతర దేశాలు తెలుసుకోవడం నాకెంతో ఆనందంగా వుంది. అమెరికానుంచి ఉత్తరాలు వస్తున్నాయి. "టోటో చాన్ నువ్వు అందంగా ఉంటావా? ఒకసారి మా ఇంటికి విందుకు రా కూడదూ?" అంటూ ఒక పాఠశాల విద్యార్థి రాశాడు. అతడు ఆఫ్రికాకు చెందిన నిరుపేద విద్యార్థి అని ఆతర్వాత నాకు తెలిసింది.

"ఒక పుస్తకంలో ఇంత కరుణ, మమతా, మమకారాలు వుంటాయని మాకు తెలియదు." అని కొందరు విద్యార్థినులు రాశారు. అంతగా వారిని కదిలించిన సన్నివేశాలేమిటో రాయలేదు. కాని యవ్వనపు ప్రాంగణంలో అడుగు పెడ్తున్న మన పిల్లలు ఆర్ద్రమైన విషయాలకు స్పందిస్తారనేది వాస్తవం కనకనే.

ఈ మధ్య నన్ను యునిసిఫ్ గుడ్‌విల్ మిషన్‌కు అంబాసిడర్‌గా నియమించారు. ఈ ఐక్యరాజ్యసమితి తాలూకు శిశునిధిసంస్థ "నోబుల్ శాంతి బహుమతి" ని గెలుచుకుంది. నాకు ఈ పదవిని తెచ్చిపెట్టింది ఈ పుస్తకమే! యునిసిఫ్ న్యూయార్క్ కార్యాలయంలో ఎగ్జిక్యూటివ్ డైరెక్టరు నా పుస్తకం చదివాడట. వాళ్ల సంస్థ ఆశయాలూ నా ఆశయాలూ ఒకటే అన్పించిందని. అందుకే నన్ను అంబాసిడర్‌గా నియమించారు అన్నారు. అప్పటికే, సుప్రసిద్ధులైన అమెరికన్ నటుడు డానీకే, బ్రిటిష్ నటుడు పీటర్ ఉస్తినోవ్, నార్వేజియన్ నటి లివ్‌ఉల్‌మన్ ఈ పదవిని నిర్వహించి యున్నారు. నేను ఈ పదవిలో నాలుగో వ్యక్తిని. ఆకలివల్ల, వ్యాధులవల్ల ప్రపంచ వ్యాప్తంగా రోజుకు నలభైవేలమంది, ఏడాదికి కోటిన్నర మంది శిశువులు మరణిస్తున్నారు. వారి పరిస్థితుల్ని పరిశీలించి, గుర్తించి, వాటిగురించి ప్రజలకు తెలియ చెప్పడం నాపని. వచ్చే ఎండా కాలంలో నేను ఆఫ్రికా వెళుతున్నాను. ఆసియాలోని

ఇతర దేశాలను కూడా త్వరలోనే దర్శిస్తాను. కొబయాషి జీవించి వుంటే ఎంత ఆనందించి వుండే వాడోగదా! "మీరంతా ఒకటే! మీరు ఎవరు ఏంచేసినా ఈ ప్రపంచంలో మీరందరూ కలిసేవున్నారు. ఈ సంగతి మీకు తెలుసా!" అని కొబయాషి ఎప్పుడూ అంటూవుండే వాడు.

వసంత్, 1984 -టెట్సుకో కొరియనాగి



## రైల్వే స్టేషన్

వాళ్లు ఒయిమాచి రైల్లోనుంచి జియుగౌకా స్టేషన్లో దిగారు. తల్లి కూతురి చెయ్యి పట్టుకొని గేటుకేసి నడిచింది. టోటోచాన్ రైలు ఎక్కడం అదే మొదటి సారి. అందుకే రైలు టికెట్ ఆపిల్లకు అపురూపంగా కన్పించింది. అందుకే దాన్ని వదల లేనట్టుగా గట్టిగా పట్టుకుంది.

"నేను దీన్ని వుంచుకోవచ్చా?" టికెట్ కలెక్టర్ను అడిగింది.

"కూడదు. ఇలా ఇవ్వు!" అన్నాడు అతడు.

టికెట్లతో నిండివున్న పెట్టెకేసి చూపిస్తూ "అవన్నీ నీవేనా?" అని అడిగింది.

"కాదు రైల్వేవాళ్లవి" ప్రయాణీకుల నుంచి టిక్కెట్లు తీసుకుంటూ జవాబు ఇచ్చాడు.

ఆ పిల్ల ఆపెట్టెలోవున్న టికెట్లకేసి ఆశగా చూసింది. "పెద్ద దాన్ని అయ్యాక రైలు టికెట్లు అమ్ముతాను" అంది ముందుకు అడుగు వేస్తూ.

టికెట్ కలెక్టర్ తలతిప్పి ఆ పిల్లకేసి కుతూహలంగా చూశాడు." మా చిన్నబ్బాయి కూడా రైలుస్టేషన్లో పని చేస్తానంటున్నాడు, మీ ఇద్దరూ కలిసే

ఆపని చెయ్యొచ్చు" అన్నాడు.

టోటో చాన్ ఒక అడుగు వెనక్కు వేసి అతడ్ని చూసింది, లావుగా వున్నాడు. కళ్ళజోడు పెట్టుకున్నాడు. "మంచివాడు" అని అనిపించింది.

రెండు చేతులూ నడుం మీద ఆనించి నిల్చుని కొద్ది నిముషాలు ఆలోచించింది. "మీ అబ్బాయితో కలిసా? తర్వాత ఆలోచిస్తాను. ఇప్పుడు నాకు తీరిక లేదు కొత్త బడికి వెళ్తున్నాను." అని తన కోసం ఎదురు చూస్తున్న తల్లి దగ్గరకు పరుగు తీసింది.

"అమ్మా! మరేమో! నేను టికెట్లు అమ్మే ఉద్యోగంచేస్తానే!" అన్నది పెద్దగా.

కూతురి మాటలకు తల్లి ఆశ్చర్యపోలేదు "మరి! నువ్వు గూఢచారివి కావాలను కున్నావుగా?" అన్నది తాపీగా.

"అవును కదూ! ఇంత వరకు గూఢఛారి కావాలనే అనుకున్నాను. కాని ఓ! పెట్టెనిండా టికెట్లు. ఎంత తమాషాగా వుందో!" అనుకుంది టోటోచాన్.

అంతలో ఆపిల్ల బుర్రలోకి ఓ బ్రహ్మాండమైన ఆలోచన జొరబడింది. "అసలు గూఢచారిని. పైపైన టికెట్లు అమ్మేమనిషిని." తలెత్తి తల్లిముఖం లోకి చూస్తూ అరిచింది.

తల్లి మాట్లాడలేదు. చిన్న చిన్న పూలుకుట్టిన టోపీకింద తల్లిముఖం గంభీరంగా అయింది. ఆమె ముఖంలో ఆందోళన స్పష్టంగానే కన్పిస్తోంది. టోటోచాన్‌కు కొత్త బడిలో ప్రవేశం దొరకదేమోననే బెంగ ఆమెను ఆందోళనకు గురిచేస్తున్నది. తనలోతనే మాట్లాడుకుంటూ రోడ్డు మీద గెంతుతున్న కూతురికేసి చూసింది. తల్లి ఆవేదన ఆ పిల్లకు తెలియదు. "నాకు ఇంకొక ఆలోచన వచ్చింది. వీధి బాజాలవాళ్లతో చేరిపోతాను." అన్నది తల్లి ముఖం లోకి చూస్తు టోటోచాన్ ఉత్సాహంగా.

"పద!పద! ఆలస్యం అయిపోతుంది. హెడ్‌మాస్టరు గారు మనకోసం చూస్తుంటారు. ఆలస్యంగా వెళ్తే బాగుండదు. ఇక కబుర్లు చాలు. చూసినడువు" తల్లి కూతుర్ని హెచ్చరించింది.

అల్లంత దూరంలో స్కూలు గేటు కన్పించింది.

## కిటికీలో పాప

ఆ తల్లి ఆందోళనకు కారణం లేకపోలేదు. టోటోచాన్‌ను బడికి పంపిన కొద్దిరోజులకే, ఆపిల్లను ఆ బడి నుంచి బహిష్కరించారు. మొదటి తరగతి పిల్లను అలా బడి నుంచి పంపివెయ్యడం విచిత్రమైన విషయమే!

ఇది జరిగి వారం రోజులు అయింది. క్లాసు టీచర్ కబురు చేస్తే తల్లి వెళ్ళి కలిసింది. ఆమెను చూడగానే ఆటీచర్ సూటిగా విషయం మొదలు పెట్టేసింది.

"మీ అమ్మాయి వల్ల క్లాసు పిల్లలందరూ చెడిపోతున్నారు. స్కూలు నుంచి తీసుకెళ్ళిపొమ్మని చెప్పక తప్పడం లేదు. నా ప్రాణాలు తోడేసిందంటే నమ్మండి." ఆ టీచర్ అందంగా ఉంది. వయసులో ఉంది.

ఆమె మాటలు విని టోటో చాన్ తల్లి తెల్లబోయింది. క్లాసులో పిల్లలందరూ చెడిపోయేంత పనులు ఏం చేస్తుందో ఆమెకు అర్థం కాలేదు.

ఆ టీచర్ జుట్టు, పనివాళ్ళ జుట్టులా కురచగా కత్తిరించబడివుంది. బేలగా చూస్తూ, జుట్టు సవరించు కుంటూ చెప్పసాగింది. "అసలు ఏం చేస్తుందంటే- డెస్క్ మూస్తుంది, తెరుస్తుంది, వందలసార్లు సొరుగు మియ్యడం తెరవడం ఒకటే శబ్దాలు చేస్తుంది. అవసరం వుంటేగాని సొరుగు తెరవ వద్దన్నాను. ప్రతి నిముషం సొరుగులో ఏదో ఒకటి పెడ్తూనో, తీస్తూనో వుంటుంది. సొరుగునుంచి నోటుబుక్కు తీసి మూత దభాలున పడేస్తుంది. మళ్ళీ మూత తెరిచి తల దూర్చి చూస్తుంది. ఏ పెన్సిలో బయటికి తీస్తుంది. దభాలున మూత పడేస్తుంది. మళ్లీ తెరుస్తుంది. ఏదో ఒకటి సొరుగులో పెడుతుంది. మళ్లీ మూత పడేస్తుంది. ఈ విధంగా ఏదో ఒకటి సొరుగులో పెడ్తూ, బయటకు తీస్తూనే ఉంటుంది. ఉదాహరణకు: 'ఎ' అనే అక్షరం కుదరకపోయినా తప్పురాసినా సొరుగు తెరిచి రబ్బరు తీస్తుంది. అక్షరం చెరిపేసి వెంటనే రబ్బరు లో పలపెట్టి ధడేల్మ మూత పడేస్తుంది. అక్షరం రాశాక మళ్లీ మూత తెరుస్తుంది. పెన్సిలు లోపల పెడుతుంది. తర్వాత మరో అక్షరం రాయడానికి మళ్లీ ఇంత తతంగం చేస్తుంది. మొదట నోటు బుక్కు తీస్తుంది-మూత వేస్తుంది. మళ్లీ పెన్సిలు తీస్తుంది- మూతవేస్తుంది. అక్షరం తప్పుపోతే మళ్లీ మూత తెరిచి రబ్బరుతీస్తుంది. ఇదీ వరస. ఆ శబ్దాలకు నా తల తిరిగిపోతుంది. కోప్పడడానికి కూడా అవకాశం లేదు. కారణం-ఏదో ఒక వస్తువు సొరుగు

నుంచి తియ్యడానికో, అందులో మళ్లీ వుంచడానికో మూత తీసి వేస్తూ వుంటుంది కనక ఏమీ అన లేకపోతున్నాను."

అలా ఆమె చెబుతున్నప్పుడు ఆమె కళ్ళల్లో ఆ దృశ్యాలు రూపు కడుతున్నట్టుగా అన్పించింది.

టోటోచాన్ అలా ఎందుకు చేస్తుందో తల్లికి అర్థం అయింది. స్కూల్లో చేరిన రోజు ఇంటికివచ్చి ఉత్సాహంగా ఉద్వేగంగా తల్లితో అన్నది-"అమ్మా! మరేమో బళ్లో బల్ల బలేవుందే! మనింట్లో బల్ల సొరుగును బయటికి లాగుతాంకదా? బళ్లో అట్టా కాదు. మూతను పైకి లేపాలి. అందులో అన్నీ పెట్టుకోవచ్చు. అబ్బ ఎంత బాగుందనుకున్నావ్? అది ఒక పెట్టెలాగే ఉంది తెలుసా?"

ఆ సొరుగును అలా తెరుస్తూ, మూస్తూ ఆ పిల్ల ఎంత ఆనందాన్ని పొందుతుందో ఊహించుకుంది తల్లి, ఏది ఏమైనా టోటోచాన్ చేసింది మహాపరాధంగా ఆమెకు అన్పించలేదు. చిన్న పిల్ల, కొత్తదనం పోగానే ఆపని మానేస్తుందని కూడా ఆమెకు తెలుసు.

"అలా చెయ్యకుండా నేను చూస్తాను," అన్నది టీచరుతో ఆమె.

"అయ్యో! అంతేననుకుంటున్నారా? డెస్క్ తెరిచే పని లేనప్పుడు, క్లాసు జరిగినంత సేపూ నిల్చునే వుంటుంది."

"నిల్చునే వుంటుందా? ఎక్కడ?"

"కిటికీ ముందు."

"కిటికీ ముందా? ఎందుకు?"

"అటుగా వెళ్ళే వీధి బాజాల వాళ్ళను పిలవడానికి!"

అరిచినట్టే పెద్దగా అన్నది టీచరు.

టీచరు చెప్పిన కథ సారాంశం యిది: బల్ల సొరుగు మూతను ఓ గంట తీస్తూ వేస్తూ మోతలు విన్పించాక అక్కడ్నుంచి లేస్తుంది. కిటికీ దగ్గర కెళ్ళి బయటికి చూస్తూ నిల్చుంటుంది. "పోనియ్ అరవకుండా, నిల్చుంది." అని టీచరు అనుకుంటుండ గానే పెద్దగా అరుస్తూ బజారున వెళ్ళే బాజావాళ్ళను పిలుస్తుంది. అలా ఆపిల్ల పిలవడమే ఆలస్యం అన్నట్లుగా ఆ బాజా వాళ్లు కిటికీ దగ్గరకు వచ్చి నిలబడతారు. టోటోచాన్ వెనక్కు తల తిప్పి "బాజా

వాళ్లు వచ్చేశారోచ్" అంటూ అరుస్తుంది. అంతే! క్లాసులోని పిల్లలందరూ బిలబిల మంటూ కిటికీ దగ్గరకు పరుగు తీస్తారు. అందరూ ఆ బాజాల వాళ్లతో కబుర్లు మొదలు పెడ్తారు.

"ఏమైనా వాయించండి" అంటుంది టోటోచాన్.

అడగటమే ఆలస్యం అన్నట్టు బాజా వాళ్లు బ్రహ్మాండమైన ప్రదర్శన ప్రారంభిస్తారు. సన్నాయి కర్రలో, తప్పెట్లూ, డ్రమ్ములో, తాళాలో మోగుతుంటే టీచరు నిస్సహాయంగా నిలబడి పోవడం తప్ప ఏమీ చెయ్యలేదు.

కొంత సేపటికి మేళాలవాళ్లు వెళ్ళి పోతారు. పిల్లలంతా తమతమ సీట్లలోకి వచ్చి కూర్చుంటారు. టోటోచాన్ మాత్రం రాదు.

"ఇంకా అక్కడే ఎందుకు నిలబడ్డావ్?" అని టీచరు అడిగితే "ఇంకో బాజావాళ్లు వస్తారేమోనని" అంటుంది. అంతేకాదు వాళ్లు వచ్చేసరికి ఎవరూ పలకరించక పోతే ఏంబాగుంటుంది? అని కూడా అంటుంది.

"మరి! ఇదంతా చదువుకు ఎంత అడ్డంకో ఆలోచించండి" అన్నది టీచర్ ఉక్రోషంగా.

"ఇంకా చెప్పాలంటే" ఉద్వేగంతో టీచర్ కంఠం వణికింది. టోటోచాన్ తల్లికి ఆమెమీద జాలి వేసింది.

"ఇంకా ఏం చేసింది?" ఎక్కడో లోతులకు పడిపోతున్నట్టుగా అడిగింది ఆమె.

"ఇంకా ఏం చేసిందా? మీ అమ్మాయి చేసిన వన్నీ చెప్పగలిగి వుంటే స్కూలు నుంచి తీసుకెళ్ళమని చెప్పేదాన్నే కాదు. ఎన్నని చెప్పను?"

టీచర్ ఆమె ముఖంలోకి చూస్తూ మళ్ళీ చెప్పసాగింది. "నిన్నటికి నిన్న ఏంచేసిందో తెలుసా? రోజూ లాగే కిటికీ దగ్గర నిలబడింది. బాజా వాళ్లకోసం నిలబడి వుంటుందిలే అనుకున్నాను. నేను పాఠం చెప్పుకు పోతున్నాను. ఉన్నట్టుండి ఎవర్నో కేక పెట్టి పిల్చింది." ఏం చేస్తున్నావ్ అని ఎవర్నో వీధిలోకి చూస్తూ అడుగుతోంది. నాకు ఆశ్చర్యం వేసింది. "ఏయ్! ఏంచేస్తున్నావ్?" అంటూ మళ్లీ కేక పెట్టింది. ఆపిల్ల రోడ్డున వెళ్తున్న వాళ్ళతో మాట్లాడుతున్నదని పించలేదు. దూరంగా ఎవర్నో చూస్తూ మాట్లాడు తున్నట్టుగా అన్పించింది. నాకు విస్మయం కలిగింది. అవతలి నుంచి

సమాధానం ఏదైనా వినిపిస్తుందేమోనని కుతూహలంగా చూశాను. కాని ఏమీ వినిపించడం లేదు. కాని మీ కూతురు మాత్రం "ఏం చేస్తున్నావ్? ఏం చేస్తున్నావ్?" అని అంటూనే ఉంది.

"నేను పాఠం చెప్ప లేక పోయాను. కిటికీ దగ్గరకు వెళ్ళి చూశాను. గోడకున్న కంతలో గూడు కట్టు కుంటున్న పిచ్చుకల జంట కన్పించింది. నీ కూతురు పిచ్చుకలతో మాట్లాడుతున్నదని గ్రహించాను. చిన్నపిల్ల, పిచ్చుకలతో మాట్లాడటం తప్పుకాదు. కాని క్లాసులో నుంచి లేచి వెళ్ళి పిచ్చుకలతో మాట్లాడడం తప్పు కదూ!"

టోటోచాన్ తల్లి క్షమాపణ అడగాలనుకుంది. ఆమెకు ఆ అవకాశం ఇవ్వకుండా టీచర్ మళ్లీ గోడు వెళ్ళబోసుకో సాగింది-"ఇక బొమ్మలు వేసే క్లాసు గురించి వినండి. పిల్లలందర్నీ మనజాతీయ జండా బొమ్మ గియ్యమని అడిగాను. మీ కూతురు తప్ప మిగతా అందరూ గీచారు. టోటో నావికాసైన్యం జండా వెయ్యసాగింది. దానికి కిరణాలు వుంటాయిగా? పోనియ్‌లే ఏదో ఒకటి వేస్తుంది అనుకున్నాను. హఠాత్తుగా ఆ జండాకు అంచులు గియ్యసాగింది. అంచులు! అదే యువజనుల జండాకు వుంటాయి చూడండి అలాంటి అంచులు! అలాంటి జండాను ఎక్కడో చూసి వుంటుంది. అంతటితో ఆగిందా? ఆ అంచుల్ని కాగితం మీది నుంచి బల్ల మీదకు గీచింది. పసుపుపచ్చటి గీతలు. కాగితం అంతా జండా ఆక్రమించుకుంది. అంచులకు చోటులేదు. అందుకే బల్ల మీదకు సాగదీసింది. బల్లంతా పసుపువచ్చ రంగుతో నిండిపోయింది. ఎంత రుద్దినా ఆ రంగు పోలేదు. ఏదో గుడ్డిలో మెల్లలా ఆ గీతలు మూడు వైపులకు మాత్రమే సాగాయి."

"అంటే?" తల్లి ఆశ్చర్యంగా అడిగింది.

టీచర్ ముఖంలో విసుగు కన్పించింది. "ఎడం వైపు జండా కర్రగీచింది. అందువల్లనే అంచులు మూడు వైపులకు మాత్రమే సాగదీసింది."

"అమ్మయ్య! అయితే మూడు వైపులేనన్న మాట!" రిలీఫ్‌గా అన్నది తల్లి.

"కాని జండా కర్ర కూడా కాగితం దాటివచ్చింది. అది కూడా బల్ల మీదే ఉంది," అన్నది టీచరు.

"ఇక వెళ్ళి రండి" అన్నట్టుగా టీచర్ లేచి నిలబడి అన్నది. "మీ అమ్మాయి వల్ల ఇబ్బందులు పడుతున్నది నేను మాత్రమే ననుకోకండి-టీచర్లందరూ నాలాగే బాధపడుతున్నారు."

తల్లికి పరిస్థితి అవగతం అయింది. తన కూతురివల్ల పిల్లలకూ, టీచర్లకూ ఇబ్బందిగా వుందని తెలుసుకుంది. మరో స్కూలు-తన బిడ్డను అర్థం చేసుకోగల స్కూలును వెదకాలని నిర్ణయించుకుంది.

వెతగ్గా వెతగ్గా ఒక బడి కన్పించింది. ఇప్పుడు ఆ బడికే బయలు దేరారు.

బడి నుంచి బహిష్కరించినట్టు కూతురికి తల్లి చెప్పలేదు. తన తప్పు అర్థం చేసుకొనే వయసు ఆపిల్లకు లేదని ఆమెకు తెలుసు. పసిదాని మనసు నొప్పించ కూడదని ఆమె భావించింది. "కొత్త బడికి, ఇంత కంటేమంచి బడికి వెళ్తావా తల్లీ!" అని మాత్రమే అడిగింది కూతుర్ని.

కాసేపు ఆలోచించి "సరే!" అన్నది. మళ్ళీ అంతలోనే "కాని..." అని



ఆగిపోయింది.

"ఏమైంది? ఆస్కూలు నుంచి పంపేశారని అర్థం చేసుకుందా ఏం?" తల్లికి భయం వేసింది.

"అమ్మా? ఆ కొత్త స్కూలుకు బాజాలవాళ్లు వస్తారా?" అని అడిగింది ఉత్సాహంగా.

## కొత్త బడి

కొత్త బడి గేటు అల్లంత దూరంలో కన్పించగానే ఠక్కున ఆగిపోయింది. పాతబడి గేటుకు అందమైన సిమెంటు స్థంభాలు వున్నాయి. వాటిమీద పెద్ద పెద్ద అక్షరాల్లో బడి పేరు వున్న బోర్డు తగిలించి ఉంటుంది. కాని ఈ గేటుకు రెండు వైపులా రెండు చిన్న చిన్న గుంజలున్నాయి. వాటి మీద ఆకులూ, రెమ్మలూ కూడా ఉన్నాయి.

"అరే! ఈ గేటు పెరుగుతున్నది. టెలిఫోన్ స్థంబాల కంటే ఎత్తుగా పెరుగుతుంది కదూ?" అన్నది టోటోచాన్.

ఆ చెట్ల మొదళ్లకు వేళ్లు కూడా ఉన్నాయి. బడి పేరు చదవాలంటే తలవంచి చదవాల్సి వచ్చింది. గాలికి ఆబోర్డు వంగిపోయి ఉంది.

"టో...మో...గా...కు...యెన్..."

"టోమో అంటే? ఏమిటి?" అని తల్లిని అడగబోయి ఇంకేదో కన్పించి ఆగిపోయింది. చటుక్కున గొంతు కూర్చుని పొదల సందుల నుంచి లోపలకు చూసింది. తను కల కంటున్నానేమో అనుకుంది.

"అమ్మా! అటుచూడు! అదుగో రైలు!" అంటూ అరిచింది.

వాడుకలో లేని ఆరు రైలు పెట్టెల్ని తరగతుల గదులుగా ఉపయోగిస్తున్నారు. టోటోచాన్‌కు ఆ దృశ్యం అద్భుతంగా అన్పించింది.

రైలు బడి!

ఉషోదయకాంతిలో రైలుపెట్టెల అద్దాలు తళతళ మెరుస్తున్నాయి. పొదల సందుల నుంచి ఆ దృశ్యం చూస్తున్న పాల బుగ్గల ఆ చిన్నారి కళ్లు మరీ తళతళ వెలిగిపోయాయి.

## "ఈ బడి బలేగా ఉంది!"

మరుక్షణంలో టోటోచాన్ ఆనందంతో కేరింతలు కొడ్తూ రైలుబడి కేసి పరుగు తీసింది. పరిగెత్తుతూనే భుజాలమీదగా వెనక్కు చూస్తూ "అమ్మా! తొందరగారా! రైలు ఆగి ఉంది. ఎక్కేద్దాం," అన్నది ఉద్వేగంగా, తల్లి గాభరాగా కూతురి వెనక పరుగు తీసింది. ఆమె ఒకప్పుడు బాస్కెట్‌బాల్ ఆడేది. టోటో చాన్ కంటే వేగంగా పరిగెత్తి గౌను పట్టుకొని ఆపింది.

"నువ్వు ఇప్పుడే ఎక్కిలోపలకు వెళ్ళకూడదు," అన్నది తల్లి కూతుర్ని వారిస్తూ. "ఈ పెట్టెలు బడి తరగతి గదులు. నువ్వింకా ఈ బళ్లో చేరలేదుగా? ఇప్పుడు మనం హెడ్‌మాస్టరు దగ్గరకు వెళ్తున్నాం. ఆయనతో నువ్వు మర్యాదగా మంచి పిల్లలా ప్రవర్తించాలి. అన్నీ సరిగ్గా జరిగితేనే నిన్ను ఈ బళ్లోకి తీసుకుంటారు, అర్థం అయిందా?"

అప్పటి కప్పుడే రైల్లోకి ఎక్క లేక పోయినందుకు ఆ పిల్ల నిరాశ చెందింది. అమ్మ చెప్పినట్టు వినడానికే నిశ్చయించుకుంది.

"ఈ బడి నాకు చాలా నచ్చింది," అన్నది తల్లితో

"నీకు నచ్చడం కాదు, హెడ్‌మాస్టర్‌కునువ్వు నచ్చాలి." అని కూతురికి చెప్పాలనుకుంది. టోటో చాన్ గౌను వదిలేసి, హెడ్‌మాస్టరు గదికేసి నడిచింది.

రైలు పెట్టెలన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. ఆనాటి తరగతులు అప్పుడే మొదలయ్యాయి. బడి ఆవరణం చిన్నగానే ఉంది. చుట్టూ గోడకు బదులుగా చెట్లు ఉన్నాయి. అక్కడ కూడ ఎర్రపూలు, పచ్చపూలతో నిండిన తివాచీలు నేలమీద పరచుకొని ఉన్నాయి.

హెడ్‌మాస్టరు గది రైలుపెట్టెలో లేదు. గేటుకు ఎదురుగా వున్న ఒంటి అంతస్థు మేడలో కుడివైపున ఉన్నది.

టోటోచాన్ తల్లి చెయ్యివదిలేసి గబగబ మెట్లెక్క సాగింది ఉన్నట్టుండి ఠక్కున ఆగి వెనక్కు తిరిగింది. తల్లి ఢీకొట్టి నంత పనిచేసింది.

"ఏమిటి? ఏమైంది!" కూతురు మనసు మార్చుకున్నదేమోనని భయపడింది తల్లి.

పైమెట్టు మీద నిలబడి, ముఖం గంభీరంగా పెట్టిగొంతు తగ్గించి గునగుసగా "మనం చూడబోయే ఆ మనిషి స్టేషన్ మాస్టరే అయివుంటాడు,"

అన్నది.

ఆ తల్లికి ఓర్పుతో పాటు హాస్య ప్రియత్వం కూడా ఉంది. "ఏం? ఎందుకలా అనుకున్నావ్?" గుసగుస గానే అడిగింది కూతురి చెవి దగ్గర నోరు పెట్టి.

టోటోచాన్ చిన్న గొంతుతోనే మళ్ళీ అన్నది-"నువ్వు ఆయనను హెడ్‌మాస్టర్ అంటున్నావు. ఆయనకు మరి ఇన్ని రైలు పెట్టెలు ఉన్నయ్‌గా? ఆయన తప్పక స్టేషన్ మాస్టరే అయివుంటాడు."

అవును! బడికోసం రైలు పెట్టెల్ని ఉపయోగించడం అపూర్వమే! అనుకుంది తల్లి. ఆ విషయం గురించి కూతురికి వివరించి చెప్పే సమయం లేదు. "పద! ఆయనను నువ్వే అడుగుదువుగాని! అన్నది. "అదిసరే! మరి మీనాన్న సంగతేమిటి? ఎన్నో వైలన్లు ఉన్నాయి. మీనాన్న వైలన్ వాయిస్తాడు కూడ. మరి మీనాన్న వైలన్ మాస్టరా?" మళ్లీ అన్నది కూతుర్ని చూస్తూ.

"కాదు! కాదు!" తల్లి అభిప్రాయంతో ఏకీభవిస్తూ చెయ్యి పట్టుకొని ముందుకు నడిచింది.

## హెడ్ మాస్టరు

గదిలో కుర్చీలో కూర్చుని వున్న పెద్దమనిషి తల్లీ కూతుళ్లు లోపలకు రావడం చూసి లేచినిల్చున్నాడు.

ఆయనకు నెత్తి మీద వెంట్రుకలు పల్చగా ఉన్నాయి. కొన్ని పళ్లు కూడా ఊడిపోవడం వల్ల నోరు బోసిగా ఉంది. ముఖంలో మాత్రం ఆరోగ్యం తొణికిసలాడుతోంది. ఆయన పెద్దపొడుగుకాదు. భుజాలు, చేతులు, బలంగా కన్పిస్తున్నాయి. మాసిపోయిన సూటులో కూడా శుభ్రం గానే కన్పిస్తున్నాడు.

టోటో చాన్ హడావిడి పడిపోతూ వంగి అభివాదంచేసింది. "మీరు హెడ్‌మాస్టరా, స్టేషన్ మాస్టరా," అని అడిగేసింది కుతూహలం ఆపుకోలేనట్టు.

తల్లి సిగ్గుపడింది, ఏదో సర్దిచెప్పబోయింది. కాని ఆ అవకాశం ఇవ్వకుండానే ఆయన "నేను ఈ బడికి హెడ్‌మాస్టర్ని" అన్నాడు.

టోటోచాన్ ముఖం సంతోషంతో వెలిగిపోయింది. "అబ్బ! ఎంత బాగుందో! ఎందు కంటే...మరి...మరేమో... నేనేమో మిమ్మల్ని ఒక సహాయం

అడగాలి...నేను...మరి...మరి...మీా బళ్లో చేరొచ్చా?" అంది.

హెడ్‌మాస్టర్ టోటోచాన్‌ను కుర్చీలో కూర్చోమన్నాడు. తల్లి వైపుకు తిరిగి "ఇక మీరు వెళ్ళిపోవచ్చు! నేను పాపతో మాట్లాడాలి"అన్నాడు.

టోటోచాన్‌కు మొదట కొంచెం జంకు కలిగినా ఆయన్ను చూస్తూ ధైర్యం తెచ్చుకుంది.

"అలాగే! నేనువెళతాను."అని లేచి బయటికి వెళ్ళి పోయింది తల్లి నిశ్చింతగా. హెడ్‌మాస్టరు ఓ కుర్చీ టోటోచాన్‌కు ఎదురుగా లాక్కొని కూర్చున్నాడు," ఊ! ఇక చెప్పు! నువ్వు చెప్పాలను కుంటున్నవి అన్నీ చెప్పు!" అన్నాడు.

హెడ్‌మాస్టరు ప్రశ్నలు వేస్తాడనీ, తను సమాధానాలు చెప్పాల్సి వుంటుందనీ అనుకుంది టోటోచాన్. హెడ్‌మాస్టరు అలా అడిగేసరికి ఆమె ఆనందానికి అంతు లేకుండా పోయింది. "అన్నీ చెప్పచ్చా! నేను చెప్పాలను కున్నవి అన్నీ చెప్పొచ్చా?" అనుకుంది. ఇంకేం వెంటనే గడగడ మాట్లాడసాగింది. గజిబిజిగా చెప్పుకు పోసాగింది. తనకు తోచిన విషయాలన్నీ ఏకరువు పెట్టింది. వాళ్ళు ఎక్కివచ్చిన రైలు ఎంత వేగంగా పరిగెత్తిందో చెప్పింది. టికెట్ వుంచుకోవచ్చా అని టికెట్ కలెక్టర్‌ను అడిగిన సంగతీ, అందుకు ఆయన అంగీకరించక పోవడం గురించీ వివరంగా చెప్పింది. పాత స్కూల్లోతన పాత టీచరు అందం గురించి చెప్పింది. పిచ్చుకగూళ్ళ సంగతి చెప్పింది. తనుకుక్క పిల్లరంగు గోధుమ రంగనీ అది ఎన్నెన్నో తమాషాలు చేస్తుందనీ చెప్పింది. "కిండర్ గార్డెన్"లో వుండగా నోట్లో కత్తెర పెట్టుకొని ఎలాంటి శబ్దాలు చేసేదో చెప్పింది. నాలుక తెగుతుందని టీచరు హెచ్చరించినా తను కత్తెర నోట్లో పెట్టుకొని టకటక లాడించడం మానెయ్యలేదని చెప్పింది. ముక్కు చీమిడి కారుతుంటే అమ్మ కోపంచేసేదనీ, దాన్నితను ఎలా చీదేసేదో కూడా చెప్పింది. తన తండ్రి ఎంత బాగా ఈతకొడ్తాడో, నీళ్లలోకి ఎంత ఎత్తునుంచి దూకుతాడో చెప్పింది. అలా చెప్పుకు పోతూనేఉంది. హెడ్‌మాస్టరు చిరునవ్వుతూ "ఊ! తర్వాత?" అని అడుగుతూనే ఉన్నాడు. దాంతో మరింత ఉత్సాహంగా చెప్పసాగింది. చివరకు బుర్రలో వున్న కబుర్లన్నీ అయిపోయాయి. ఇంకా ఏంచెప్పాలా అన్న ఆలోచనలో పడింది.

"ఇంకేమీ లేవా చెప్పాల్సినవి?" అడిగాడు హెడ్‌మాస్టరు.

ఇట్లా ఆపెయ్యడం ఎంత సిగ్గుచేటు! చెప్పడానికి ఇంకేమీ లేవా? మెదడంతా గాలించింది. చటుక్కున ఒక ఆలోచన తట్టింది.

ఆరోజు తను వేసుకున్న బట్టల గురించి చెప్పొచ్చుగా? తన బట్టలన్నీ అమ్మే కుడుతుంది. ఇదొక్కటే బజార్లో కొన్నది. ప్రతి రోజు ఇంటికి చేరేసరికి తన బట్టలు చిరిగిపోయి వుంటాయి. కొన్ని చిరుగులు మరీ పెద్దవిగా ఉండడంవల్ల వేసుకోవడానికి పనికి రాకుండా పోతాయి. అవి ఎందుకు అట్లా చిరుగుతున్నాయో అమ్మకు అర్థం కాదు. కొన్ని సార్లు తెల్ల చేనేత చెడ్డీలు కూడా చిరిగి పోయేవి. ఆ చెడ్డీలు ఎలా చిరిగేవో హెడ్‌మాస్టరుకు వివరించింది. వేరేవాళ్ళతోటల్లోకి వెళ్ళడానికి కంచె కింది నుంచి పాకేటప్పుడు, ముళ్ళతీగెలు పట్టుకొని చిరిగి పోయేవి. ఆరోజు పొద్దుట ఇక్కడకు వచ్చేముందు చూస్తే చిరుగు పట్టని జత ఒక్కటీ లేదు. అమ్మ కుట్టిన మంచి బట్టలన్నీ చిరుగులుపట్టాయి. అందుకే ఆరోజు బజార్లో కొన్న దుస్తులు వేసుకోవాల్సి వచ్చింది. అవి జర్సీ బట్టలు. వాటిమీద ఎరుపు, గోధుమ రంగుల్లో చిన్న చిన్న గళ్ళున్నాయి. బట్టలయితే బాగానే వున్నాయికాని కాలర్ మీద కుట్టిన పువ్వులే బాగాలేవని అమ్మ చెప్పింది.

కాలర్ ఎత్తి, పట్టుకొని చూపిస్తూ, "మా అమ్మకు ఈ కాలర్ నచ్చలేదు," అన్నది.

ఆ తర్వాత ఎంత ప్రయత్నించినా చెప్పడానికి ఏమీ తోచలేదు. అలాంటి పరిస్థితి ఎదురైనందుకు బోలెడంత బాధ పడిపోయింది. హెడ్‌మాస్టర్ లేచి తన అరచేతితో ఆ పిల్ల తల నిమిరాడు. "సరే! ఇక నుంచి నువ్వు ఈ బడికి వస్తున్నావు" అన్నాడు.

టోటో చాన్‌కు హెడ్‌మాస్టర్ చాలా చాలా మంచివాడని పించింది. అంతవరకు ఆపిల్ల మాటల్ని అంత ఓపిగ్గా విన్న వాళ్లెవరూ లేరు, పైగా ఒకసారి కూడా ఆయన ఆవలించలేదు, విసుక్కోలేదు. ఎంతో శ్రద్ధగా విన్నాడు.

టోటో చాన్‌కు అప్పటికి గడియారంలో టైం చూడడం తెలియదు. అందుకే ఆయనతో తనెంత సేపుమాట్లాడిందో తెలియదు. అది తెలిస్తే ఆయనపట్ల గౌరవం, ఇంకా పెరిగేది.

"అరే! భోజనం సమయం అయిందే?" జేబులోనుంచి గడియారం తీసి చూస్తూ అన్నాడు హెడ్‌మాస్టరు. టోటో చాన్ కబుర్లు పూర్తిగా నాలుగు గంటలు విన్నాడు.

అబ్బ ఎన్ని కబుర్లో! అమ్మకూ, పాత స్కూల్లో టీచరుకు తెలిస్తే ఎంత ఆశ్చర్యపోతారో! అనుకుంది టోటోచాన్.

తనను ఒక బడి నుంచి బహిష్కరించారని గానీ, పెద్ద వాళ్లకు అది ఎంత తలనొప్పిగా తయారైందో అని గానీ, ఆ పసిదానికి తెలియదు. తను మిగతా పిల్లలా లేనసీ, తనను అందరూ ఏదో వింతగాచూస్తున్నారనీ మాత్రం లీలగా అన్పించేది. కాని ఆ హెడ్‌మాస్టరు ముందు మాత్రం ఆ పిల్లకు అలా అన్పించలేదు. అందుకే ఎప్పటికీ ఆయన తోనే ఉండిపోవాలని పించింది.

అదృష్టవశాత్తూ ఆ హెడ్‌మాస్టరు కూడా ఆ పాపను అంత ప్రేమగానూ చూశాడు.

## మధ్యాహ్న భోజనం

పిల్లలు భోజనాలు చేసే చోటుకు ఆయన టోటో చాన్‌ను తీసుకెళ్ళాడు, "మనం భోజనం రైల్లో చెయ్యం. అసెంబ్లీహాల్లో చేస్తాం" అన్నాడు. టోటోచాన్ అంతకు ముందు ఎక్కివచ్చిన రాతిమెట్లకు పైగా అసెంబ్లీహాలు ఉంది. వాళ్ళక్కడికి వెళ్ళే సరికి పిల్లలంతా గోలగోలగా అరుస్తూ, కుర్చీలనూ బెంచీలనూ లాగుతూ వలయంగా ఏర్పాటు చేస్తున్నారు. టోటో చాన్ ఓపక్కగా నిలబడి చూస్తూ "మిగతా పిల్లలంతా ఎక్కడ?" అని అడిగింది.

"ఉన్నవాళ్లంతా వీళ్ళే!"

"వీళ్ళేనా?" ఆయన మాటల్ని నమ్మలేనట్టుగా అడిగింది.

"అవును!"

"అంటే మొత్తం బళ్ళోవుంది ఇంతమందేనా?"

"అవును! మొత్తం ఏభై మంది."

"అరే! ఈ బడిలో అన్నీ కొత్తగానే ఉన్నాయే!" అనుకుంది.

పిల్లలందరూ భోజనాలకు కూర్చున్నారు. "కొండల నుంచి కొంచెం, సముద్రం నుంచి కొంచెం తెచ్చుకున్నారా?" హెడ్‌మాస్టరు అడిగాడు.

"తెచ్చుకున్నాం!" అన్నం డబ్బాలు విప్పుకుంటూ అందరూ అరిచారు.

"ఏదీ చూడనివ్వండి, ఏం తెచ్చుకున్నారో!" హెడ్‌మాస్టరు వలయంలో తిరుగుతూ అందరి డబ్బాలూ చూడసాగారు. పిల్లలు సంతోషంతో కేరింతలు కొట్టారు.

"అరే! గమ్మత్తుగా ఉందే!" "కొండల నుంచి కొంచెం, సముద్రం నుంచి కొంచెం" అంటే ఏమిటో? టోటో చాన్ ఆశ్చర్యంలో తలమునకలైపోతూ. "ఈ బడి కొత్తరకంగా ఉంది" అనుకుంది. భోజనాలు చెయ్యడంలో కూడా ఇలాంటి కొత్తదనం వుంటుందని ఊహించలేదు. రేపు తను కూడా ఇలాగే డబ్బా తెరిచి చూపిస్తుంది. "బలే! బలే!" గంతులేసినంత పనిచేసింది.

భోజనాలు పరిశీలిస్తున్న హెడ్‌మాస్టరు భుజాల మీద మధ్యాహ్నపు సూర్య కిరణాలు వింతగా మెరిశాయి.

## టోటో-చాన్‌కు బడి మొదలైంది

ఆ రాత్రి టోటో చాన్‌కు ఎంతకూ నిద్రరావడంలేదు. తెల్లవారడం లేదు. ఏనాడూ, ఇట్లా ఎప్పుడు తెల్లవారు తుందా అని ఎదురు చూడనేలేదు. రోజూ తల్లి నిద్ర లేపాలి. కాని ఈరోజు త్వరగాలేచి స్కూలుకు తయారైపోయింది. సంచి భుజానికి తగిలించుకొని సిద్ధంగా ఉంది.

రాకీ జర్మన్ జాతి కుక్క. అందరికంటే ఖచ్చితంగా సమయం పాటిస్తుంది. టోటోచాన్ ప్రవర్తన దానికి వింతగా తోచింది. ఏదోజరగబోతుందని పించింది. వళ్ళు విరుచుకొని లేచి టోటోచాన్ పక్కకు వెళ్ళి నిల్చుంది.

తల్లికి ఆరోజు పనిపెరిగిపోయింది. "కొండల నుంచి కొంచెం-సముద్రం నుంచి కొంచెం" తో మధ్యాహ్న భోజనం తయారు చేసింది. రైలు పాసును ఒక ప్లాస్టిక్ కవర్లో పెట్టి దారంతో టోటోచాన్ మెడకు తగిలించింది.

"నా బుజ్జి తల్లి!" తండ్రి కూతుర్ని ముద్దుగా అన్నాడు.

"ఊ! మరే!" అని కాళ్లకు బూట్లు వేసుకుంది. తలుపు తెరిచి, వెనక్కు తిరిగి "వెళతాను నాన్నా!" అన్నది.

టోటో చాన్ అలా వెళుతుంటేతల్లి కళ్లు చెమ్మగిల్లాయి. ఆడే పాడేవ యసులోవున్న పసిదాన్ని, స్కూలుకు బుద్ధిగా వెళ్ళే అన్నెంపున్నెం తెలియని

పసిదాన్ని, ఒక స్కూలు నుంచి బహిష్కరించారంటే నమ్మ శక్యం కావడంలేదు, "ఈ సారయినా అంత సవ్యంగా జరిగిపోవాలి," మనసులోనే అనుకుంది ఆతల్లి.

మరుక్షణంలో, తన మెళ్లో వున్న పాసును రాకీ మెళ్లో వేస్తున్న కూతుర్ని చూసింది. కొంచెం గాభరాపడింది. కాని మౌనంగా చూస్తూ వుండిపోయింది.

రాకీ మెడలో ఆపాసు తగిలించి దానికి ఎదురుగా కూర్చుంది టోటోచాన్. "అబ్బే! నీ మెడకు ఇది ఏం బాగాలేదు," అన్నాది.

దారం పొడుగ్గా వుండడంవల్ల కుక్కమెళ్లో వేసిన పాసు నేల మీద జారాడుతున్నాది.

"ఇది నా పాస్. నీదికాదు. తెలిసిందా? నిన్ను రైలు ఎక్కనివ్వరు, అయినా బెంగపడకు. నేను మా హెడ్‌మాస్టర్ని అడుగుతాను. స్టేషన్ మాస్టర్ని కూడా అడుగుతాను. నిన్ను కూడా స్కూలుకు రానివ్వమని అడుగుతాను. సరేనా!"

రాకీ చెవులు రిక్కించి కొద్ది క్షణాలు విన్నది. ఆ తర్వాత పాసును నోటితో కొరక సాగింది.

"ఆరైలు పెట్టెలు కదలనే కదలవు. అది ఎక్కడానికి నీకు టికెట్టు అక్కర్లేదను కుంటాను. కాని ఇవ్వాళ మాత్రం నువ్వు ఇంట్లోనే వుండాలి. వుంటావు కదూ!" టోటో చాన్ రాకీతో మాట్లాడుతూనే ఉంది.

మొదటి బడికి వెళ్తున్నప్పుడు రాకీ ఆ బడిదాకా టోటో చాన్‌తో వెళ్ళి తిరిగి వచ్చేది. ఇవాళ కూడా బయలు దేరడానికి సిద్ధంగా ఉంది.

టోటోచాన్ రాకీ మెడలోనుంచి తీసి పాసుతన మెడలో వేసుకుంది. మరోసారి తల్లి దండ్రులకు వెళ్ళొస్తానని చెప్పి బయలు దేరింది.

టోటో చాన్ పరుగు లంకించుకుంది. వీపుమీద పుస్తకాల నంచి ఎగిరెగిరి పడ్తోంది. రాకీ కూడా పరిగెత్త సాగింది.

పాతబడిదారీ, స్టేషన్‌కు వెళ్ళేదారీ ఒకటే. అందువల్ల దారిలో రోజూ కన్పించే కుక్కలూ, పిల్లులూ ఎదురుపడ్డాయి. పాత స్కూలు పిల్లలు కూడా ఎదురు పడ్డారు.

స్టేషన్ దగ్గర్లో రోజూలా కుడివైపుకు తిరగకుండా, ఎడం వైపుకు తిరగడంతో రాకీ ఆగిపోయింది. ఆందోళనగా నలువైపులా పరికించి

చూడసాగింది. అప్పటికే టోటోచాన్ గేటు దగ్గరకు వెళ్ళింది. వెంటనే గిర్రున తిరిగి వెనక్కు రాకీ దగ్గరకు వచ్చింది. "రాకీ! ఇప్పుడు నేను పాత బడికి వెళ్ళడంలేదు కొత్త బడికి వెళ్తున్నాను తెలుసా?" అంటూ తన ముఖాన్ని రాకీ ముఖం దగ్గరగా పెట్టింది. రాకీ చెవులు ఎప్పటిలాగే వాసనవచ్చాయి. ఆ వాసనంటే టోటోకు ఎంతో ఇష్టం.

"సరే వెళ్తాను!" అని ముందుకు వెళ్ళిపోయింది. గేటు దగ్గర వున్న వ్యక్తికి పాసు చూపించింది, రాకీ సన్నగా మూలిగి, వెళ్ళిపోతున్న టోటోను చూస్తూ ఉండిపోయింది.

## రైలు పెట్టెల్లో తరగతి గది

క్రితం రోజు హెడ్‌మాస్టరు తరగతిగది అని చూపించిన రైలు పెట్టె దగ్గరకు వెళ్ళింది టోటో. అప్పటికి ఇంకా ఎవరూ రాలేదు. అది పాతరకం రైలు పెట్టె. దాని తలుపుకు గొళ్ళెం బయటవైపున ఉంది. ఆ గొళ్ళాన్ని రెండు చేతులతో పట్టుకొని తలుపును కుడివైపుకు జరపవచ్చు. టోటోచాన్ గుండె ఉద్వేగంతో వేగంగా కొట్టుకుంటుండగా లోపలకు తొంగి చూసింది.

"ఓష్!"

ఇక్కడ చదువు కోవడం అంటే ఎప్పుడూ రైల్లో ప్రయాణం చేస్తున్నట్టే! తేడా అల్లా ఒక వైపుగా బ్లాక్ బోర్డు వుండడమే. పొడుగ్గా వుండే సీట్లు కూడా తీసేశారు. కుర్చీలూ బల్లలూ వేశారు. అంతే! దాన్ని రైలు పెట్టెగానే ఉంచేశారు. టోటో చాన్ లోపలకు వెళ్ళి ఒక బల్ల ముందు కూర్చుంది. ఆ చెక్క కుర్చీలు మాత్రం పాత బళ్ళో కుర్చీల్లాగే ఉన్నాయి. కాని రోజంతా సుఖంగా కూర్చోవడానికి అనుకూలంగా ఉన్నాయి. టోటో చాన్ ముచ్చట పడింది. బడి చాలా బాగుంది అన్పించింది. "రోజూ బడికివస్తాను. అసలు ఒకరోజు కూడా ఎగగొట్టను," అనుకుంది.

టోటో చాన్ కిటికీలో నుంచి బయటికి చూసింది. ఆ పెట్టె కదలదని తెలుసు. కాని బయట చెట్లూ, మొక్కలూ ఊగుతూవుండడం వల్ల పెట్టె కదులు తున్నట్టుగా అన్పించింది.

"అబ్బ! ఎంత బాగుందో!" సంతోషం పట్టలేక పైకే అనేసింది. కిటికీకి

ముఖాన్ని ఆనించి ఒక పాట పాడసాగింది. ఆపిల్లకు సంతోషం కలిగినప్పుడల్లా ఆ పాట పాడుతుంది:

"నా కెంతో ఆనందం
ఆనందం-ఆనందం!
ఎందుకింత ఆనందం?
ఎందు కంటె..."

అంతలో ఎవరోలోపలకు వచ్చారు. టోటో చాన్ తల తిప్పిచూసింది. క్లాసు పిల్ల. ఆపిల్ల సంచిలోనుంచి నోటుబుక్కూ పెన్సిలూ తీసి బల్ల మీద పెట్టింది. మడమలు ఎత్తి, బొటన వేళ్ళమీద నిల్చుని పైనవున్న సామాన్ల అటక మీద సంచి పెట్టింది. బూట్లసంచిని కూడ అక్కడే పెట్టింది. టోటోచాన్ పాడడం ఆపింది. తను కూడా ఆపిల్ల చేసినట్టే చేసింది. అప్పుడే ఒక అబ్బాయి రైలు పెట్టెలోకి వచ్చాడు. వాకిట్లోనుంచే తన సంచిని, బాస్కెట్‌లోకి బాల్‌ను విసిరినట్టు అటక మీదకు విసిరాడు. అది అటక అంచునుతాకి తిరగబడి కిందపడింది. "గురితప్పింది!" అంటూ ఆ అబ్బాయి ఆ సంచిని తీసి మళ్ళీ పైకి గురిచూసి విసిరాడు. ఈ సారి అది అటక మీద ఉండిపోయింది. "అయ్యయ్యో! మర్చేపోయాను!" అంటూ బల్ల మీదకు ఎక్కి సంచి తెరిచి అందులో నుంచి నోటు పుస్తకం, పెన్సిళ్ల డబ్బా బయటికి తీశాడు.

ఒక్కొక్కరే రాసాగారు. మొత్తం తొమ్మిదిమంది తరగతి గదిలోకివచ్చి చేరారు. వాళ్ళందరూ ఆస్కూల్లో మొదటి తరగతి విద్యార్థులు.

వాళ్లంతా ఒకే రైల్లో ప్రయాణం చేసివస్తారు.

## టోమోలో పాఠాలు

రైల్లో బడికి వెళ్ళడమే అసాధారణమైన విషయం. కాని అక్కడ కూర్చునే విధానం ఇంకా చిత్రమైనది. పాత బడిలో ఎవరికి కేటాయించిన బల్లముందు సీట్లో వాళ్లే కూర్చోవాలి. కాని ఇక్కడ ఎవరైన ఎక్కడైనా కూర్చోవచ్చు.

టోటోచాన్ ఎక్కడ కూర్చోవాలా అని కొంచెం సేపు పరికించి చూసింది. తన తర్వాత పెట్టెలోకి వచ్చిన అమ్మాయి పక్కన కూర్చోవాలని నిర్ణయించు కుంది.

అన్నిటికంటే ఆ బడిలో చెప్పే పాఠాలే మరీ చిత్రంగా అన్పించాయి. సాధారణంగా ఏబళ్ళో నైనా ఒక్కో విషయానికి ఒక్కో పీరియడ్ వుంటుంది. అంటే మొదటి పీరియడ్‌లో జపనీస్ అని వుంటే అదే చెప్పాలి. అలాగే ఆతర్వాత లెక్కల పీరియడ్ అయితే లెక్కలే నేర్పాలి కాని ఇక్కడ అలా కాదు. తరగతి ప్రారంభం కాగానే టీచరు ఆనాడు చదవాల్సిన విషయాలన్నింటినీ చెబుతుంది. జవాబులు చెప్పాల్సిన ప్రశ్నలు చెబుతుంది. "ఊ! ఇక మీ ఇష్టం వచ్చిన విషయంతో మొదలు పెట్టండి," అంటుంది.

అంటే మీరు జపనీస్‌తో మొదలు పెట్టినా, లెక్కలతో మొదలు పెట్టినా లేక మీకు ఇష్టమైన ఏదైనా విషయంతో మొదలు పెట్టినా పర్వాలేదన్న మాట. చూచి రాత అంటే ఇష్టపడేవాళ్ళు దానితోనే మొదలు పెడతారు. అదే సమయంలో భౌతికశాస్త్రం అంటే ఇష్టపడేవాళ్లు నీ వెనకే సారాయిదీపం మీద గాజుకుప్పెలో ఏదో మరగ బెడుతూంటారు. కనుక ఎప్పుడైనా తరగతి గదిలో చిన్న పాటి పేలుడు కూడా జరగొచ్చు.

ఈ పద్ధతి వల్ల పిల్లల అభిరుచుల్నీ, వారి ఆలోచనా ధోరణులనూ, స్వభావాలనూ టీచర్లు గుర్తించే అవకాశం కలుగుతుంది. తమ విద్యార్థుల గురించి తెలుసుకోవడానికి ఇదొక సులభమైన మార్గం.

ఇక పిల్లల విషయానికి వస్తే-తమకు ఇష్టమైన విషయంతో బడి ప్రారంభం కావడం అంటే ఒక పండగే. అంతగా ఇష్టపడని విషయాలను ఏదో విధంగా పూర్తి చేసుకుంటారు. అక్కడ విద్యాబోధన చాలా వరకు స్వతంత్రంగా వుంటుందనే చెప్పాలి. అవసరం అయినప్పుడు ఏ విద్యార్థి అయినా నిస్సంకోచంగా టీచరు దగ్గరకు వెళ్ళి సందేహాలను తీర్చుకో వచ్చును. వాళ్లు కావాలంటే టీచరే స్వయంగా వారి దగ్గరకు వచ్చి వారి సందేహాలకు సమాధానాలు చెబుతుంది. టీచరు ఏదో చెప్పుకుంటూ పోతూవుంటే, పిల్లలు నిరాసక్తంగా వింటూ కూర్చోవాల్సిన అవసరం వుండేది కాదు.

అయితే మొదటి తరగతి పిల్లలు స్వతంత్రంగా చదువుకొనే స్థాయిలో వుండరు. అయినా వాళ్ళు వాళ్ల ఇష్ట ప్రకారమే పాఠాలు మొదలు పెట్ట వచ్చును. కొందరు అక్షరాలు దిద్దడంతో మొదలు పెడితే మరి కొందరు బొమ్మలు గీయడంతో మొదలు పెట్టేవారు. టోటో చాన్ పక్కనవున్న పిల్ల నోటు

బుక్కులో అక్షరాలు రాసుకుంటున్నది. టోటో చాన్‌కు ఏం చెయ్యాలో తోచక కొంచెం గాభరాపడింది.

టోటోచాన్ వెనక కూర్చుని వున్న కుర్రాడు లేచి నోటు బుక్కు పట్టుకొని టీచరు దగ్గర కెళ్ళాడు. టోటోచాన్ అలా వెళ్తున్న ఆ అబ్బాయి వీపును పరిశీలనగా చూడసాగింది. ఆ అబ్బాయి కాలు ఈడుస్తూ నడుస్తున్నాడు. మొత్తం శరీరం చిత్రంగా ఊగిపోతూ ముందుకు కదులుతున్నది. అతను కావాలనే అట్లా చేస్తున్నాడని ముందు అనుకుంది. కాని ఆ తర్వాత అతను అంతకంటె మరో విధంగా నడవలేడని అర్థం చేసుకుంది.

ఆ అబ్బాయి వెనక్కు తిరిగి బల్ల దగ్గరకు వస్తున్నప్పుడు ఇద్దరూ ఒకరికళ్లలోకి ఒకరు చూసుకున్నారు. ఆ అబ్బాయి చిరునవ్వు నవ్వాడు. టోటోచాన్ సమాధానం గా నవ్వింది. అతను వెళ్ళి ఆపిల్ల వెనక కూర్చున్నాడు. అబ్బాయి కూర్చోవడానికి కొంచెం కష్టపడాల్సి వచ్చింది. "ఎందు కట్లా నడుస్తున్నావ్?" టోటో వెనక్కు తిరిగి అడిగింది.

"నాకు పోలియోవచ్చింది." చిన్నగా, మృదువుగా జవాబిచ్చాడు.

"పోలియోనా?" ఆశ్చర్యంగా అన్నది టోటోచాన్. అంతకు ముందు ఆ పిల్ల ఆ పేరు వినివుండలేదు.

"ఔను! పోలియో! చేతికి కూడా వచ్చింది," అన్నాడు. టోటోచాన్ అతని చేతికేసి చూసింది. పొడవాటి చేతివేళ్లు ముడుచుకుపోయి కన్పించాయి.

"ఇక నయంకాదా?" టోటో ఆందోళనగా అడిగింది. ఆ అబ్బాయి జవాబివ్వ లేదు తను అలా అడిగి తప్పు చేశానని భావించింది. అంతలో "నా పేరు యాసువాకి యామామోటో! నీ పేరు?" ఉత్సాహంగా అడిగాడు ఆ అబ్బాయి.

ఆ అబ్బాయి గొంతులో విన్పించిన ఆప్యాయతకు ఆనందంతో "టోటోచాన్ !" అని అరిచినట్టు చెప్పింది.

ఈ విధంగా ఇద్దరూ స్నేహితులయ్యారు.

సూర్యుడు ఆకాశం మీద ఎగబాకుతుంటే రైలు పెట్టె వేడెక్కి పోతున్నది. ఎవరో కిటికీ తెరిచారు. చల్లటి గాలి లోపలకు దూసుకు వచ్చింది. ఆగాలికి పిల్లల జుట్టు చెరిగి పోయాయి.

టోమోలో టోటో మొదటి రోజు ఇలా గడిచి పోయింది.

## సముద్రం నుంచి కొంత-భూమినుంచి కొంత

"సముద్రం నుంచి కాస్త-కొండలనుంచి కాస్త" బయటికి తీసే సమయం అయింది. టోటోచాన్ ఆ సమయం కోసమే ఎదురు చూస్తున్నది ఆసక్తిగా.

ఆహారం సమపాళ్లలో వుండాలని చెప్పడానికే హెడ్‌మాస్టరు ఈ పదాలను కనిపెట్టాడు. "మీ పిల్లలకు బలమైన ఆహారం ఇవ్వండి. పుష్టికరమైన ఆహారం ఇవ్వండి." అంటూ బోధించడం ఆయనకు ఇష్టం లేదు.

"సముద్రం నుంచి కాస్త" అంటే సముద్రంనుంచి దొరికే, చేపలూ, సోయావులుసులుగానీ, బియ్యం సారాయిలోగానీ ఉడికించిన పీతలూ, మొదలైన ఆహార పదార్థాలు. "కొండల నుంచి కాస్త" అంటే భూమి మీద దొరికే కూరగాయలు, కోడి, పంది, ఎద్దు మొదలైన వాటి మాంసం.

టోటోతల్లి ఇది విని చాలా ముచ్చటపడిపోయింది. ఇంత ముఖ్యమైన విషయాన్ని ఇంత తేలిగ్గా చెప్పగల శక్తి అందరికీ ఉండదని ఆమెకు అన్పించింది. అయినా భోజనం పెద్ద ఆడంబరంగా వుండనక్కర్లేదని కూడా హెడ్‌మాస్టరు చెప్పాడు. భూమి మీది ఆహారం అంటే కూరగాయలూ, గుడ్లూ, సముద్రం ఆహారం అంటే ఎండ బెట్టిన బోనిటోముక్కలు వున్నా చాలు నన్నాడు. ఇంకా సాదాగా వున్నా పర్వాలేదన్నాడు.

ఆయన ప్రతి ఒక్కరి ముందు నిల్చుని రెండు రకాల ఆహారం తెచ్చుకున్నారో లేదో చూసేవాడు. వాళ్ళకు అలా చూపించడం సర్దాగా వుండేది.

ఒక్కొక్క సారి కొందరు పిల్లలు ఏదో ఒకరకమైన ఆహారాన్నే తెచ్చుకొనేవారు. అయినా వాళ్లకు ఇబ్బంది వుండేదికాదు. ఆయన ఒక్కొక్కరి టిఫెన్ డబ్బా పరిశీలిస్తూ ముందుకు వెళ్తూవుంటే, ఆయన వెనకే ఆయన భార్య రెండు చేతులతో రెండు గిన్నెలు పట్టుకొని నడిచేది. ఆయన ఏ విద్యార్థి ముందయినా ఆగి "సముద్రం" అంటే, ఆమె వెంటనే సముద్రపు ఆహారంవున్న గిన్నెలోనుంచి చేపముక్కలు కాస్త తీసి ఆ విద్యార్థి డబ్బాలో వేసేది. "కొండలు" అనగానే రెండో గిన్నెలో వున్న కూరగాయముక్కలు తీసి వేసేది.

"నాకు చేపముక్కలు సహించవు" అని ఎవరూ అనేవాళ్లు కాదు. ఎవరు మంచి ఆహారం తెచ్చుకున్నారని కూడా ఆలోచించేవాళ్లు కాదు. కేవలం రెండు రకాల ఆహారంవుందా? లేదా అని మాత్రమే చూసేవారు.

తల్లి ఇచ్చిన టిఫిన్ డబ్బాలో "కొండలనుంచి కాస్త-సముద్రంనుంచి కాస్త" వుందో లేదో నన్న అనుమానం వచ్చింది టోటోచాన్‌కు. డబ్బా తెరిచిచూసి "అబ్బ! ఎంత బాగుందో!" కేకలు పెట్టకుండా వుండలేక పోయింది.

టోటోచాన్‌కు డబ్బాలో లేత పసువు రంగులో గుడ్ల కూర కన్పించింది. పచ్చి బఠాణి కూర. గౌర రంగులో వున్న డెన్‌బు, గులాబి రంగులో గండు మీను గుడ్లు కన్పించాయి. అందంతా ఒక రంగు రంగుల పూల తోటలా వుంది.

"చాలా బాగుంది!" అన్నాడు హెడ్‌మాస్టరు.

"మా అమ్మ బలేగా వండుద్దిలే" అంది ఉత్సాహంగా టోటోచాన్.

"ఔనా! నిజంగా!" అని, డెన్‌బువైపు చూపిస్తూ "ఇదేమిటో చెప్పు చూద్దాం," అన్నాడు.

టోటోచాన్ పరిశీలనగా చూసింది. అదిమట్టిరంగులో వుంది కనక కొండలనుంచి వచ్చిందే ననుకుంది. కాని "నాకు తెలీదు," అనేసింది.

హెడ్‌మాస్టరు పిల్లల్నందర్నీ ఉద్దేశించి" పిల్లలూ! డెన్‌బూ ఎక్కడ నుంచి వస్తుంది?" అని అడిగాడు.

"కొండలనుంచి" అని కొందరు-సముద్రం నుంచి అని కొందరు అరిచారు. కాని ఎవరికీ ఖచ్చితంగా తెలియదు.

"సరే! నేనే చెప్పనా!" అని ఓక్షణం ఆగి "డెన్‌బు సముద్రంలోనుంచి వస్తుంది," అన్నాడు.

"ఎందుకని?" ఒక కుర్రాడు అడిగాడు. "చేపల్ని పులుసువండుతారు. ముళ్ళు తీసేసి మాంసం వేపుతారు. ఆవేపుడును చిన్న చిన్న ముక్కలుగా కోస్తారు. ఆ తర్వాత మసాలా పట్టించి ఎండ బెట్టి నిలవ చేస్తారు," అని చెప్పాడు.

"అదా!" అందరూ అరిచారు. టోటోచాన్ డెన్‌బును చూడొచ్చా." ఎవరో అడిగారు.

"తప్పకుండా చూడండి."

అంతే బడిలోవున్న పిల్లలందరూ టోటోచాన్ డెన్‌బూను చూడడానికి వచ్చారు. కొందరికి తెలిసినా టోటో చాన్ డెన్‌బు ఎలా వుందో కుతూహలంతో చూడడానికి వచ్చారు. పిల్లలందరూ వాసన చూస్తు ఎగబీలిస్తే, ఆముక్కలు సున్నిసున్నె ఎగిరి పోతాయేమోనని భయపడింది టోటో చాన్.



మొదటి రోజు భోజనాల దగ్గర టోటోచాన్ కొంచెం మొహమాటపడింది. అయినా సర్దాగా నే అన్పించింది. డెన్‌బును చేపల నుంచి తయారు చేస్తారని అంతవరకు ఆ పిల్లకు తెలియదు. తన తల్లి కూడా "కొండల నుంచి కాస్త-సముద్రం నుంచి కాస్త" భోజనంలోకి పెట్టినందుకు సంతృప్తి చెందింది. తినడానికి కూడా ఎంతో రుచిగా ఉంది.

## "బాగా నమలండి!"

ఇక్కడ సాధారణంగా భోజనం ప్రారంభించే ముందు "ఇటాడాకిమాను" (కృతజ్ఞతా పూర్వకంగా నేను దాన్ని స్వీకరిస్తున్నాను) అంటారు. కాని ఈ బడిలో పద్దతి వేరుగా ఉంది. మొదట అందరూ పాట పాడతారు. హెడ్‌మాస్టరు సంగీతకారుడు కూడ. మధ్యాహ్న భోజనానికి ముందు పాడేపాట ఒకటి తయారు చేశాడు. ఆ పాట" "రో-రో-రో-యువర్-బోట్" అనే పాట బాణీలో నే తయారు చేశాడు. మాటలు మాత్రం కొత్తవి- బాణీ అందరికీ తెలిసిందే.

"నములు, నములు, నములు,
బాగా నములు తిన్నదంతా నములు;
అన్నం నములు- చేపలు నములు
మాంసం నములు-నములు-నములు!"

ఈ పాట పాడిన తర్వాత "ఇటాడాకి మాను" అనేవాళ్ళు, స్కూలు వదిలాక కూడా చాలా కాలం వరకూ అన్నం ముందు కూర్చోగానే ఆపాట మనసుల్లో మెదిలేది, అక్కడ చదివిన వారికి.

బహుశా పళ్లూడి పోయాక ఆయన ఈ పాటను తయారు చేశాడేమో! కాని ఆయన పిల్లలకు చిన్నగా తాపీగా, బాగా నమిలి తినమని చెప్తూ వుండేవాడు. అన్నం తింటున్నప్పుడు ఆనందంగా మాట్లాడు కుంటూ తినాలని చెప్పేవాడు.

పిల్లలంతా గొంతెత్తి ఆపాట పాడేవాళ్లు. ఆ తర్వాత తినడానికి కూర్చునే వాళ్లు.

కొద్ది క్షణాలు అసెంబ్లీహాలు నిశ్శబ్దంగా వుండేది.

## బళ్ళో షికార్లు

మధ్యాహ్నం భోజనం తర్వాత టోటో చాన్ ఇతర పిల్లలతో కలిసి కాసేపు ఆడుకుంది. వాళ్ళంతా తరగతిలోకి వచ్చేసరికి టీచర్ వారికోసం ఎదురు చూస్తువుంది.

"మీరందరూ పొద్దుటి నుంచి కష్టపడిచదివారు. మరి ఇప్పుడు ఏం చేద్దా మనుకుంటున్నారు?" టీచరు అడిగింది.

"షికారు కెళదాం" అనేక గొంతులు పలికాయి.

"అలాగే!" అన్నది టీచరు.

పిల్లలందరూ బయటికి పరుగు తీశారు. టోటోచాన్ తండ్రితో, రాకీతో షికార్లు వెళ్తూ వుంటుంది. అలా వెళ్ళడం ఆమెకు చాలా ఇష్టం. కాని బడిలో కూడా షికార్లు వుంటాయని ఇంత వరకు తెలియదు. ఆశ్చర్యంతో పాటు సంతోషం కలిగింది. అందరితో పాటు ఉత్సాహంగా బయటికి పరుగు తీసింది.

ఆరోజు చెయ్యాల్సిన పనంతా ఉదయంపూట ముగిస్తే మధ్యాహ్నం తర్వాత షికారుకు వెళ్ళొచ్చు నన్న సంగతి తర్వాత తెలిసింది టోటోచాన్‌కు. మొదటి తరగతి పిల్లలకయినా, ఆరో తరగతి పిల్లల కైనా ఒకటే పద్ధతి.

మొదటి తరగతికి సంబంధించిన తొమ్మిదిమంది పిల్లలు టీచరుతో షికారుకు బయలు దేరారు. ఒక సెలఏరు వద్దకు వచ్చారు. ఆ సెలఏరు రెండు వైపు గట్లమీద చెర్రీచెట్లు ఉన్నాయి. కనుచూపుమేరలో వనువుచ్చపూలతో పొలాలు విస్తరించి వున్నాయి. సెలఏట్లో నీరు ఏనాడో ఎండిపోయింది. దాని గుర్తులు కూడా మిగల్లేదు. ఆ ప్రదేశం భవనాలతో, దుకాణాలతో నిండి పోయింది. కాని ఒకప్పుడు ఆ సెలఏరు చుట్టూ పచ్చటి పొలాలు పరచుకొని వుండేవి.

"మనం కుహోంబుట్సు గుడి వరకూ వెళ్దామా?" గౌను మీద కుందేలు బొమ్మ వున్న పిల్ల అడిగింది. ఆపిల్ల పేరు సాకోచాన్.

"మరేమో! అప్పుడు వెళ్ళినప్పుడు కొలను పక్కన పాము కన్పించింది తెలుసా? అక్కడ ఒక పాడుపడి పోయిన బావి కూడా వుంది. దాంట్లో ఒకసారి ఆకాశం నుంచి ఓ చుక్క తెగి పడిపోయిందంట" అన్నది సాకోచాన్.

పిల్లలు ఏవేవో మాట్లాడుతూ నడుస్తున్నారు. పైన నీలాకాశం, సీతాకోక చిలకలు గాలిలో ఎగురుతున్న శబ్దాలు!

టీచరు ఆగిపోయింది. పిల్లలకేసి తిరిగి "అటు చూడండి. ఆపూలను చూడండి. పూలు ఎందుకు పూస్తాయో తెలుసా" అని అడిగింది. పువ్వులు కాయలుగా మారడానికి సీతాకోక చిలుకలు ఏం చేస్తాయో వివరంగా చెప్పింది.

టీచర్ ముందుకు కదిలింది. పిల్లలు కూడా ఆమెను అనుకరించారు.

పువ్వు మధ్యలోని దిమ్మె "పిస్టల్" అంటారని తెలిసిన ఓ పిల్ల "అవి పిస్తోళ్లలాగ లేవుగదూ?" అని అడిగింది.

టోటోచాన్‌కు కూడా అట్లా అన్పించలేదు. కాని పూలలో అతి ముఖ్యమైన భాగాలని మాత్రం అర్థం చేసుకుంది.

మరో పదినిముషాలు ముందుకు నడిచారు. చెట్లతో దట్టంగా వున్న ఒక తోట కన్పించింది. ఆతోట మధ్యలో 'కుహోంబుట్సు' గుడి వుంది. తోటలోకి ప్రవేశించ గానే పిల్లలంతా తలొకవైపుకు పరుగులు తీశారు.

"చుక్క తెగిపడిపోయిన బావి చూస్తావా?" అడిగింది సాకోచాన్. టోటోచాన్ కుతూహలంగా ఆపిల్లను అనుసరించింది.

ఆ బావి రాతితో కట్టబడింది. బావిచుట్టూ వున్న అంచు వాళ్ల గుండెల దాకా వచ్చింది. ఆ బావి మీద చెక్క మూత ఉంది. వాళ్లు ఆ మూత ఎత్తిలోపలకు తొంగి చూశారు. లోపల కటిక చీకటి. రాయిలాంటి దేదో ఉన్నట్టు అన్పించిందే కాని తళతళ మెరిసే చుక్క మాత్రం కన్పించలేదు. "నువ్వు ఆ చుక్కను చూసావా?" టోటోచాన్, సాకోచాన్‌ను అడిగింది.

"ఊఁ హూఁ! నేనూ చూడలేదు."

"ఆ చుక్క ఎందుకు మెరవడం లేదో! బహుశా నిద్దర పోతుందేమో!" అన్నది టోటోచాన్.

"ఏంటీ? చుక్కలు నిద్రపోతాయా?" తన పెద్దపెద్ద కళ్లను గుండ్రంగా తిప్పుతూ ఆశ్చర్యంగా అడిగింది సాకో.

టోటోచాన్‌కూ ఖచ్చితంగ తెలియదు. "అవి పగలంతా నిద్రపోతాయి. మరి రాత్రిళ్లు మెరవాలిగా?" అన్నది.

పిల్లలంతా గుడి చుట్టూ తిరిగారు. గుడిని రక్షిస్తున్నట్టుగా సింహద్వారానికి రెండు వైపులా వున్న విగ్రహాల బాన కడుపులు చూసి పడిపడినవ్వారు. గర్భగుడిలో మసక చీకట్లో వున్న బుద్ధుని విగ్రహం ముందు భక్తిగా నిలబడ్డారు.

టెంగు అనే పొడవు ముక్కు గల దయ్యం పాద ముద్రను రాతిమీద చూశారు. తమ పాదాలు ఆ ముద్రలో పెట్టుకొని కొలుచుకున్నారు. కొలనులో, బోట్లలో షికారు చేస్తున్నవాళ్లకు చేతులు ఊపుతూ అరిచారు. సమాధుల చుట్టూ మెరుస్తున్న గులకరాళ్ళ మీద గంతు లేస్తూ ఆడుకున్నారు. ఇదంతా టోటోచాన్‌కు కొత్తగా ఉంది. అద్భుతంగా ఉంది.

సూర్యుడు అస్తమించ బోతున్నాడు. "ఇక వెళ్దాం! పదండి!" అన్నది టీచరు.

ఈ షికార్లు పిల్లలకు స్వేచ్ఛగా ఆడుకోవడానికి అన్నట్టుగా వుండేవి. కాని, నిజానికి, ఇవి విజ్ఞాన శాస్త్రంలో చరిత్రలో, జీవశాస్త్రంలో విలువైన పాఠాలు అని అప్పుడు ఆపసివాళ్లు గుర్తించలేదు.

"రేపు మళ్లీ షికారుకు వద్దాం!" అన్నది టోటోచాన్ పిల్లలతో. అప్పటికే చాలామందితో స్నేహం ఏర్పడిపోయింది.

"తప్పకుండా." అందరూ ఒకేసారి అన్నారు.

సీతాకోక చిలుకలు తమపనిలో తీరిక లేకుండా వున్నాయి. గాలి పక్షుల కలకలాల్తో నిండిపోయింది. టోటోగుండె ఆనందంతో పొంగిపోయింది.

## బడి పాట

టోమోగా కుయెన్ లో టోటోచాన్‌కు ఏరోజు కా రోజే ఏదో ఒక వింత ఎదురౌతూనే వుండేది. ప్రతి రాత్రీ ఎప్పుడు తెల్లవారు తుందా అని ఎదురు చూసేది. బడి నుంచి ఇంటికి వస్తూనే తల్లిదండ్రులతో, రాకీతో, ఆరోజు జరిగిన వింతల గురించి ఏకరువు పెట్టేది. "ఇక చాల్లే తల్లీ. ఇక ఆకబుర్లు కాసేపు ఆపి ఏదైనా తిను," అని తల్లి వారించే దాక మాట్లాడుతూనే వుండేది.

ఆ బడి బాగా అలవాటయ్యాక కూడా ఆపిల్లకు ఇంటి దగ్గర చెప్పడానికి ఏరోజు కా రోజు బోలెడన్ని కబుర్లుండేవి. బడి పట్ల కూతురికిగల ఆసక్తి చూసి తల్లి చాలా సంతోషపడేది.

ఒక రోజు రైల్లో బడికి వెళ్తుండగా టోటోచాన్‌కి అకస్మాత్తుగా ఓ సందేహం వచ్చింది. అది తమ స్కూలుకు ప్రత్యేకమైన పాట ఉందా లేదా అని. వెంటనే తెలుసుకోవాలనే కోరిక కలిగింది. రైల్లో స్థిమితంగా కూర్చో లేక పోయింది.

దిగ్గున లేచి గేటు దగ్గరకు వచ్చి నిలబడింది. ఇంకా రెండు స్టేషన్లు దాటాలి. అయినా దూకడానికి సిద్ధంగా వున్నట్టుగా నిల్చుంది. ఒక స్టేషన్‌లో బండి ఆగింది. ఒక స్త్రీ రైలు ఎక్కింది. గేటులో పరుగు పందెంలో పరుగు తియ్యడానికి సిద్ధంగా వున్నట్టుగా, గేటులో నిల్చుని వున్న టోటోచాన్‌ను చూసి "ఈపిల్లకు ఏమైంది?" అనుకుంది.

రైలు ఆగీ ఆగ గానే టోటోచాన్ మెరుపులా దూకేసింది. "జియుగౌన్! జియుగౌన్! దిగేవాళ్ళు దిగండి!" అంటూ అరిచాడు కండక్టరు అప్పటికే టోటోచాన్ స్టేషన్ బయటికి వచ్చేసింది.

రైలు పెట్టె తరగతిలోకి దూసుకొని వచ్చింది. అప్పటికే అక్కడ వున్న తాయిజీయమనోచినిని "తాయిచాన్! మన బడికి పాట లేదా?" ఉద్వేగంగా అడిగింది.

కొద్ది నిముషాలు ఆలోచించి "లేదను కుంటాను" అన్నది తాయిచాన్. ఆ పిల్లకు భౌతికశాస్త్రం అంటే ఇష్టం.

"అరెరే! లేదా! మన బడికి ఒక పాటవుండాలి. మాపాత బడికి వుండేది," అని పెద్దగా పాట పాడసాగింది టోటోచాన్.

"సెంజోకు సరస్సు నీటిలోతు తక్కువైతే నేం- మా చదువుల దొరువుల లోతు ఎంతో ఎక్కువ..."

టోటో చాన్ ఆబడికి వెళ్ళింది చాలా తక్కువ రోజులే అయినా పాట మాత్రం బాగానే గుర్తుంది.

తాయిచాన్‌కు కూడా ఆపాట నచ్చింది. పాట పూర్తి అయేసరికి మిగతా పిల్లలు కూడా వచ్చారు. అంత కఠిన పదాలతో వున్న పాట ఆ పిల్లలకు కూడా నచ్చింది.

"మన బడికి ఒక పాట కావాలని హెడ్‌మాస్టర్ని అడుగు దాం," అన్నది టోటోచాన్.

"సరే! పద అడుగుదాం!" అందరూ హెడ్‌మాస్టరు దగ్గరకు బయలు దేరి వెళ్ళారు.

టోటోచాన్ హెడ్‌మాస్టరుకు పాట పాడి వినిపించింది. "సరే! రేపటికి మన బడికి కూడా పాట తయారు చేస్తానులే," అన్నాడు హెడ్‌మాస్టరు.

"తప్పకుండా చెయ్యాలి." పిల్లలందరూ ఉద్వేగంగా అరిచారు. ఆతర్వాత అక్కడ్నుంచి వెళ్ళిపోయారు.

మరునాడు ఉదయం అన్ని తరగతుల లో బోర్డు మీద ఒక గమనిక కన్పించింది. పిల్లలందర్నీ స్కూలు ఆవరణలో గుమికూడవలసిందిగా వుంది. పిల్లలందరూ బడి ఆవరణలోకి వచ్చి చేరారు! వారి మధ్యకు ఒక బ్లాకు బోర్డు తెచ్చి పెట్టారు. ఇదుగో! మీ బడికి పాట! అన్నాడు హెడ్‌మాస్టరు. ఆయన ఆ బోర్డుమీద సమానాంతరంగా ఐదు సరళ రేఖలు గీశాడు. ఆ గీతల మీద సంగీత చిహ్నాలు రాశాడు.



టోమో, టోమో, టోమో!

ఆ తర్వాత రెండు చేతులూ ఊపుతూ సంగీత దర్శకుడిలా "మనం ఇక ఈ పాట పాడదాం! గొంతులు ఎత్తండి" అన్నాడు హెడ్‌మాస్టరు.

ఆయన లయబద్ధంగా చేతులు ఊపుతూవుంటే పిల్లలందరూ గొంతులు ఎత్తారు.

"టోమో--టో-మో-టో-మో!"

"పాటంతా ఇంతేనా!" ఠక్కున పాట ఆపి అడిగింది టోటోచాన్.

"అవును! అంతే!" గర్వంగా అన్నాడు హెడ్‌మాస్టరు.

"ఇంకాస్త వుంటే బాగుండేదిగా" సంకోచకు సరస్సులో నీటిలోతు తక్కువైతేనేం-లాగ వుంటే బాగుండేది" నీరసపడిపోతూ అన్నది టోటో.

"ఇది నీను బాగాలేదా? నేను బాగానే ఉందను కున్నానే?" అన్నాడు చిరునవ్వుతో

ఆమాటకొస్తే ఆ పాట ఎవరికీ నచ్చలేదు ఇలాంటి పాట లేక పోతేనే నయం అన్పించింది.

ఆ విషయం హెడ్‌మాస్టరు గ్రహించాడు. ఆయనకు కోపం రాలేదు. కాని కొంచెం నిరాశ చెందాడు. బ్లాక్ బోర్డు మీది అక్షరాలు చెరిపేశాడు. తాము మొరటుగా ప్రవర్తించామేమో ననిపించింది టోటోచాన్‌కు.

ఆ పిల్లల పట్ల, ఆ బడి పట్ల గల ప్రేమను ప్రదర్శించడానికి హెడ్‌మాస్టరుకు అంతకంటే వేరే మార్గం కన్పించలేదు. అయితే ఆ పిల్లలకు ఆయన భావాలను అర్థం చేసుకోగల వయసు లేదు. ఆ తర్వాత పిల్లలు బడిపాట గురించి మర్చి పోయారు. ఆ బడికి ఎన్నడూ ప్రత్యేకమైన పాట లేదు. అది అంత అవసరం అని హెడ్‌మాస్టరుకు అన్పించలేదు.

## "మళ్ళీ పూడ్చెయ్యి!"

టోటోచాన్ ఆరోజు కష్టపడినట్టు ఏనాడూ కష్టపడలేదు. ఆరోజు చాలా చెడ్డ రోజు. పర్సు మరుగుదొడ్లో పడిపోయింది. ఆపర్సంటే ఆపిల్లకు మహా ఇష్టం. దొడ్లోకి వెళ్ళేప్పుడు కూడా దాన్ని వదలదు. అది నిజంగా నే చాలా అందంగా వుండేది. సిల్కు బట్టతో తయారు చెయ్యబడింది. దాని మీద రంగురంగుల గళ్ళు ఉన్నాయి. త్రిభుజాకారంలో వున్న ఆపర్సు మూతకు వెండిగుండీ ఉంది.

టోటోచాన్‌కు చిన్నప్పట్నుంచీ ఒక చిత్రమైన అలవాటు ఉంది. దొడ్డికి కూర్చోవడం పూర్తి అయ్యాక వంగి కన్నంలోకి చూసేది. అలా ఎన్నో టోపీలు పోగొట్టుకుంది. గడ్డి టోపీ, తెల్లటి లేసు టోపీ కూడా పోగొట్టు కుంది.

ఇప్పటిలా ఆరోజుల్లో దొడ్లు నీళ్ల ధారతో శుభ్రమయ్యే అవకాశం వుండేదికాదు. రంధ్రం కింద పెద్ద మురికి గుంట వుండేది. ఆమురికి గుంటలో టోపీలు తేలుతూ వుండేవి. తల్లి టోటోచాన్‌ను అలా వంగి చూడొద్దని హెచ్చరించేది.

ఆరోజు బడి ఇంకా మొదలు కాలేదు. టోటోచాన్ దొడ్లోకి వెళ్లింది. తల్లి హెచ్చరిక మర్చిపోయి వంగి రంధ్రంలోకి చూడసాగింది. చేతిలో పట్టుకున్న పర్సు జారి రంధ్రంలో పడిపోయింది. కింద చీకటిలోకి అది కలిసిపోతూవుంటే పెద్దగా కేక పెట్టింది.

టోటోచాన్ ఏడవ కూడదనుకుంది. ఎలాగయినా దాన్ని బయటకు తియ్యాలని అనుకుంది. పక్కనే వున్న పాకలోకి వెళ్ళి కర్ర తెడ్డును పట్టుకొచ్చింది. పొడవాటి ఆతెడ్డుతో మాలి చెట్టుకు నీళ్లు పెడతాడు. ఆ తెడ్డు ఆపిల్ల కంటే రెండింత లెక్కువ పొడవుగాఉంది. అయినా టోటో వెనక్కు తగ్గలేదు. అది తీసుకొని బడి వెనక భాగానికి నడిచింది. గుంట శుభ్రం చెయ్యడానికి తీసే మూతకోసం వెదికింది దొడ్డి గోడ పక్కన వెదికింది. అక్కడ కన్పించలేదు. ఆపిల్ల పట్టుదల వదల్లేదు. కొంచెం దూరంలో ఒక గుండ్రని సిమెంటు మూత కన్పించింది. కష్టపడి మూత ఎత్తి, లోపలకు తొంగి చూసి ఆశ్చర్యపోయింది.

"అరే! ఇది కుహాంబుట్సు కొలనంత పెద్దగా వుందే?" అనుకుంది.

టోటోచాన్ పని మొదలు పెట్టింది. ఆ గుంటలోని మురుగును తెడ్డుతో తోడి బయటపోయసాగింది. ముందు పర్సు పడిపోయిన చోట మాత్రమే తోడడానికి ప్రయత్నించింది. కాని ఆ గుంట మూడు దొడ్లకు కలిసి ఒకటే కనక చాలా పెద్దదిగా, లోతుగా వుంది. చీకటిగా కూడా ఉంది. లోపలకు తలపెట్టి వంగితే తనే పడిపోతానేమోనని భయపడింది. తెడ్డుతో మురుగుతోడి బయట పోయసాగింది. తెడ్డు తీసిన ప్రతి సారీ పర్సు అందులోకి వచ్చిందో లేదో నని పరిశీలనగా చూసేది. పర్సుదొరకడానికి అంత సేపు పడుతుందని అనుకోలేదు. ఎంత సేపటికీ పర్సు జాడే కన్పించడంలేదు. బడి మొదలయ్యే సమయం అయింది. ఏమైందిపర్సు! ఇప్పుడేం చెయ్యాలి? ఆపెయ్యాలా! ఆపకూడదు. పర్సును ఎలాగయినా వెదికి పట్టుకోవాలి.

ఇనుమడించిన శక్తితో తెడ్డుతో మురుగుతోడి తోడి గుంటచుట్టూ పోస్తోంది. పెద్ద మురుగు కుప్ప తయారైంది. అటుగావచ్చిన హెడ్‌మాస్టరు అదిచూసి "ఏం చేస్తున్నావ్?" అని అడిగాడు.

"నా పర్సు పారేసుకున్నాను," చేస్తున్నపని ఆపకుండానే సమాధానం

ఇచ్చింది.

"అలాగా!" అనేసి ఆయన వెళ్ళి పోయాడు వెనక్కు చేతులు కట్టుకొని. నడిచేప్పుడు ఆయనకు చేతులు వెనక్కు కట్టుకోవడం అలవాటు.

పెరిగిపోతున్న మురుగు కుప్ప కంపు కొడుతోంది. అదేమీ పట్టించుకోకుండా తనపని తాను చేసుకు పోతూనే ఉంది టోటోచాన్.

"దొరికిందా?" తిరిగి వచ్చిన హెడ్‌మాస్టరు అడిగాడు.

"లేదు." మురుగు కుప్ప మధ్యలో నిలబడి సమాధానం ఇచ్చింది. వళ్ళంతా చెమట్లు పట్టివుంది. బుగ్గలు ఎర్రబడ్డాయి.

హెడ్‌మాస్టరు దగ్గరగా వచ్చాడు. "నీ పనిపూర్తి అయ్యాక మళ్లీ దీన్నంతా లోపలకు తోసేస్తావుగదూ?" అతి మామూలుగ అడిగాడు.

"సరే!" తలఎత్తకుండా పని చేసుకుపోతూనే జవాబిచ్చింది. ఆయన వెళ్ళి పోయాడు. టోటోచాన్ పని ఆపి కుప్పను చూసింది, "దీన్నంతా లోపలకు తొయ్యవచ్చు. కాని ఆ మురుగు నీటిని ఎలాలోపలకు పంపించడం!" అనుకుంది.

మురుగుకుంటలో నుంచి కుప్పతోపాటు వచ్చిన నీరు భూమిలోకి ఇంకిపోతున్నది. నేలంతా చితచిత లాడిపోతున్నది. దాన్నంతా లోపలకు పంపించడం ఎలాగా అని ఆలోచిస్తూ కొంచెం సేపు నిల్చుండిపోయింది. "తడిచిపోయిన నేల మీద మట్టిని కూడా గీకి పడేస్తే సరి!" అనుకుంది.

అప్పటికే ఆకుప్ప ఓగుట్టలా తయారైంది. గొయ్యి దాదాపు ఖాళీ అయింది. అయినా పర్సు కన్పించలేదు. ఏమైందో? ఎక్కడ ఇరుక్కుపోయిందో ఇక లాభం లేదు!

హెడ్‌మాస్టరు తను చేస్తున్నపనికి కోపం తెచ్చుకోక పోవడం టోటోచాన్‌కు ఆశ్చర్యాన్నే కలిగించింది.

ఆ పరిస్థితిలో పెద్ద వాళ్లు ఎవరు చూసినా "ఏమిటీపని?" అనో "ఛ! ఛ! ఇక ఆపు! భద్రం! పడిపోతావు" అనో లేక "నేనూ సహాయం చెయ్యనా?" అనో, అని వుండేవాళ్లు. "నీ పనంతా అయిపోయాక మళ్లీ లోపలకు తోసేస్తావుగదూ?" అని అడగడాన్ని ఎవరూ ఊహించలేరు. టోటో చాన్ నుంచి జరిగిన విషయం విన్న ఆమె తల్లి "ఆయన ఎంత మంచివాడో?"

అని అనుకుంది.

ఈ సంఘటన తర్వాత ఆపిల్ల మళ్లీ ఎప్పుడూ దొడ్డికి వెళ్ళాక వంగి రంధ్రం లోకి తొంగి చూడలేదు.

టోటోచాన్ తనమాట ప్రకారం మళ్ళీ ఆకువ్వంతా రంధ్రంలోకి తోసేసింది. బయటికి తియ్యడం చాలా కష్టం అయింది కాని గోతిలోకి నెట్టెయ్యడం అంతగా కష్టం అన్పించలేదు. తడిచి లసలస లాడు తున్న నేలను కూడా గోకి పోసింది. నేల చదును చేసింది. రంధ్రం మీద మూత పెట్టింది. తెడ్డు తీసుకెళ్ళి పాకలో పెట్టింది.

రాత్రి మంచం మీద పడుకొని తన అందమైన పర్సును గుర్తు చేసుకుంది. పగలంతా కష్టపడడం వల్ల వెంటనే నిద్రలోకి జారిపోయింది.

అక్కడ, ఆ బడి ఆవరణంలో, నేల—ఆపసిబిడ్డ కష్టపడి చదును చేసిన ఆనేల, వెన్నెల్లో మిలమిల మెరుస్తోంది.

మరో చోట ఎక్కడో పర్సు విశ్రాంతి తీసుకుంటోంది.

## టోటోచాన్ పేరు

టోటోచాన్ అసలు పేరు టెట్సుకో. ఆమె పుట్టక ముందు, పుట్ట బోయేది మగ బిడ్డే నన్నారు అందరూ. మొదటి సంతానం కనక తల్లిదండ్రులు కూడా అదే కోరుకున్నారు. అంతే కాదు, పుట్ట బోయే పిల్లవాడికి 'టోరు' అని పేరు పెట్టాలని కూడా అనుకున్నారు. ఆడపిల్ల పుట్టినందుకు కొంత నిరాశ చెందారు. అయితే ఆ భార్యా భర్త లిద్దరికీ టోరు అన్న పేరు చాలా నచ్చింది. అందువల్ల దాన్నే కొంత మార్చి 'టెట్సు' అనిపెట్టారు. అమ్మాయిల పేర్లకు చివర 'కో' అనే అక్షరం వుంటుంది. అలా ఆ పిల్ల పేరు టెట్సుకో అయింది. 'టోరు' అంటే అర్థం-చొచ్చుకుపోవడం, సాగదీయడం, కంఠ స్వరంలా ధ్వనిలా ఉండడం అని.

జపాన్‌లో ఒక వ్యక్తిని పేరు తో పిలుస్తున్నప్పుడు పేరుకు చివరన 'సాక్' లేదా 'చాన్' అని తగిలిస్తారు. అవిధంగా ఆపిల్ల పేరు టెట్సుకో చాన్ అయింది. ఆ పిల్లను ఎవరైనా నీ పేరేమిటి అంటే "టోటోచాన్" అనే సేది. చాన్ కూడా పేరులో భాగమేనని భావించేది.

తండ్రి ఆపిల్లను మగ పిల్లవాడిని పిల్చినట్టుగా టాట్స్కీ అని పిల్చేవాడు. "టాట్స్కీ! ఇలారారా! ఈ గులాబి పూలకు పురుగులు పట్టాయి. దులిపేద్దాంరారా! నాన్నా!" అని పిల్చేవాడు. తండ్రి తప్ప అందరూ టోటోచాన్ అనే పిల్చేవారు. పుస్తకాల మీద తన పేరు పెట్టుకో అని రాసుకుంటూ కూడా తన పేరు టోటోచాన్ అనే అనుకొనేది.

## రేడియో హాస్యనటులు

"ఇక నుంచి నువ్వు రేడియోలో హాస్యనటుల ప్రోగ్రాం విన కూడదు," అని తల్లి అన్నప్పుడు టోటోచాన్ నిరుత్సాహ పడింది.

టోటోచాన్ చిన్నతనంలో రేడియోలు చెక్కతో తయారయి పెద్దసైజులో వుండేవి. అవి చూడడానికి అద్భుతంగా వుండేవి. స్పీకర్ మీద గులాబిరంగు సిల్క్‌తెర వుండేది. టోటోచాన్ ఆతెరకు చెవి ఆనించి హాస్యనటుల సంభాషణలు వినేది. బడికి వెళ్ళడం మొదలు కాగానే తల్లి రేడియో వినొద్దని చెప్పేసింది.

గత రాత్రి తండ్రి స్నేహితులు ఇంటికి వచ్చారు. వాళ్ళంతా సంగీత బృందంలోనివాళ్ళే. వాళ్ళు ఒకగదిలో చేరి తంత్రి వాద్యాల మీద సంగీత సాధన మొదలు పెట్టారు.

"బేబీ! చూడు! నీకోసం టాచిచానా అరటిపండ్లు తెచ్చాడు," అని తల్లి చెప్పింది. టోటోచాన్ సంతోషంతో గంతు లేసినంతపని చేసింది. టాచిచానాకు కృతజ్ఞతలు చెప్పింది. "అమ్మో! మరే మో! ఈ పళ్లు ఎంతో బాగున్నాయి కదూ?" అంది ఉత్సాహంగా.

తల్లి దండ్రులు లేనప్పుడు రేడియో వినేది. హాస్య సంభాషణలు వింటూ పొట్ట ఉబ్బేలా విరగబడి నవ్వేది. పెద్ద వాళ్లెవరైనా ఆ దృశ్యం చూస్తే "ఇంత చిన్న పిల్లకు అంతంత పెద్ద మాటలు ఎలా అర్థం అవుతున్నాయో?" అని ఆశ్చర్యపోతారు. కాని చిన్న పిల్లల్లో కూడా హాస్యాన్ని ఆస్వాదించే శక్తి ఉంటుందని మనం ఆలోచించం.

మరో రైలు పెట్టె వచ్చింది.

"ఇవ్వాళ రాత్రికి ఇంకో రైలు పెట్టె రాబోతోంది తెలుసా?" అన్నది మియోచాన్ మధ్యాహ్నం భోజనాలు చేస్తున్న సమయంలో. ఆ అమ్మాయి హెడ్‌మాస్టరు మూడో కూతురు. టోటోచాన్ తరగతి లోనే చదువుతున్నది.

అప్పటికే అక్కడ ఆరు రైలు పెట్టె లున్నాయి. ఇప్పుడు ఏడోది వస్తోంది. అందులో లైబ్రెరీ పెడ్తారని మియోచాన్ చెప్పింది.

"ఏ పట్టాల మీద వస్తుంది?" ఒక పిల్ల అడిగింది. అందరూ ఆలోచనలో పడ్డారు.

"ఒయిమాచిలైన్ పట్టాల మీద వచ్చి, లెవల్ క్రాసింగ్‌లో విడిపోయి ఇటుగా వచ్చేస్తుందో ఏమో!"

"మరి అది పట్టాల మీది నుంచి ఎట్టాదిగుద్ది?"

"ఇక్కడికి ఎట్టా వస్తది?"

"బండి మీదకు ఎక్కించి తీసుకొస్తారేమో?"

"అంత పెద్ద పెద్ద బళ్ళుంటాయా ఎక్కడన్నా?"

"నేనేమను కుంటున్నా నంటే...మరేమో..."

ఇలా ఎవరికి తోచింది. వాళ్ళు అనేశారు. కాని రైలు పెట్టెను ఒక బండిమీద ఎక్కించడం సాధ్యంకాదని మాత్రం వాళ్లకు అర్థం అయిపోయింది.

"పట్టాలు! బహుశా ఈ బడిదాకా పట్టాలు వేస్తారు." పెద్దగా అరిచింది టోటోచాన్.

"ఎక్కడ్నుంచి?" ఎవరో అడిగారు.

"ఇప్పుడు ఆ బండి ఉన్న దగ్గర్నుంచే" ఠపీమని సమాధానం ఇచ్చింది టోటోచాన్. కాని తన సమాధానం తనకే సంతృప్తి కలిగించలేదు. నిజానికి ఆ పెట్టె ఎక్కడ్నుంచి వస్తుందో టోటోచాన్‌కు తెలియదు. పట్టాలు వెయ్యాలంటే ఇళ్లూ-వాకిళ్లూ పగలగొట్టాలిగా?

మొత్తం మీద పిల్లలందరూ రకరకాలుగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు. ఆరోజు ఇళ్లకు వెళ్ళ కుండా అక్కడే వుండిపోవాలనుకున్నారు. రాత్రి పూట ఆపెట్టె బళ్లోకి ఎలా వస్తుందో చూడాలను కున్నారు.

ఆ రాత్రి బళ్లో వుండడానికి హెడ్‌మాస్టరు అనుమతి కావాలి. అనుమతిని తీసుకోనేందుకు ఆయన దగ్గరకు మియోచాన్‌ను పంపించారు. మియోచాన్ తిరిగి రావడానికి కొంచెం ఆలస్యం అయింది. పిల్లలంతా కుతూహలం పట్టలేకుండా ఉన్నారు. మియోచాన్ వచ్చింది.

"రాత్రి బాగా పొద్దు పోయాక వస్తుందట. పట్టాల మీది నుంచి రైళ్లన్నీ వెళ్ళి పోయాక వస్తుందట. రాత్రి వుండాలను కుంటే ముందు ఇంటికి వెళ్ళి చెప్పిరావాలట. రాత్రి భోజనం చేశాక పైజమాలోనైనా రావచ్చునంట. ఒక దుప్పటి కూడా తెచ్చుకోవాలంట." మియోచాన్ చెప్పింది.



"బలే! బలే!" పిల్లలు ఉత్సాహంగా అరుస్తూ గంతులేశారు.

"పైజామాలో రావచ్చు!"

"దుప్పటి కూడా తెచ్చుకోవచ్చు."

ఆ మధ్యాహ్నం పాఠాల మీద మనసు పెట్టలేక పోయారు. బడి అయిపోగానే టోటోచాన్ తరగతి పిల్లలందరూ ఇళ్లకు వెళ్ళిపోయారు. పైజామాల్లో తిరిగి వస్తామనే ఆలోచనతో ఉక్కిరిబిక్కిరి అయిపోయారు.

"రైలొచ్చేస్తుంది. అది ఎట్లా వస్తుందో చూడాలి. పైజమా, దుప్పటి తీసుకెళ్ళనా?" అడిగింది టోటోచాన్ తల్లిని.

తలా తోకా లేని ఆమాటలు తల్లికి అర్థం కాలేదు. కూతురి ముఖంలో కన్పిస్తున్న ఉత్సాహాన్ని చూస్తుంటే ఏదో కొత్త విషయమే జరగబోతున్నదని అర్థం చేసుకుంది.

ఎన్నో ప్రశ్నలు వేశాక గాని అసలు విషయం అర్థం కాలేదు. అది అరుదైన అవకాశం అని భావించింది! తను కూడా చూస్తే బాగుండునని భావించింది.

రాత్రి భోజనాలయ్యాక కూతుర్ని తీసుకొని బయలు దేరారు. వాళ్ళు వెళ్ళే సరికే పదిమంది పిల్లలదాకా అక్కడ వున్నారు. కొందరు పెద్ద పిల్లలు కూడా ఉన్నారు. పిల్లల్ని హెడ్‌మాస్టరుకు అప్పగించి పెద్దవాళ్ళు వెళ్ళి పోయారు.

అసెంబ్లీ హాలులో దుప్పట్లు పర్చుకొని పడుకున్న పిల్ల దగ్గరకు హెడ్‌మాస్టరు వచ్చి "రైలు పెట్టెరాగానే లేపుతాను. పడుకోండి," అన్నాడు.

పిల్లలకు నిద్ర రావడం లేదు. రైలు పెట్టె గురించి ఆలోచనలే వాళ్ల బుర్రలనిండా. బాగా పొద్దు పోయింది. పిల్లలు ఒక్కొక్కరే నిద్రలోకి జారిపోయారు.

"వచ్చేసింది! వచ్చేసింది!"

కేకలకు తృళ్లిపడి నిద్రలేచింది టోటోచాన్. ఒక్క ఉదుటున బడి ఆవరణంలో వచ్చిపడింది. గేటు కేసి పరుగు తీసింది. పట్టాలు లేకుండా రైలు పెట్టె బళ్లోకి రావడం అంటే మామూలు విషయమా? మసక మసక చీకట్లో రైలు పెట్టె కన్పించింది. ట్రాక్టర్‌కు తగిలించిన ట్రెయిలర్ మీద

ఉంది రైలు పెట్టె. పిల్లలకు ఒక కొత్త విషయం తెలిసింది. అది ఏమిటి అంటే "ట్రాక్టరు అనేది ఒకటి వుంటుందనీ, అది రైలు పెట్టెల్నిమోసే ట్రయిలర్లను లాగుతుందనీను."

ఆరైలు పెట్టె తెలతెలవారు తుండగా, జనసంచారం లేని రోడ్డు మీద కదిలి వచ్చింది.

ఆరోజుల్లో క్రేనులు ఉండేవికాదు, కొందరు మనుషులు ఆ రైలు పెట్టెను ట్రయిలరు మీద నుంచి కొయ్యదుంగల సహాయంతో దించడం, ఆతర్వాత దానిని కావాల్సిన చోటుకు చేర్చడం చాలా ప్రయాసతో కూడుకున్నపని.

"పిల్లలూ! జాగ్రత్తగా చూడండి! ఆ దుంగల్ని రోలర్లు అంటారు. అంటే అంత బరువైన పెట్టెను కదల్చడానికి రోలర్ల శక్తిని ఉపయోగిస్తున్నా మన్నమాట," అన్నాడు హెడ్‌మాస్టరు.

పిల్లలు శ్రద్ధగా, ఆశ్చర్యంగా చూస్తున్నారు.

"హైలే! హైలేసా!" బరువు మోసేవాళ్లు అరుస్తున్నారు, లయబద్ధంగా. వాళ్ళ కేకలు వినడానికి సూర్యుడు లేచివస్తున్నాడా అనిపించింది.

అంతకు ముందు నుంచి బళ్లోవున్న ఆ ఆరు పాత పెట్టెల్లాగే, ఇది కూడా ఎందర్నో మోసి మోసి చక్రాలు పోగొట్టుకుంది. దాని ప్రయాణ జీవితం ముగిసింది. ఇకమీదట పసివాళ్ల కేరింతల్ని మోయబోతున్నది.

బాలభానుని నులివెచ్చని కిరణాల కాంతిలో నిలబడి ఆదృశ్యాన్ని చూస్తున్న పిల్లలు సంభ్రమాశ్చర్యాల తో తలమునక లై పోతున్నారు. కొందరు చప్పట్లు కొడుతూ గంతు లేస్తున్నారు. ఇంకా కొందరు హెడ్‌మాస్టరు మెడ చుట్టూ చేతులు వేసి ఊగుతున్నారు. మరి కొందరు. ఆయన చేతులు పట్టుకొని ఊపుతున్నారు.

పిల్లల సంతోషం చూస్తూ హెడ్‌మాస్టరు చిరునవ్వులు నవ్వుతున్నాడు.

ఆనాడు ఆ పిల్లలు అనుభవించిన ఆ ఆనందాను భూతి ఏనాటికీ మరువ లేనిది.

## ఈతకొలను

టోటోచాన్‌కు అదొక మరుపురాని రోజు. అది వంటిమీద నూలు పోగయినా

లేకుండా కొలను లో ఈత కొట్టిన రోజు.

"బాగా ఉక్కగా వుందికదూ? ఈత కొలనులో నీరు నింపుదామను కుంటున్నాను!" ఒక రోజు ఉదయం పూట హెడ్‌మాస్టరు పిల్లలతో అన్నాడు.

"వ్వావ్!" అందరూ అరుస్తూ గంతులేశారు. టోటోచాన్ తరగతి పిల్లలు పెద్ద పిల్లలు కూడా సంతోషంతో అరిచారు. ఈతకొలనులు సాధారణంగా దీర్ఘ చతురస్రంగా ఉంటాయి. కాని టోమోలో, ఒక చివర సన్నగా, మరో చివర వెడల్పుగా పడవలా వుంటుంది. చూడడానికి అందంగా ఉంటుంది. అది అసెంబ్లీహాలుకూ, తరగతుల గదులకు మధ్యగా ఉంటుంది.

కొలనులోకి నీరు వస్తూంటే, తరగతుల నుంచి పిల్లలు తొంగితొంగి చూస్తున్నారు. అంతవరకూ అది నీరు లేకుండా ఎండుటాకులతో కప్పబడి ఉండేది.

మధ్యాహ్నం భోజనాల సమయం అయింది. పిల్లలందరు కొలను చుట్టూ చేరారు. "ముందు వ్యాయామం చెయ్యాలి, ఆ తర్వాతే ఈత!" అన్నాడు హెడ్‌మాస్టరు.

టోటోచాన్ తన తరగతి పిల్లలతో కలిసి అసెంబ్లీ హాల్లోకి వెళ్ళేసరికి పెద్ద పిల్లలు తమ బట్టలు విప్పుకుంటున్నారు. ఈత కొట్టబోతున్నా మన్న ఆనందంతో కేరింతలు కొడ్తున్నారు. ఎవరికీ వంటిమీద నూలుపోగు లేదు. ఒకరి వెనక ఒకరు కొలను కేసి పరుగులు తీశారు. టోటోచాన్ కూడా పరిగెత్తింది. ఆ వేడిగాలిలో వంటిమీద బట్టలు లేక పోతే హాయిగా అనిపించింది. అప్పటికే పెద్ద పిల్లలు వ్యాయామం చెయ్యడం కన్పించింది.

ఈత నేర్పించే టీచర్ పేరు టోమో. అతను హెడ్‌మాస్టరు కొడుకే. అతను ఆ స్కూల్లో టీచరు కాదు. కాని ఒక విశ్వవిద్యాలయంలో ఈత బృందంలో వున్నాడు. బడి పేరూ అతడి పేరూ ఒకటే. టోమోచాన్ ఈత దుస్తుల్లో వున్నాడు.

వ్యాయామం పూర్తి అవగానే పిల్లల మీద చల్లటి నీళ్లు గుమ్మరించారు. పిల్లలు అరుస్తూ కొలను లోకి దూకారు. టోటోచాన్ మాత్రం దూక లేదు. దూకిన వాళ్ళ పరిస్థితి చూశాక గాని దూక దల్చుకో లేదు. అది స్నానాల గదిలా వెచ్చగా లేదు. కాని విశాలంగా ఉంది. ఎటు చేతులు చాపినా నీళ్ళే

నీళ్ళు.

సన్నటి పిల్లలు, లావుపాటి పిల్లలు, పెద్దపిల్లలు, చిన్న పిల్లలు. అప్పుడే పుట్టిన వాళ్ళలా ఉన్నారు. కేరింతలు కొడ్తూ ఒకరిమీద ఒకరు నీళ్ల చిమ్ముకుంటున్నారు.

"బలే ఉందిలే! చాలా సర్దాగా ఉంది." అనుకుంది టోటోచాన్, రాకీ కూడా వస్తే ఎంత బాగుండేదనుకుంది. ఈతదుస్తులు వేసుకోవాల్సిన అవసరంలేదంటే రాకీ కూడా కొలనులో దిగేదే!

పిల్లల్ని నగ్నంగా ఈత కొట్టడానికి హెడ్‌మాస్టరు ఎందుకు అంగీకరించాడా అనే అనుమానం రావచ్చు ఎవరికైనా. ఈ విషయంలో ఎలాంటి నియమాలు లేవు. ఈత దుస్తులుంటే వాటితోనే ఈదవచ్చు. అలాకాకుండా అకస్మాత్తుగా ఈదాలనుకుంటే, సమయానికి ఈతదుస్తులు లేకపోతే, నగ్నంగా నైనా ఈదవచ్చును. మగ పిల్లలుగానీ, ఆడ పిల్లలు గానీ తమ శరీరాల గురించి అనారోగ్యకరమైన ఆసక్తిని పెంచుకోవడం, పిల్లలకు మంచిది కాదని ఆయన అభిప్రాయం. తమ శరీరాలను దాచుకోవడానికి నానా ఇబ్బందులు పడడం అసహజం అని ఆయన ఉద్దేశ్యం.

అన్ని శరీరాలూ అందమైనవేనని పిల్లలకు చెప్పాలని ఆయన ఉదేశ్యం. టోమో విద్యార్థుల్లో యాసువాకిచాన్‌లాగ పోలియో ఉన్నవాళ్లున్నారు. వేరే విధమైన అంగవైకల్యం గల విద్యార్థులు కూడా ఉన్నారు. అందరూ దిగంబరంగా కలిసి ఆడుకోవడం వల్ల, వారిలో ఆత్మ న్యూనతా భావం తలెత్తకుండా ఉంటుందని ఆయన నమ్మకం. మొట్ట మొదట అంగవైకల్యం గల పిల్లలు బట్టలు విప్పడానికి సిగ్గు పడిపోయేవారు. క్రమంగా వారు కూడా అందరి పిల్లల్లాగే ఎలాంటి హీనతా భావంలేకుండా సంతోషంగా ఆడుకోసాగారు.

కొందరు తల్లి దండ్రులకు ఇది బొత్తిగా నచ్చలేదు. వాళ్ళ పిల్లలకు ఈతడ్రస్సు ఇచ్చి పంపించేవారు. అంతేకాదు ఆ డ్రెస్సువేసుకోకుండా దిగంబరంగా ఉండకూడదని కూడా బోధించేవారు. వారి బోధలు ఎవరూ పాటించడం లేదని మాత్రం పాపం, వారికి తెలియదు. దిగంబరంగానే ఈదడానికి మొదటి నుంచీ ఇష్టపడిన టోటోచాన్ లాంటి వాళ్లకు ఏ ఇబ్బందీ కాదు. మిగతా వాళ్లు కాస్తో కూస్తో ఇబ్బంది పడక తప్పలేదు. చివరకు దిగంబరంగా

ఈదడంలో వున్న ఆనందం అందరికీ బోధపడింది. అయితే కొంత మంది పిల్లలు తల్లిదండ్రులను నమ్మించడానికి తడిసిన స్విమ్మింగ్ సూట్లు తీసు కెళ్ళేవాళ్ళు.

## రిపోర్టు కార్డు

సంచి భుజానికి తగిలించు కొని, వెనకా ముందూ చూడకుండా రైల్వేస్టేషన్ నుంచి ఇంటికి పరుగు తీసింది టోటోచాన్. అలా పరిగెత్తుతున్న పిల్లను చూస్తే, "ఏం కష్టంవచ్చిందోపాపం!" అని అనుకుంటారు ఎవరైనా సరే! స్కూలు గేటులో నుంచే పరుగు ప్రారంభించింది.

వీధితలుపు తెరుస్తూనే "వచ్చేశాను," అంటూ అరుస్తూ లోపలకు వచ్చింది, రాకీ దగ్గరకు వెళ్ళింది. రాకీ నేలమీద రొప్పుతూ పడుకొని ఉంది. టోటోచాన్ వెళ్ళి దాని పక్కన కూర్చుంది. సంచిలో నుంచి రిపోర్టు కార్డు తీసింది. బడి నుంచి ఆపిల్ల అందుకున్న మొదటి రిపోర్టు కార్డు అది. దానిని విప్పి రాకీకి చూపిస్తూ అన్నది గర్వంగా:

"చూడు రాకీ! ఇదుగో ఇది 'ఏ'...ఇది 'బి'..."టోటోచాన్‌కు 'ఏ'కి 'బి' ఉన్న వ్యత్యాసం తెలియదు. రాకీ తన మార్కులు చూసి సంతోషిస్తుందని భావించింది.

ముఖం మీదకు ఉన్న కాగితం వాసన చూసి, టోటోచాన్ ముఖం లోకి చూసింది రాకీ.

"నీకు సంతోషంగా వుంది కదూ? ఏమో! నీకు అర్థం కాలేదేమో! నువ్వు చదవ లేవుగా మరి!" అన్నది టోటో చాన్ రాకీని ఉద్దేశించి.

రాకీ ఒకసారి కార్డుకేసి, చూసింది. ఆ తర్వాత టోటోచాన్ చెవిని నాకింది.

"సరే! అమ్మకు చూపిస్తాను వస్తాను," అంటూ లేచి నిల్చుంది టోటో చాన్.

టోటో చాన్ వెళ్ళగానే రాకీ ఓమూలకు వెళ్ళి పడుకొని కళ్ళు మూసుకుంది. "రాకీ కార్డుగురించే ఆలోచిస్తున్నాది." దాన్ని అలా చూసివుంటే టోటో చాన్ కాక ఎవరైనా అది రిపోర్టు గురించే ఆలోచిస్తున్నదని భావించేవారు.

## శెలవులు మొదలయ్యాయి

"రేపు సాయంకాలం ఒక పైజమా, దుప్పటి తీసుకొని రండి. మనం క్యాంపుకు వెళ్తున్నాం." అని రాసి వున్న చీటీని తెచ్చి తల్లికి అందించింది టోటోచాన్. ఆ తెల్లవారి నుంచే స్కూలుకు వేసవి శెలవలు మొదలవుతాయి.

"క్యాంపు అంటే ఏమిటమ్మా!" అని అడిగింది.

ఆమె కొద్ది క్షణాలు ఆలోచించింది. ఆమెకూ సరిగ్గా తట్టలేదు. "ఊరిబయట గుడారాలు వేసుకొని ఆ రాత్రి అక్కడే పడుకుంటారనుకుంటాను. రాత్రిళ్లు ఆకాశంలో నక్షత్రాలను చూస్తూ అలా పడుకుంటే చాలా బాగుంటుంది. ఇందులో డబ్బు తీసుకు రమ్మని రాయలేదు. బహుశా స్కూలుకు దగ్గర్లోనే క్యాంపు చేస్తారనుకుంటా," అన్నది తల్లి.

ఆ రాత్రి టోటోచాన్‌కు సరిగ్గా నిద్ర పట్టలేదు. క్యాంపు గురించి ఆలోచిస్తుంటే టోటోచాన్ గుండె వేగంగా కొట్టుకోసాగింది ఆనందం. కుతూహలం-ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.

తెల్లవారి నిద్రలేస్తూనే ప్రయాణానికి అవసరమైన వస్తువులు సర్దుకోసాగింది. సాయంకాలం పైజమాలూ దుప్పటీ పెట్టుకొన్న సంచి తీసుకొని బయలుదేరింది.

పిల్లలందరూ బడికి చేరారు. "అందరూ అసెంబ్లీహాలుకు రండి" అన్నాడు హెడ్‌మాస్టర్ అక్కడున్న చిన్న బల్ల మీదకు ఎక్కాడు. ఆయన చేతిలో ఆకుపచ్చని డేరా వున్నది

"డేరా ఎలా వేసుకోవాలో చెబుతాను. జాగ్రత్త గా చూడండి," అన్నాడు. ఆ తర్వాత చేతిలోఉన్న డేరాను తెరిచాడు.

వంటరిగానే, ఊదుతూ, గాలితోనింపుతూ ఇటువైపు తాళ్లులాగుతూ, అటువైపుస్థంభాలు నిలబెడుతూ, క్షణాల్లో డేరాను తయారు చేసాడు.

"ఇక మొదలు పెట్టండి. ఈ అసెంబ్లీహాల్లోనే డేరాలు వేసుకోండి. ఇక్కడే మీ క్యాంపు" ఎవరైనా డేరాలు అనగానే ఎక్కడో ఊరి బయట వేస్తారనే అనుకుంటారు. కాని హెడ్‌మాస్టరు అందుకు భిన్నంగా ఆలోచించాడు. ఇక్కడయితే పిల్లలకు ఇబ్బంది ఉండదు. వర్షం వచ్చినా, మంచు కురిసినా పిల్లలు బాధపడరు.

"ఇదే విహారయాత్ర! విహారయాత్ర!" పిల్లలు ఉషారుగా కేకలు లేస్తూ, టీచర్ల సహాయంతో గుడారాలు వేశారు. ఒక్కొక్క గుడారంలో ముగ్గురు పిల్లలు పడుకోవచ్చు. టోటో చాన్ గబగబా పైజామా లాల్చి వేసుకుంది. పిల్లలు ఆనందం పట్ట లేకుండా, ఒక గుడారంలోనుంచి ఇంకోగుడారంలోకి పాకడం ప్రారంభించారు. ఈ విధంగా పిల్లలందరూ అన్ని గుడారాలూ చూశారు.

అందరూ పైజామాలు ధరించారు. హెడ్‌మాస్టర్ పిల్లల మధ్యకు వచ్చి నిల్చున్నాడు. తన విదేశ ప్రయాణాలకు సంబంధించిన వింతలు వినిపించాడు.

కొందరు తమ డేరాల్లో పడుకొని తలలు మాత్రం బయటికి పెట్టారు. కొందరు కూర్చుని విన సాగారు. కొందరు చిన్నపిల్లలు పెద్ద పిల్లల వళ్ళల్లో తలలుపెట్టుకొని పడుకొని వింటున్నారు. తాము ఎప్పుడూ వినని, చూడని ప్రదేశాల గురించి ఆయన చెప్తూ వుంటే ఆసక్తిగా వింటున్నారు. సముద్రాల అవతలి పిల్లల గురించి ఆయన చెప్తుంటే, వాళ్లు కూడా తమకు స్నేహితులే అనిపించింది.

ఈ డేరాల్లో గడిపిన సమయం వారికి ఎప్పటికీ మరువ లేని అనుభవం. పిల్లల్ని ఎలా సంతోషంగా వుంచాలో హెడ్‌మాస్టరుకు బాగా తెలుసు.

హెడ్‌మాస్టరు చెప్పడం ముగించి, లైట్లు తీసేశాడు. పిల్లలందరూ తమతమ డేరాల్లోకి వెళ్ళారు.

ఒక వైపునుంచి పిల్లల కిలకిల నవ్వులు-మరోవైపు నుంచి గుసగుసలు, దూరంగా మరో చోట నుంచి పిల్లలు కీచులాడు కుంటున్న శబ్దాలు-క్రమంగా నాలుగు వైపులా నిశ్శబ్దం ఆవరించింది.

ఆ షికార్లో చందమామ లేడు. చుక్కలు లేవు. అయినా పిల్లలు ఆనందించారు. వాళ్లకు ఆ చిన్న అసెంబ్లీహాల్లోనే పెద్ద మైదానంలో వున్నట్టుగా అన్పించింది. ఆరాత్రి అనుభూతి పిల్లల మనసులో చంద్రకాంతితో చుక్కల వెలుగుతో నిండిపోయింది.

## నిజంగా సాహసమే!

అసెంబ్లీహాలు షికారు తర్వాత రెండు రోజులకు టోటో చాన్ పెద్ద సాహసమే చేసింది. ఆరోజు యాసువాకీ చాన్‌ను తన చెట్టు మీదకు ఆహ్వానించింది.

అది రహస్యం. తల్లిదండ్రులకు కూడా చెప్పలేదు. యాసువాకీ కూడా తన తల్లి దండ్రులకు చెప్పలేదు.

టోటోలో చాలా చెట్లు ఉన్నాయి.

ఒక్కొక్కరు ఒక్కొక్క చెట్టును తమ చెట్టుగా ఎంచుకొనేవారు. ఎవరిచెట్టు మీద వాళ్లు ఇష్టం వచ్చినప్పుడు ఎక్కొచ్చును. ఆరోజు టోటోచాన్ యాసువాకీని తన చెట్టుమీదకు ఆహ్వానించింది. ఆ చెట్టు కంచెకు పక్కగా వుంటుంది. ఓ మూలగా వుంటుంది. అది చాలా పెద్ద చెట్టు. ఎక్కుతుంటే జారిపోయేది. కాని ఎక్కాక చాలా సుఖంగా వుండేది. ఆ చెట్టుకు పెద్ద వంగవుండేది. ఆవంగలో కూర్చుంటే ఉయ్యాల్లో కూర్చున్న ఆనందం కలిగేది. విరామ సమయాల్లో ఆ పిల్ల చెట్టెక్కి అక్కడ కూర్చుని చుట్టూ పరిసరాల్ని చూస్తూ గడిపేది.

ఎవరిచెట్టు వాళ్ల స్వంత ఆస్తి. ఒకరి చెట్టుమీదకు మరొకరు ఎక్కాలంటే. చెట్టుతాలూకు పిల్ల అనుమతి తీసుకోవాలి, "ఏమోయమ్మా! కాస్త నీ చెట్టు ఎక్కనిస్తావా?" అని అతి మర్యాదగా అడిగేవాళ్లు.

యాసువాకీకి పోలియో వున్నందువల్ల ఎప్పుడూ ఏ చెట్టూ ఎక్క లేదు అతడికి చెట్టు లేదు. టోటోచాన్ ఆ అబ్బాయిని తన చెట్టుమీదకు ఆహ్వానించింది. ఆ విషయం ఎవరికీ చెప్పకూడదను కున్నారు. ఎవరికైనా తెలిస్తేవద్దని వారిస్తారని భయం.

డెనెన్ చోఫులో వున్న యాసువాకీచాన్ ఇంటికి వెళ్తున్నానని అబద్ధం చెప్పి స్కూలుకు బయలు దేరింది. అలా అబద్ధం చెబుతున్నప్పుడు తల్లి ముఖంలోకి చూడలేక పోయింది. స్టేషన్‌దాకా వచ్చిన రాకీతో మాత్రం అసలు సంగతి చెప్పేసింది. "మరేమో! నేను యాసువాకీని నా చెట్టు మీదకు ఎక్కడానికి పిలిచాను" అన్నది రాకీతో

మెళ్ళో రైలు పాసు రెప రెపలాడుతూ ఉంది. టోటో బళ్లో ప్రవేశించింది. అప్పటికే యాసువాకీ పూలమొక్కల పక్కగా కూర్చుని వున్నాడు. ఏదో అద్భుతమైన పని చెయ్యబోతున్నట్టు ఉద్వేగంతో ఉక్కిరి బిక్కిరి అయింది. యాసువాకీని చూసి పలకరింపుగా నవ్వింది. యాసువాకీ ముఖం విప్పారింది.

టోటోచాన్, యాసువాకీని తనచెట్టు దగ్గరకు తీసుకెళ్ళింది. కాపలదారు

గదికి పరుగు తీసింది. ఒక నిచ్చెన తెచ్చింది. వంగ దగ్గరకు వచ్చేలా చెట్టు మొదలుకు ఆనించి నిచ్చెన వేసింది. గబగబా పైకి ఎక్కి వంగలో కూర్చుని నిచ్చెన పట్టుకొన్నది. యాసువాకీచాన్‌ను ఎక్కమని చెప్పింది.

యాసువాకీ పుల్లల్లాంటి చేతులూ, కాళ్లతో మొదటి మెట్టుమీదకే ఎక్క లేకపోయాడు. టోటోచాన్‌దిగి వచ్చింది. యాసువాకీని కింద నుంచి పైకి నెట్టసాగింది. ఆ పిల్ల కూడా పెద్ద బలమైంది కాదు. నిచ్చెన కదల కుండా పట్టుకోలేకపోతున్నది. యాసువాకీనిగట్టిగా పట్టుకొని వుండిపోయింది.

యాసువాకీ మొదటి మెట్టుమీద నుంచే దిగిపోయి నిచ్చెన పక్కన తలవంచుకొని నిలబడ్డాడు. అతడిని చెట్టు ఎక్కించడం చాలా కష్టమైన పని అని అర్థం అయింది. మరిప్పు డేం చెయ్యాలి!



టోటోచాన్‌లో పట్టుదల పెరిగింది. ఏమైనా సరే ఆ అబ్బాయిని చెట్టు ఎక్కించాల్సిందేననుకుంది. అతడికి కూడా అట్లాగే అన్పించింది. ఢీలా పడిపోయిన యాసువాకీని నవ్వించే ప్రయత్నంచేసింది. ఒక ఉపాయంతోచింది. అక్కడ్నుంచి మళ్లీ కాపలాదారు గది కేసి పరుగుతీసింది- "ఉండు? నాకో ఉపాయం తట్టింది." అని అంటూ!

అక్కడున్న సామానంతా లాగిచూసింది. నిలబడివున్న నిచ్చెన కన్పించింది. ఆ నిచ్చెనను ఎవరూ పట్టుకోవాల్సిన అవసరం లేదు. టోటోచాన్ ఆ నిచ్చెనను లాక్కు వెళ్ళింది. తన బలానికి తనే ఆశ్చర్యపోయింది.

"ఆ! మరేం భయంలేదు. ఎక్కుతుంటే ఇది కదలదులే!" అన్నది పెద్ద ఆరిందాయిలాగ.

యాసువాకీ ఆ నిచ్చెన కేసి అనుమానంగా చూశాడు. ఆ తర్వాత టోటోచాన్‌ను చూశాడు. ఆమె చమటతోతడిసి ముద్దయివుంది. అతడికీ చెమట్లు పడ్తున్నాయి. ఒక నిశ్చయానికి వచ్చిన వాడిలా మొదటి మెట్టుమీద పాదం పెట్టాడు.

ఎండమండి పోతున్నది. ఏమైన్నా సరే యాసువాకీచాన్ చెట్టు ఎక్కాలి. ఆ ఒక్క ఆలోచన తప్ప ఇద్దరికీ మరో ఆలోచనే లేదు. యాసువాకీ చాన్ కాళ్లను చేతులతో పైకి నెడుతూ, మొత్తం శరీరాన్ని తల ఆనించి నిలబెడుతూ పైకితోసింది. అతను కూడా తన శక్తినంతా ఉపయోగించి నిచ్చెన పైకిచేరాడు.

ఇద్దరూ సంతోషంతో కేరింతలు కొట్టారు. అంతలోనే మరో సమస్య ఎదురైంది. టోటోచాన్ నిచ్చెన మీదనుంచి ఎగిరి పంగమీదకు దూకేసింది. కాని యాసువాకీని ఎలా నిచ్చెన మీదనుంచి పంగమీదకు తీసు కెళ్ళాలో అర్థంకాలేదు. ఆకుర్రాడు టోటోచాన్ ముఖంలోకిదీనంగా చూశాడు. టోటోచాన్‌కు ఏడుపువస్తోంది. యాసువాకీని తన చెట్టు మీదకు తీసుకెళ్ళి, అక్కడ్నుంచి ఎన్నో వింతలు చూపించాలనుకుంది.

తను ఏడిస్తే యాసువాకీ కూడా ఏడుస్తాడనుకుంది. వస్తున్న ఏడుపును దిగమింగుకుంది.

పోలియోవల్ల చలనరహితంగా, గట్టిగా వున్న యాసువాకీ చేతివేళ్ళను పట్టుకొని, చూసింది. అతడి చెయ్యి ఆమె చేయికన్నా పెద్దది. ఆ చేయి

గట్టిగాపట్టుకొని "ఊ! పడుకొని పైకిపాకు! నేనులాగుతాను," అన్నది.

ఆ అబ్బాయి నిచ్చెన మీద బోర్లా పడుకున్నాడు. ఆ పిల్ల పంగల మీద నిల్చుని లాగడానికి ప్రయత్నిస్తున్నది. ఆ దృశ్యం పెద్దవాళ్లు చూస్తే ఎంత హడలిపోయేవాళ్లో!

యాసువాకీకి టోటోచాన్ తనను ఎలాగయినా పైకి లాగుతుందనే నమ్మకం ఉంది. ఆమె తన శక్తినంతా కూడగట్టుకొని పైకిలాగుతోంది.

అతి ప్రయత్నం మీద ఇద్దరూ చెట్టు పంగలో నిలబడ్డారు, చెమటతో తడిచిన జుట్టును వెనక్కు తోసుకొని, తలవంచి "నాచెట్టుమీదకు, స్వాగతం!" అన్నది టోటోచాన్.

యాసువాకీచాన్ కొంచెం సిగ్గు పడుతూ "నేనులోపలకు రావచ్చా?" అని అడిగాడు.

అక్కడ్నుంచి ఎన్నో దృశ్యాలను చూసి ఆనందించాడు. "చెట్టు ఎక్కడం అంటే ఇలావుంటుందన్న మాట," అన్నాడు, సంబర పడిపోతూ.

ఇద్దరూ బోలెడన్ని కబుర్లు చెప్పుకున్నారు చెట్టు మీద కూర్చుని.

"మాఅక్కయ్య అమెరికాలో ఉంది. వాళ్లకు అదే దో పెట్టె-టెలివిజన్ అంటారంట-ఉందట. ధాంట్లో ఎన్నో బొమ్మలు చూడొచ్చు. అది మన జపాన్‌కు వస్తే మనం ఇంట్లో కూర్చునే కూర్చుని ముష్టియుద్ధం చూడొచ్చంట," అని చెప్పాడు యాసువాకీ.

బయటికి వెళ్ళలేని యాసువాకీకి ఆపెట్టె ఎంత విలువైందో తెలుసుకొనే వయసు అప్పుడు టోటోచాన్‌కు లేదు.

అప్పుడు ఆ విషయంవిని టోటో ఆశ్చర్యపోయింది. అంత చిన్న పెట్టెలోకి ముష్టి యుద్ధం చేసే అంతంత లావు పహిల్వానులు ఎలా పడ్తారో అని బోలెడంత ఆశ్చర్యం వేసింది. ఆరోజుల్లో టెలివిజన్ గురించి ఎవరికీ తెలియదు. టోటోచాన్‌కు దాన్ని గురించి మొదట చెప్పిన వాడు యాసువాకీచానే.

కీచురాళ్లు రొద చేస్తున్నాయి. ఆ చిన్నారులు ఆనందంతో కేరింతలు కొడ్తున్నారు. యాసువాకీ చెట్టెక్కడం అదే మొదటి సారీ చివరి సారీ కూడ.

## ధైర్యానికి పరీక్ష

"భయపెట్టేదీ, కంపుకొట్టేదీ, మంచి రుచిగా వుండేదీ ఏమిటి?" ఇది ఒక పొడుపుకథ. ఇదంటే పిల్లలకు మహా ఇష్టం. ఇది అందరికీ తెలిసిన కథే. అయినా ఒకర్నొకరు మళ్ళీ మళ్ళీ అడుగుతూవుంటారు.

"మరుగుదొడ్లో, చిక్కుడు గింజల పచ్చడితో చేసిన రొట్టెను తినే దయ్యం" అని ఈ పొడుపు కథను విప్పుతారు.

టోమోలో ధైర్యపు పోటీ ఎట్లా ముగిసిందనేది కూడా ఒకమంచి పొడుపు కథే అవుతుంది. అసెంబ్లీహాల్లో గుడారాలు వేసుకున్న రోజు హెడ్‌మాస్టరు "మనం ఒక రోజు కుహొంబుట్సు గుడిదగ్గర ధైర్యం పరీక్ష పెడ్దాం. దయ్యంగా ఉండదల్చుకున్నవాళ్లు చేతులు ఎత్తండి" అన్నాడు.

ఏడుగురు పిల్లలు చేతులెత్తారు. నిర్ణయించు కున్న రోజు అందరూ బళ్లో గుమి గూడారు. దయ్యాల వేషాలు వేయదల్చుకున్న మగ పిల్లలు దుస్తులు తయారు చేసి తెచ్చుకున్నారు. గుడి ఆవరణలో దాక్కోవడానికి వెళ్ళారు.

"చూడండి! మిమ్మల్ని చచ్చేలా భయపెడ్తాం!" అని చెప్పి వెళ్ళారు.

మిగిలిన పిల్లలందరూ ఐదుగురు చొప్పున గుంపులుగా విడిపోయారు. గుంపుకూ గుంపుకూ కొద్ది అడుగులు దూరంగా నడవసాగారు. వాళ్ళు తిన్నగా గుడికి వెళ్ళి, గుడిచుట్టూ తిరిగి, స్మశానానికి వెళ్ళి తిరిగి గుడికిరావాలి.

ఎవరు ఎక్కువ ధైర్యం కలవారో తెలుసుకోవడానికే ఈ పరీక్ష అని హెడ్ మాస్టరు చెప్పాడు.

టోటోచాన్ తల్లిని అడిగి ఒక ఫ్లాష్ లైటు పట్టుకొచ్చింది "పోగొట్టకు" అని చెప్పి ఇచ్చింది తల్లి.

"రాయి-కాగితం-కత్తెర" అంటూ పిల్లలు విడిపోయారు, వేరు వేరు బృందాలుగా. వాళ్ళు బయలుదేరే సరికి చీకటిపడింది.

గుడి దగ్గరకు వెళ్ళేంతవరకు వాళ్ళకు దయ్యాలు ఎదురు పడవని హెడ్‌మాస్టరు చెప్పాడు. కాని వాళ్లకు నమ్మకం కలగలేదు. భయం భయంగానే గుడికేసినడిచారు. చంద్రుడు వున్నా గుడి ఆవరణలో చీకటిగానే ఉంది. ఏ సమయంలో దయ్యాలు ఎటునుంచి వస్తాయోనన్న భయం పిల్లల్ని ఆవహించింది. అక్కడ ఉండ లేకపోయారు. చెట్టుకొమ్మ ఊగినా, ఆకురాలినా,

పక్క విద్యార్థికాలు తగిలినా "దయ్యం! బాబోయ్!" అని అరవసాగారు. చివరకు చేతులు పట్టుకునడుస్తున్న పిల్లలు ఒకరికి ఒకరు దయ్యాయే మోనన్న అనుమానం వేసి భయపడిపోసాగారు. ఏది ఏమైనా స్మశానం వరకు వెళ్ళకూడదని నిర్ణయించుకుంది టోటోచాన్. దయ్యాలు వుండేది స్మశానంలోనే కదా? అసలు దయ్యాల పోటీ అంటే ఏమిటో తెలిసి పోయింది. ఇక బడికి వెళ్ళిపోవచ్చు-అనుకుంది టోటోచాన్. అక్కడున్న పిల్లలందరూ అలాగే భావించారు. అందరూ బడి కేసి పరిగెత్తసాగారు. బడికి వెళ్ళి చూసేసరికి, తమకంటే కొద్దిగా ముందు పరిగెత్తిన బృందాలు అక్కడ ఉన్నాయి. "అయితే వీళ్ళు భయంవేసి వెనక్కువచ్చేశారన్నమాట!" అనుకుంది టోటోచాన్.

"ఇంత సేపూ నేను ఎదురు చూస్తూ అక్కడేవున్నా!" దోమలు కుట్టిన కాళ్లను దులుపుకుంటూ అన్నాడు మిగిటా.

"బలే! దయ్యానికి కూడా దోమలు కుట్టి నట్టున్నాయే!" అన్నాడు ఒక కుర్రాడు- అందరూ గొల్లున నవ్వారు.

"సరే! ఇక నేను వెళ్ళి మిగిలిన దయ్యాల్ని కూడా తీసుకువస్తాను." అంటూ బయలు దేరాడు ఐదో తరగతి టీచర్. వీధి దీపాల కింద భయపడిపోయిన దయ్యాలు నిలబడివున్నాయి. కొన్ని దయ్యాలు భయపడి ఇళ్లకు పారిపోయారు. అక్కడ వున్న వాళ్లను తీసుకొని టీచర్ బడికి తిరిగి వచ్చాడు.

ఆ తర్వాత టోమోలో విద్యార్థులు దయ్యాలకు భయపడలేదు. దయ్యాలు కూడా భయపడి పారిపోతాయని వాళ్లకు తెలిసిపోయింది. అందుకే అవంటే భయం పోయింది.

## రిహార్సల్ హాలు

టోటోచాన్ మౌనంగా నడుస్తోంది. రాకీ కూడా మౌనంగానే నడుస్తున్నది. వాళ్ళిద్దరూ తండ్రి రిహార్సల్‌హాలుకు వెళ్తున్నారు. మామూలుగా అయితే గంతులేస్తు వెళుతుంది. ఏదోపారేసుకున్నట్టూ దానిని వెదుకు తున్నట్టూ వెడుతోంది. అక్కడకు వెళ్ళడానికి ఐదు నిముషాలనడక.

ఆమె తండ్రి ఒక సంగీత బృందానికి స్వరకర్త. ఆయన వయొలిన్ వాయిస్తాడు. ఒకసారి సంగీత సభకు టోటోచాన్ వెళ్ళింది. వాయించడం

పూర్తి అయ్యాక అందరూ చప్పట్లు కొట్టారు. ఒకవ్యక్తి వచ్చి తండ్రికి షేక్‌హ్యాండు ఇచ్చాడు. తండ్రిలేచి నిల్చున్నాడు, వాద్యగాళ్లందరూ లేచి నిల్చున్నారు. అదిచూసిన టోటోచాన్‌కు ఏదో అద్భుతం చూసి నట్టుగా అన్పించింది.

"వాళ్లు ఎందుకు చేతులుకలుపుతున్నారు?" అని గుసగుసగా అడిగింది టోటోచాన్ తల్లిని.

"నాన్న వాద్యబృందానికి పెద్ద. బాగా వాయించినందుకు కండక్టరు కృతజ్ఞతలు చెబుతున్నాడు," అని తల్లి చెప్పింది.

రిహార్సలు హాలుకువెళ్ళ డమంటే టోటోకు చాలా ఇష్టం. బళ్లో అందరూ పిల్లలే వుంటారు. ఇక్కడ అందరూ పెద్దవాళ్ళే ఉంటారు. వాద్యాలు బాగా వాయిస్తారు. ఆ కండక్టర్ జపనీస్ భాష తమాషాగా మాట్లాడతాడు.

జోసెఫ్ రోసెన్‌స్టాక్ యూరప్‌లో పెద్దపేరున్న సంగీతకారుడు, అక్కడ హిట్లర్ అని ఒకాయనవున్నాడు. చాలా చెడ్డపనులు చేస్తూవుంటాడు. అందుకే ఆయన అక్కడ్నుంచి పారిపోయి ఇక్కడకువచ్చాడు-అని తండ్రి చెప్పాడు. అతడంటే ఆమెతండ్రికి చాలా గౌరవం. హిట్లర్ యూదులను వేటాడక పోతే రోసెన్ స్టాక్ జపాన్ వచ్చివుండేవాడుకాదు. ఈ సంగీత బృందం అంతర్జాతీయ స్థాయికి ఎదిగింది ఆయన వల్లనే.

"నేను ఇంత కష్టపడుతున్నాను. మీలోచలనం ఉండదేం?" అనేవాడు.

రోసెన్ స్టాక్ విశ్రాంతి తీసుకొనే సమయంలో, హిడిమో సైటా అనే ఆయన కండక్టర్‌గా పని చేసేవాడు. అందరి తరఫునా జవాబిస్తూ "మేంచెయ్యగలిగింది చేస్తున్నాం. మాకింకా సరైన పద్ధతులు అలవాటు కాలేదు. కాని మేము కావాలని మాత్రం చెడగొట్టం. మమ్మల్ని నమ్మండి." అనేవాడు. అలా అంటున్నప్పుడు ఆయన తలలోనుంచి పొగలు వస్తున్నాయా అన్నంతగా ఆయన ముఖం ఎర్రబడిపోయేది. ఇదంతా టోటోచాన్‌కు అర్థం అయేదికాదు. అలాంటప్పుడు టోటో చాన్ ఊపిరి బిగ బట్టుకొని కూర్చునేది. మళ్ళీ వాద్యాలు మొదలయ్యే వరకు బిగిసిపోయికూర్చునేది. ఎప్పుడూ హాలు బయటికిటికీ దగ్గరే కూర్చునేది.

మామూలు సమయాల్లో ఆయన చాలాప్రేమగా వుండే వాడు. వాళ్ళు

బాగావాయించినప్పుడు తమాషా యాసతో జపాన్ భాషలో "చాలా బాగుంది కురియనా గిసాగిసాన్" అనేవాడు.

బయటి కిటికీ దగ్గర నిల్చుని సంగీతం వింటున్న కూతుర్ని, సిగరెట్ కోసం బయటకివచ్చిన తండ్రి "ఒహో! టాటస్కి! నువ్వా! ఇక్కడున్నావ్" అంటూ వుండేవాడు.

టోటోచాన్ కన్పిస్తే రోసెన్‌స్టాక్ కూడా "శుభోదయం!" అనేవాడు. టోటోచాన్‌ని చిన్నప్పుడు ఎత్తుకొనేవాడు.

ఆమె బుగ్గకు తనబుగ్గ ఆనించేవాడు. ఆయన అలాచేస్తున్నప్పుడు టోటోచాన్ కొంచెం ఇబ్బంది పడిపోయేది. ఆయనంటే ఆ పిల్లకు ఇష్టం. ఆయన కళ్లజోడు పెట్టుకొనేవాడు.



ఆ రిహార్సల్‌హాలు పాశ్చాత్య పద్ధతిలో వుండేది. ఆహాలంటే టోటోచాన్ కుచాలా ఇష్టం

సెన్‌జొకు సరస్సు నుంచి వీచేగాలి, ఆ హాలు నుంచి సంగీతాన్ని దూర తీరాలకు తీసుకెళ్ళేది. కొన్నిసార్లు బంగారు తీగెలు అమ్ముకొనేవాళ్ల కేకలు సంగీతంలో కలిసిపోయేవి.



కింగియో, ఈ కింగియో!

## వేడినీటి ఊటకు విహారం

దాదాపు వేసవి సెలవులు పూర్తి అవుతున్నాయి. వేడి నీటి ఊటకు ప్రయాణం అందరికీ ఉత్సాహాన్ని కలిగించే విహారం. ఆరోజు వచ్చింది. "అమ్మా! నేను! మాబడి పిల్లలతో కలిసి వేడినీటి ఊటకు వెళ్తున్నాను. సరేనా?" అని టోటోచాన్ తల్లిని అడిగినప్పుడు ఆమె అమితంగా ఆశ్చర్య పోయింది. అక్కడకు వయసు మళ్ళిన వాళ్ళు వెళతారు అని ఆమెకు తెలుసు. కాని మొదటి తరగతి పిల్లలు వెళ్తారని మొదటిసారిగా విన్నది, హెడ్‌మాస్టరు పంపించిన ఉత్తరం చదివాక అదొక మంచి ఆలోచన అన్పించింది. ఆమెకు కుతూహలంతో పాటు ఆ బడిపట్ల ఆరాధనా భావం కూడా కలిగింది. ఆ విహారానికి వాళ్లు "సముద్రవు ఒడ్డున బడి" అంటారు. అందుకు షిజువాకాలోని ఇటో ద్వీప కల్పంలో వున్న 'టాయి' అనేప్రాంతాన్ని ఎంచుకున్నారు. అక్కడ సముద్రంలోనే వేడినీటి ఊట ఉంది. ఆనీళ్లల్లో స్నానం చెయ్యొచ్చు. ఈత కొట్ట వచ్చు. మూడు పగళ్లూ, రెండు రాత్రిళ్ళూ ఉండడానికి నిశ్చయం అయింది. టోమోలో చదువుతున్న ఒక విద్యార్థి తండ్రికి అక్కడ విశ్రాంతి గృహం ఉంది. మొత్తం

అక్కడికి వెళ్ళే ఏభై మంది విద్యార్థులూ అక్కడ వుండడానికి వీలుంది. అనుకున్నరోజు టోమో విద్యార్థులందరూ బళ్లో గుమిగూడారు.

"ఇక మనం బయలు దేర్దాం. కొంత దూరం రైలులో ప్రయాణం, కొంత దూరం ఓడలో ప్రయాణం చేస్తాం. ఎవరూ తప్పి పోకూడదు," అన్నాడు హెడ్‌మాస్టరు. ఆయన ఇచ్చిన ఆదేశం అదే.

జియుగేకాలో రైలు ఎక్కాక పిల్లలు ఆశ్చర్యం కలిగించేంత బుద్ధిగా మసలు కొన్నారు. రైలు పెట్టెలో ఎవరూ అటూ ఇటూ పరుగులు తియ్యలేదు. మాట్లా డినా చిన్నగా పక్క పిల్లలతోనే మాట్లాడారు. అందరూ వరసల్లో నడవాలని గానీ, రైల్లో నిశ్శబ్దంగా వుండాలని గానీ, తిండితినేప్పుడు శుభ్రంగా తినాలనిగానీ ఆస్కూలు పిల్లలకు ఎవరూ చెప్ప నక్కరలేదు రోజువారీ బడి జీవితమే వాళ్ల కెన్నో నేర్పింది. తమ కంటే బలహీనంగా వున్న పిల్లల్ని తొయ్యకూడదు, దుడుకుగా ప్రవర్తించడం మంచిపనికాదు. కింద ఎక్కడైనా చెత్తాచెదారం కన్పిస్తే దాన్ని వెంటనే అక్కడ్నుంచి తొలగించాలి. ఇతరులకు చిరాకు, భయం కలిగించే పనులు చెయ్యకూడదు. ఇలాంటి భావాలు ప్రత్యేకంగా చెప్పకుండానే ఆపిల్లల్లో ఏర్పడతాయి. స్కూల్లో చేరిన కొత్తలోనే ఆ స్కూలు టీచర్లను ముప్పుతిప్పలు పెట్టి బహిష్కరణకు గురి అయిన టోటోచాన్ ఈ స్కూలుకు వచ్చిన రోజునుంచే తనబల్ల ముందు బుద్ధిగా కూర్చో సాగింది. పాతస్కూలు టీచర్లు ఎవరైనా రైల్లో అంత బుద్ధిగా కూర్చునివున్న టోటోచాన్‌ను చూస్తేగుర్తు పట్టరు. అలాగేవున్న మరో పిల్ల అనుకోవచ్చు.

పిల్లలందరూ ఓడలోకి ఎక్కారు. వాళ్లు ఊహించు కున్నట్టే ఉంది. ఆ ఓడ. అది మరీ పెద్దదికాదు. పిల్లలు చాలా ఉత్సాహంగా ఉన్నారు. ఓడ నలు వైపులా తిరుగుతూ ప్రతి వస్తువునూ పరిశీలించారు. ఓడ బయలుదేరింది. ఒడ్డున వున్న జనాల్ని చూస్తూ ఉత్సాహంగా చేతులుఊపారు. ఓడ బయలు దేరిన కాసేపటికి వర్షం మొదలైంది. పిల్లలు డెక్ మీద నుంచి లోపలకు వెళ్లారు. టోటోచాన్‌కూ, మరి కొందరు పిల్లలకు ఒంట్లో బాగా లేనట్టుగా అన్పించింది.

ఓడ అటూ ఇటూ సముద్రంలో ఊగుతున్నది. ఒక పెద్దపిల్లవాడు లేచి మధ్యలో నిలబడి ఓడను కంట్రోలు చేస్తున్నట్టు నటించ సాగాడు. ఒంట్లోబాగా

లేనట్టు ఫీలవుతున్న పిల్లలు కూడా అతని నటనకు నవ్వకుండా ఉండలే కపోయారు. ఓడ టోయికి చేరే వరకూ ఆపిల్లవాడు "ఊప్స్" అంటూ ఓడను అటూ ఇటూ ఊగకుండా పట్టుకుంటున్నట్టు తమాషా చేస్తూనే వచ్చాడు. పిల్లలంతా నవ్వుతూనే ఉన్నారు. తీరా టోయి చేరేసరికి మిగతా పిల్లలంతా బాగున్నారు. కాని "ఊప్స్" కుర్రాడు మాత్రం సముద్ర జ్వరంలో దిగాడు. అది అందరికీ ఆశ్చర్యం కలిగించింది.

'టాయిస్పా' అందమైన పల్లె. నిశ్శబ్దంగా వుంటుంది. ఆ పల్లె పచ్చని కొండల మధ్యలో వున్నది. కొంచెం సేపు విశ్రాంతి తీసుకున్నాక అందరూ సముద్రం దగ్గరకు బయలు దేరారు. ఇది వాళ్ళ బళ్లో ఈత కొలనులాలేదు. అందరూ ఈత దుస్తులు తొడుక్కున్నారు.

సముద్రంలో ఎక్కడో గాని వేడి నీటి ఊటవుండదు. ఎక్కడ వుందో తెలుసు కోవడం కొంచెం కష్టమే. ఆ ఊటలో మెడవరకు కూర్చుంటే వేడినీళ్ల ల్లోనుంచి ఎటువైపుకు పదిహేను అడుగులు వేసినా చల్లటినీళ్లు తగులుతాయి. ఇంకాముందుకెళ్తే మరీ చల్లటినీళ్లు వుంటాయి. నీళ్ళు చల్లగా వున్నట్లని పిస్తే పది హేను అడుగులు ముందుకు వేసి వేడినీళ్లలో కూర్చోవచ్చును. ఈతదుస్తులు వేసు కున్న వాళ్లు చల్లనీళ్లల్లో ఈతగొడ్తుంటే, వేడినీళ్లల్లో స్నానం చేస్తున్నవాళ్ళు రౌండుగా నిల్చుని కబుర్లు చెప్పు కుంటున్నారు. ఇళ్ళలో బాత్‌రూముల్లో వున్నట్టే అన్పించింది వాళ్లకు.

ఆరోజుల్లో సముద్ర తీరాలు నిశ్శబ్దంగా వుండేవి. పూర్తిగా అదివాళ్ల స్వంత 'బీచీ' యే అన్పించేది. పిల్లలు చాలా సంబర పడిపోయారు. స్నానాలు ముగించుకొని బయటికి వచ్చే సరికి వాళ్ళ చేతి వేళ్లన్నీ ముడతలు ముడతలుగా కన్పించాయి.

రాత్రిపూట పరుపుల్లో దూరాక పెద్ద పిల్లలు దయ్యాల కథలు చెప్తుంటే చిన్న పిల్లలు భయంతో ఏడ్చేవారు. కాని మళ్లీ వెంటనే "ఆ ఆతర్వాత?" అని కుతూహలంగా అడిగేవారు.

ఈ యాత్ర, బడిలో షికారులాంటిది కాదు. దయ్యాల పరీక్ష లాంటిదికూడా కాదు. జీవితకాలం మర్చిపోలేని అద్భుత అనుభవం టోయిస్పా విహారం. వంటకు కావాల్సిన సామాగ్రి కొనడానికి పిల్లల్నే పంపించేవారు. ఊళ్లోవాళ్లు

వేసే ప్రశ్నలకు పిల్లలు మర్యాదగా జవాబులు ఇచ్చేవాళ్లు. కొందరు పిల్లలు చెట్ల మధ్య దారితప్పిపోయారు. కొందరు సముద్రంలో ఈదుతూ దూరంగా వెళ్ళిపోయారు. మరికొందరు గాయాలు చేసుకున్నారు. పిల్లలు ఒకరికొకరు సహాయంచే సుకున్నారు.

అదంతా సరదాగా గడిచిపోయింది. అక్కడ ఒక అడవివుంది. కీచురాళ్ల శబ్దం వినిపిస్తూవుంటుంది. అక్కడ పాప్‌సైకిల్స్ అమ్మే దుకాణం ఉంది. అక్కడ ఓ వయసు మళ్ళినాయన పడవ తయారు చేస్తున్నాడు. పిల్లలందరూ రోజూ ఉదయం వెళ్ళి, పడవ ఎంతవరకు తయారైందో చూసి వచ్చేవాళ్లు. ఆ పడవాయన టోటోచాన్‌కు వంకీలు తిరిగివున్న కర్ర ముక్క ఇచ్చాడు.

"మనందరం ఇక్కడ జ్ఞాపకంగా ఫొటోదిగితే బాగుంటుందికదూ?" అక్కడ్నుంచి బయలుదేరే రోజు హెడ్‌మాస్టరు అడిగాడు. వాళ్లందరూ కలిసి ఎప్పుడూ ఫొటోదిగలేదు. అందరూ సంబరపడ్డారు. టీచర్ కెమెరా తీసుకొని ఫొటోతియ్యబోయే సమయానికి ఒకడు బయటికి వెళ్ళాడు. కుడికాలు బూటు ఎడం కాలికీ, ఎడంకాలిబూటు కుడికాలికీ వేసుకొన్న వాడు బూట్లు మార్చు కోవడం మొదలు పెట్టాడు. "అందరూ సిద్ధంగా వున్నారా?" అని టీచర్ అడిగాడు. ఆసమయంలో నిల్చుని-నిల్చుని అలసిపోయిన ఇద్దరు పిల్లలు నేలమీద బోర్లా పడుకొని కన్పించారు. ఎలాగైతేనేం ఫోటో తీసే తతంగం పూర్తి అయింది.

ఆ, ఫోటో, పిల్లందరికీ ఒకవిలులైన ఆస్తిగా వాళ్ల దగ్గర మిగిలిపోయింది. వెనక సముద్రం. ముందు పిల్లలు రకరకాల ముఖభంగిమల్లో ఉన్నారు. ఒక్కసారి ఆఫొటో చూస్తే జ్ఞాపకాల వెల్లువ పెల్లుబుకుతుంది. ఓడలో ప్రయాణం, వేడినీళ్లలోస్నానం, దయ్యం కథలు, "ఊప్స్" అన్న పిల్లవాడు-ఎనె న్ని జ్ఞాపకాలో! మొదటి సారి వేసవి శెలవుల ఆ అనుభవాన్ని టోటోచాన్ ఎన్నటికీ మరువలేదు.

ఆరోజుల్లో వాళ్ల ఇంటి దగ్గర వున్న సరస్సు లో రొయ్యలుండేవి. చెత్తబండిని ఆరోజుల్లో ఎద్దు లాగుతూవుండేది.

## సంగీతం

వేసవి శెలవులు పూర్తికాగానే రెండో సెమిస్టర్ మొదలైంది. జపాన్‌లో పాఠశాలలు ఏప్రిల్ నెలలో ప్రారంభం అవుతాయి. విద్యా సంవత్సరం మధ్యలో వేసవి సెలవులు వస్తాయి. ఈ విహారయాత్రల వల్ల టోటోచాన్‌కు వేరేక్లాసు పెద్దలతో కూడా పరిచయం ఏర్పడింది.

టోమోలో విద్యాబోధన ఇతర స్కూళ్లకంటే భిన్నంగా ఉంటుంది. అంతేకాదు సంగీతానికి ఎక్కువ సమయం కేటాయించడం జరుగుతుంది. ఆట పాటల పీరియడ్ రోజూవుండేది. టోమోను తెరవడానికి ముందు విదేశాల్లో చిన్న పిల్లల బోధనాపద్ధతులను తెలుసుకోవడానికి హెడ్‌మాస్టరు యూరప్ వెళ్ళాడు. అక్కడ ఆయన ఎన్నో పాఠశాలలను చూశారు. విద్యాబోధకులతో మాట్లాడాడు. పారిస్‌లో డాల్‌క్రోజ్‌ను కలుసుకున్నాడు. డాల్‌క్రోజ్‌కు స్వరకర్తగా, విద్యాబోధకుడిగా మంచిపేరు ఉంది.

చిన్నపిల్లలకు, సంగీతం కేవలం చెవులతో వినేదిగా కాకుండా మనసుతో వినేదిగా, అనుభూతిని పొందేదిగా చెయ్యడానికి ఏంచెయ్యాలా అని ఆలోచించేవాడు. సంగీతం అంటే నిస్సారమైందీ, నిర్జీవమైందీ కాదనీ, అదొక చలనశీలమైన సజీవ శక్తి అనీ, వాళ్లు గుర్తించేలా చెయ్యడం ఎలా? వారిలో హృదయ స్పందనను జాగృతం చెయ్యడం ఎలా? అని ఆలోచించే వాడు.

పిల్లల ఆట పాటల్ని గమనించి చూశాక ఆయన కొక ఆలోచన తట్టింది. లయబద్ధమైన వ్యాయామం ద్వారా ఇది సాధ్యం అవుతుందని భావించాడు. ఆ పద్ధతికి "యురిథమిక్స్" అని పేరు పెట్టాడు. అంటే ఆటా పాటా కలిసింది అని అర్థం.

కొబయాషి, పారిస్‌లోని డాల్‌క్రోజ్ పాఠశాలలో సంవత్సరం పాటు ఉన్నాడు. ఆపద్ధతిని బాగా పరిశీలించాడు. డాల్‌క్రోజ్ నుంచి ప్రేరణపొందిన ప్రముఖులు జపాన్‌లో చాలా మంది ఉన్నారు. సంగీత కారుడు కొసాక్‌యామాడా, ఆధునిక నృత్యానికి ఆద్యుడు బాకు ఇషీ, కబుకీ నటుడు ఇచికావా సాడాన్‌జి11, ఆధునిక నాటకరంగ ప్రముఖుడు కేరు వస్నూయి, నర్తకుడు మిచిమో ఇటో, వీళ్ళందరూ డాల్‌క్రోజ్ నుంచి ప్రేరణ పొందిన వాళ్ళే. అతడి బోధనలు ఎన్నో కళలకు మూలాధారాలని భావిస్తారు. జపాన్‌లో

ఆ విద్యను ప్రాథమిక పాఠశాల స్థాయిలో ప్రవేశ పెట్టిన మొట్టమొదటి వ్యక్తి సొసాకు కొబయాషి.

'యురిథమిక్స్' అంటే ఏమిటో ఆయన మాటల్లో విందాం-"అది శరీరం నిర్మాణానికి ఉపయోగపడే ఒక ఆట. అది శరీరం మీద మనసుకు ఎటువంటి అదుపు వుండాలో నేర్పించే ఆట. లయబద్ధమైన వ్యక్తిత్వం అందంగా ఆరోగ్యంగా వుంటుంది. ప్రకృతి సూత్రాలతో సమన్వయాన్ని సాధించడం ఎలాగో అది నేర్పుతుంది."

లయను ఎలాస్వీకరించాలో శరీరానికి నేర్పించే శిక్షణతో టోటోచాన్ చదువు ప్రారంభం అయింది.

అసెంబ్లీహాలులో వున్న చిన్న బల్లమీద హెడ్‌మాస్టరు పియానో వాయిస్తూ వుంటాడు. పిల్లలు ఆ పియానో వినిపించగానే, ఎక్కడున్నా లయబద్ధంగా అడుగులు వేస్తూవుంటారు. వాళ్ళంతా ఒకరినొకరు ఢీకొనకూడదు. అందుకే అందరూ వలయాకారంగా, ఒకేరకంగా నడుస్తూవుంటారు. సంగీతంలో రెండు శృతులు విన్పిస్తే చాలు, కండక్టర్లలాగ రెండు చేతులూ ఎత్తి పైకీ కిందకూ ఊపేవారు. పాదాలు కూడా ఎడాపెడా బాదకూడదు. బాకేలాగ బొటన వేలు మీద కూడా నిలబడ కూడదు. మెల్లగా, బొటన వేళ్లను ఈడుస్తూ నడవాలి. మొత్తం మీద సహజంగా, వాళ్లకు ఎలా నడవాలని పిస్తే అలా నడవొచ్చు. లయకు అనుకూలంగా అడుగులు వెయ్యాలి మూడో స్థాయికి చేరినప్పుడు. నాలుగో స్థాయి లయ కొంత సులభం.

"కిందకు, నీచుట్టూ, పైకి, పక్కలకు."

ఐదో స్థాయికి వచ్చేసరికి-

"కిందకు, నీచుట్టూ, ముందుకు, పక్కలకు, పైకి చేతులు ఊపాలి.

ఆరోస్థాయి చేరుకుంటే- "కిందకు, చుట్టూ, ముందుకు మళ్లీ చుట్టూ, పైకి!"

స్థాయిలు మారుతున్నప్పుడు కొంత కష్టంగా వుండేది.

"నేను నా పియానో లయను మార్చి నేను చెప్పేంత వరకు మీరు మాత్రం మార్చకండి."

వాళ్లు రెండో స్థాయిలో వ్యాయామం చేస్తున్నప్పుడు, సంగీతం మూడో

స్థాయిలోకి వెళ్ళినా వాళ్ళు రెండో స్థాయిని అనుసరిస్తూనే కాళ్లూ, చేతులూ కదిలించాలి. ఇది చాలా కష్టమైన పని. కాని వాళ్లల్లో ఏకాగ్రతను పెంచడానికి ఇది అనువైన సాధనం అని ఆయన ఉద్దేశ్యం.

"ఇక మార్చండి" అని చివరికి అరిచేవాడు. వెంటనే పిల్లలంతా మూడో స్థాయి లయకు మారేవారు. వాళ్ళకు కాస్త ఊపిరి పీల్చుకున్నట్టుగా అయేది. రెండో స్థాయికి చేరడానికి కండరాలు తయారయ్యే సరికి, సంగీతం ఒక్కసారిగా ఐదో స్థాయిని అందు కొనేది. పిల్లల కాళ్లూ చేతులూ ఇష్టం వచ్చి నట్టు ఆడేవి. "అబ్బా! ఆగండి! ఆగండి!" అని అరిచేవాడు. క్రమంగా అలవాటు పడ్డాక ఆకదలికల్లో ఆనందాన్ని పొందేవాళ్లు.

సాధారణంగా ఆవ్యాయామం పిల్లలు ఎవరికి వాళ్లే ఒంటరిగా చేసే వాళ్లు. ఒక్కొక్కప్పుడు పక్క పిల్లలతో చేతులు కలిసి చేసేవాళ్లు. రెండో స్థాయిలో వున్నప్పుడు కళ్ళు మూసుకొని కూడా చేసేవాళ్లు. అక్కడ వాళ్లు చెయ్యకూడని పని ఒక్కటే. అది మాట్లాడడం!

కొన్ని సందర్భాల్లో సమావేశాలకు పిల్లల తల్లిదండ్రులు బడికి వచ్చేవారు. కిటికీల నుంచి పిల్లలు లయబద్ధంగా చేసే వ్యాయామాన్ని చూసి సంతోషించే వాళ్ళు. సంగీతలయకు అనుగుణంగా పిల్లలు కాళ్ళూ చేతులూ కదుపుతూ వుంటే చూడ ముచ్చటగా వుంటుంది.

దీని మొదటి లక్ష్యం మనసుకూ శరీరానికీ లయజ్ఞానాన్ని కలిగించడం. ఆ విధంగా మనసుకు, శరీరానికీ మధ్య సామరస్యం పెంపొందించడం. ఊహాశక్తిని ప్రేరేపించి వారిలోని సృజనాత్మక శక్తిని వెలికి తీయడం.

టోటోచాన్ ఆ బడికి వచ్చిన మొదటిరోజు గేటు మీద బడిపేరు చూసి "టోమో అంటే ఏమిటమ్మా?" అని అడిగింది.

టోమో అంటే—కామా ఆకారంలో వుండే ప్రాచీన చిహ్నం. హెడ్‌మాస్టరు తనబడికి రెండుటోమోలు కలిసిన సాంప్రదాయిక చిహ్నాన్ని ఎంచు కొన్నాడు. ఒకటి తెల్లది. ఒకటి నల్లది. రెండూ కలిసి పూర్ణ వృత్తంగా వుండేవి. మనసూ శరీరమూ—ఈ రెంటి సమన్వయానికి ఇది ప్రతీక.

దీనివల్ల పిల్లల వ్యక్తిత్వాలు సహజంగా ఎదుగుతాయనీ, పెద్దవాళ్ల జోక్యం ఎక్కువగా అవసరం వుండదనీ ఆయన అభిప్రాయం. అందుకే యురిథమిక్స్‌ను

పాఠ్య ప్రణాళికలో చేర్చడం జరిగింది.

హెడ్‌మాస్టరుకు మామూలు బళ్లల్లో చెప్పే చదువంటే ఇష్టం వుండదు. ఆ బళ్లు అక్షరాలకే ఎక్కువ ప్రాధాన్యతను ఇస్తాయి. ప్రకృతి నుంచి సహజంగా లభించవలసిన ఇంద్రియానుభూతమైన జ్ఞానం ఇలాంటి చదువుల వల్ల లభించదని ఆయన భావం. ప్రేరణ, సన్నని మధుర స్వరం పట్ల సహజాతమైన ఆకర్షణ ఆ చదువులవల్ల చచ్చి పోతుందని ఆయన నమ్మకం:

'వినండి! ఒక కప్ప
నిశ్శబ్దమనే ప్రాచీన సరస్సు
లోకి గెంతుతోంది' కవి బాషో రాశాడు.

వాస్తవానికి బావిలోకి లేక సరస్సులోకి కప్ప దూకడం అందరూ చూసేవుంటారు. కెటిల్‌లో మరుగు తున్న, నీటి నుంచి ఆవిరి రావడం, యాపిల్ పండు చెట్టునుంచి నేలమీద రాలడం, ఈ ప్రపంచంలో, జేమ్స్‌వాట్, న్యూటన్



మాత్రమే చూచారా?

కళ్ళుంటాయి—కాని అందాన్ని చూడలేకపోతాం. చెవులుంటాయి—కాని సంగీత మాధుర్యాన్ని గ్రహించలేకపోతాం. మనసుంటుంది—కాని సత్యాన్ని గ్రహించలేదు. హృదయం వుంటుంది కాని స్పందించ లేదు. జ్వలించలేదు. "అసలు భయపడాల్సిన విషయాలు ఇవే" అంటాడు హెడ్‌మాస్టరు.

చెప్పులు లేని కాళ్లతో పరుగులు తీసే టోటోచాన్ ఇసడోరా డంకన్ లాగవుండేది. విపరీతమైన ఆనందాన్ని అనుభవించేది. ఇది కూడా బడికి వెళ్ళడంలో ఒక భాగమేనంటే నమ్మబుద్ధి అయేది కాదు.

## "నేను కోరుకొనేది ఆ ఒక్కటే!"

గుళ్లో జరిగే ఉత్సవానికి టోటోచాన్ మొదటిసారిగా వెళ్ళింది. పాతబడి దగ్గర్లో వున్న సెంజోకు సరస్సు మధ్యలో ఒక ద్వీపం ఉంది. ఆ గుళ్లో బెంటెన్ దేవత ఉంది. ఆ దేవత సౌందర్యానికీ, సంగీతానికి ప్రతీక. ఉత్సవం జరిగే రాత్రి టోటోచాన్ మసక చీకట్లో తల్లిదండ్రుల వెంట నడుస్తున్నది. ఉన్నట్టుండి కళ్లు మిరిమిట్లు గొలిపే వెలుగుతో పట్ట పగలులా అన్పించింది. వాళ్లు ఉత్సవం జరిగే చోటుకు చేరారన్న మాట. టోటోచాన్ నడుస్తూనే ప్రతిదుకాణం లోకి తొంగి చూస్తూంది. చుట్టూ వింత శబ్దాలు, రకరకాల సువాసనలు, ఆ పిల్లకు అంతా వింతగా తోచింది.

అక్కడ బొమ్మ పైపులు ఉన్నాయి. దానిని నోట్లోపెట్టుకొని పీలిస్తే పిప్పరమెంటు నోట్లోకి వస్తుంది. పిల్లల్ని ఆకర్షించే రకరకాల, రంగురంగుల బొమ్మలున్నాయి ఆ పైపుల మీద. అక్కడ లాలీపాపులూ, పీచుమిఠాయిలూ అమ్ముతున్నారు. వెదురు బొంగుతో తయారైన తుపాకులున్నాయి. పుల్లలు దాంట్లో పెట్టి తోస్తే పెద్దశబ్దం చేస్తూ అవి దూసుకుపోతున్నాయి.

దారి పక్కన ఒకడు కత్తులు మింగుతున్నాడు. సీసా ముక్కలు నమిలి మింగేస్తున్నాడు. మరొకడు, ఏదో పొడి అమ్ముతున్నాడు. ఏదైనా గిన్నె అంచుకు ఆపొడిరాస్తే అందులోనుంచి ప్రతిధ్వని వస్తోంది. ఇంకోచోట మాయ బంగారు గాజులున్నాయి. అవి డబ్బును మాయం చేస్తున్నాయి. మరోచోట ఎండలో పెడితే అచ్చు అయే ఫొటోలు ఉన్నాయి. నీళ్ల గ్లాసులో పడేస్తే

విచ్చుకొనే కాగితపు పూలున్నాయి. వీటన్నింటినీ వింతగా చూస్తూ నడుస్తున్న టోటోచాన్ చటుక్కున ఆగి పోయి అరిచింది-

"అటు చూడు! అటుచూడు! భలే ఉన్నయ్! తల్లీ, తండ్రీ నిలబడి చూశారు. ఒక డబ్బానిండా పసుపుపచ్చని కోడిపిల్లలు కిచకిచ లాడుతున్నాయి."

"నా కొకటికావాలి! ఒక్కటి చాలు! కొనివ్వరూ!" తల్లిని పట్టుకు లాగుతూ ఆశగా అడిగింది.

కోడిపిల్లలు, తలలుపైకెత్తి కిచకిచలాడాయి. "అబ్బ! ఎంత ముద్దొస్తున్నాయో?" అంటూ అక్కడే వాటిపక్కగా కూర్చుండిపోయింది. ఇంత అద్భుతమైన దృశ్యం అంతకు ముందెన్నడూ ఆపిల్ల చూడలేదు.

"ఒక్కటి కొని పెట్టరూ?" తల్లి దండ్రుల్ని అడిగింది బతిమాలుతున్నట్టుగా. తల్లి దండ్రులు ఆపిల్లని అక్కడ్నుంచి త్వరగా లాక్కెళ్లే ప్రయత్నం చేశారు.

"నాకు ఏదన్నా కొనిపెడ్తా నన్నారుగా? నాకు ఇదేకావాలి!"

"వద్దు తల్లీ! నామాటవిను. ఈ కోడి పిల్లలు కొంచెం సేపట్లోనే చచ్చి పోతాయి," అన్నది తల్లి లాలనగా.

టోటోచాన్‌కు ఏడుపు వచ్చింది "ఎందుకు చచ్చిపోతాయి?" అని అడిగింది.

తండ్రి టోటోచాన్‌ను పక్కకు తీసుకెళ్ళి చెప్పాడు- అవి చాలా బలహీనంగా వున్నాయిరా! ఎక్కువ సేపు బతకవు. ఆతర్వాత నీకు మరీ ఏడుపు వస్తుంది. నామాట వినరాకన్నా!"

టోటోచాన్ ఎవరిమాటా వినడానికి సిద్ధంగా లేదు. తనకు ఒక కోడిపిల్లకావాలి. అంతే! "నా కది కావాలి నేనుదాన్ని చావనివ్వను," అన్నది. తల్లి తండ్రులు ఆమెను అక్కడ్నుంచి తీసు కెళ్ళే ప్రయత్నం చేశారు. టోటోచాన్ మొండి కెత్తింది. అక్కడ్నుంచి కదల్లేదు. కోడి పిల్లలు కూడా ఆ పిల్లను మెడలెత్తి చూస్తూ కిచకిచలాడాయి.

"ఒక్కటి! ఒక్కటంటే ఒక్కటే! కొనిపెట్టరూ?" మారాం చేయసాగింది. తల్లి దండ్రులు ఏమైనా సరే ఇది మాత్రంకొని పెట్టం! ఇది నిన్ను చివరకు ఏడిపిస్తుంది," అన్నారు.

టోటోచాన్‌కు దుఃఖం పొంగుకొచ్చింది. చెంపలమీదగా కన్నీరు కారిపోతూవుంది. తల్లి దండ్రుల పక్కనే వెక్కుతూ నడుస్తున్నది. మళ్ళీ చీకటి దారిలోకి ప్రవేశించారు. "మిమ్మల్ని ఇంకెప్పటికీ ఏమీ అడగను, సరేనా! ఈ ఒక్కసారికి నాకు ఇదికొని పెట్టండి, మళ్ళీ ఏమీ కొని పెట్టమని అడగను. ఈ సారికే, ఈ ఒక్కసారికి. ఒకే ఒక్క కోడి పిల్లను కొనిపెట్టండి చాలు," ఏడుపుగొంతుతో బతిమాలుకుంది.

చివరకు ఆ తల్లి దండ్రులకు అంగీకరించక తప్ప లేదు.

అంతవరకూ మబ్బులు కమ్మిన ఆకాశంలా వున్న ఆ పిల్ల ముఖంమీద వెలుగులు పరుచుకున్నాయి. టోటోచాన్ చేతిలో రెండు కోడి పిల్లలున్న చిన్న పెట్టెవుంది. పెదవుల మీద చిరు నవ్వులు వెల్లి విరిశాయి.

తెల్లవారి తల్లి వడ్రంగిని పిలిపించింది. కటకటాలున్న పెట్టెను తయారు చేయించింది. వెచ్చగా వుండడానికి కరెంటు బల్బుకూడా పెట్టించింది. ఆరోజంతా టోటోచాన్ కోడిపిల్లల్ని చూస్తూ వాటికి ఎదురుగానే కూర్చుంది. వాటితో నే ప్రతిరోజూ కాలక్షేపం. కాని నాలుగోరోజు ఒక కోడి పిల్ల కదలిక లేకుండా వుండిపోయింది. ఐదోరోజు తెల్లారేసరికి రెండోది కూడా బిగిసి చలన రహితంగా అయిపోయింది. టోటోచాన్ కదిలించి చూసింది. అదికదల్లేదు. కిచకిచ మనలేదు. అవి చచ్చిపోయాయని తెలుసుకుంది. దుఃఖం ఆగలేదు. ఏడుస్తూనే తోటలో గొయ్యి తవ్వింది. వాటిని పెట్టి మట్టి పోసింది. ఆ మట్టిమీద ఒక పువ్వు వుంచింది. ఖాళీ పెట్టె ఓమూల పడేసింది. అందులో ఒక పచ్చటి ఈక కన్పించింది. ఆక్కడిపిల్లల్నీ, వాటి కిచకిచల్నీ గుర్తు చేసుకుంటూ చాలా సేపు చలన రహితంగా నిలబడిపోయింది. వస్తున్న దుఃఖాన్ని పళ్ళ బిగువున ఆపుకుంది.

టోటోచాన్ అంతవరకు అంత గాఢంగా దేనినీ కోరుకోలేదు. ఒక్కటే కోరుకుంది. అదికాస్తా దూరం అయింది. కోరుకున్నది దూరం అయినప్పుడు కలిగేబాధ ఎలా వుంటుందో తెలిసింది ఆపసిమనసుకు మొట్టమొదటి సారిగా.

## పాత దుస్తులు

టోమో లో బడికి వెళ్ళేప్పుడు, వున్నవాటిలో బాగా చిరిగిపోయి, మాసిపోయిన దుస్తులు వేసి పిల్లల్ని పంపించమని చెప్పేవాడు, హెడ్‌మాస్టరు. బట్టలు మాసిపోయాయి, చిరిగిపోయాయి, అని పెద్దలు పిల్లల్ని తిట్టే అవకాశం కలగకుండా వుండాలనేదే ఆయన ఆశయం. బట్టల విషయంలో పెద్దవాళ్ళు కోప్పడతారేమోనని పిల్లలు భయపడటమంత సిగ్గుచేటు విషయం మరొకటి వుండదని ఆయన అభిప్రాయం.

బట్టలు చిరిగి పోతాయనే బెంగ లేకుండా పిల్లలు ఆడుకోగలిగేవారు. మగ పిల్లల ప్యాంటుల మీద మాసికలు వేసి వుండేవి. ఇప్పటి జీన్స్‌లాంటి దళసరి ప్యాంటు బట్టలు ఆరోజుల్లో వుండేవి కావు. ఆడ పిల్లల గౌన్లు కూడ దళసరి బట్టతో కుట్టేవారు.

టోటోచాన్‌కు ఇష్టమైన ఒక అలవాటు వుండేది. తోటలకు వేసిన కంచెల కిందనుంచీ, ఖాళీ స్థలాలకు వేసిన కంచెల కిందనుంచీ, దూరిపోవడం ఇష్టం. ఆరోజుల్లో కంచెలన్నీ ముళ్ళ తీగలతోనే వుండేవి. అలా దూరుతున్నప్పుడు టోటోచాన్ తనువేసుకున్న దుస్తుల గురించి ఆలోచించేది కాదు. ఆ తీగల నుంచి దూరిపోవాలంటే కుక్కల్లా నేలకు కరచుకొని దూరాల్సి వచ్చేది. అయినా ముళ్ళకుపట్టుకొని టోటోచాన్ బట్టలు చిరిగి పోతూనే వుండేవి. ఒకసారి ఏంజరిగిందంటే?... టోటోచాన్‌కి బాగా పాత బడి పోయిన సిల్కుడ్రెస్ ఉండేది. అది అప్పటికే పాతబడి దారాలు వేలాడు తుండేది. ఒకసారి కంచెకింద నుంచి పాకేసరికి ఆ బట్టలు పూర్తిగా పీలిక లై పోయాయి. పాతవైనా ఆదుస్తులంటే ఆమె తల్లికి చాలా ఇష్టం. అమ్మకు ఏం చెప్పాలో ఎలా చెప్పాలో ఆలోచించింది. ముళ్ల తీగలు పట్టుకు చిరిగాయని చెప్పే ధైర్యం లేదు. అందుకే ఒక కథ అల్లి చెప్పింది.

ఇంటికివస్తూనే "అమ్మా! అమ్మా! ఇవ్వాళేం జరిగిందనుకున్నావ్? నేను రోడ్డుమీద వస్తున్నానా! వెనక నుంచి కొందరు పిల్లలు నా మీదకు కత్తులు విసిరారు. చూడు! నా బట్టలు ఎలా చిరిగి పోయాయో!" అంటూ గబగబా చెప్పేసింది.

"అయ్యో! నా చిట్టికన్న ఎంత భయపడి పోయిందో? అనేసింది తల్లి మరో ప్రశ్న వెయ్యకుండా."

టోటోచాన్ తేలిగ్గా గాలి పీల్చుకుంది. తను చెప్పిన కథ అమ్మ నమ్మిందిలే అనుకుంది.

కాని తల్లి నిజంగా నమ్మలేదు. కత్తులు విసిరితే వీపుగాయ పడుతుందని ఆమెకు తెలుసు. బట్టలు చిరిగాయి అందుకే భయపడి అబద్ధం చెప్పిందని అర్థం చేసుకుంది. అలా భయపడడం మంచిదే అనిపించింది. అయినా ఎప్పటినుంచో అడగాలనుకున్న విషయం అడిగెయ్యడానికి తల్లికి మంచి అవకాశం దొరికింది.

"కత్తులతో కటారులతో బట్టలు ఎలా చిరుగుతాయో నాకు అర్థం అయింది. కాని రోజూ నీ చెడ్డీలు ఎందుకు చిరుగుతాయో నాకు అర్థం కావడం లేదు తల్లీ!" అన్నది.

టోటోచాన్ చెడ్డీలకు లేసుల అంచులుంటాయి. ఎప్పుడూ పిర్రలమీద చిరిగి పోతుంటాయి. జారుడు బండ మీద జారితేనో, కింద కూర్చుంటేనో మురికి అవుతుంది. కాని చిరగవు ఇది తల్లికి అర్థం కాని విషయం.

ఒక్కక్షణం ఎలా సమాధానం చెప్పాలో తోచలేదు టోటోచాన్‌కు. "అమ్మా! మరే! కంచెకింద నుంచి దూరేప్పుడేమో గౌనుకు ముళ్లతీగ తగల కుండా వుండదు. కంచె దాటేప్పుడేమో ముళ్లు చెడ్డీని పట్టుకుంటాయి." అని ఒక్షణం ఆగి మళ్లీ మొదలు పెట్టింది. "కంచెకిందకు పాకి-" ఏమండీ! లో పలకు రావచ్చా? అని అడిగి, "సరే! వెళ్ళొస్తానండీ" అని అవతలివైపు వెళ్తూ వున్నప్పుడు గౌన్లూ, చెడ్డీలూ చిరిగిపోతాయికదమ్మా?"

ఆమెకు అసలు విషయం సరిగ్గా అర్థంకాలేదు.

"అలా చేస్తే సరదాగా వుంటుందాకన్నా?"

తల్లి ప్రశ్నకు టోటోచాన్ ఆశ్చర్యపోయింది. "అమ్మా! అమ్మా! నువ్వు కూడా అట్లా చేసి చూడమ్మా! ఎంత సర్దాగా వుంటుదను కున్నావ్? నీ కయినా చెడ్డీలు చిరిగిపోతాయి తెలుసా?" అన్నది ఉత్సాహంగా.

ఆ ఆట ఏమిటో ఆమెకు కూడా చూడాలని పించింది. అందుకు ముందొక మైదానంచూడాలి. దానికి చుట్టూముళ్ల తీగలువుండాలి. ఆ తీగలకింద నుంచి

పోతాలి.

పెద్దవాళ్ళకు ఇది ఆటగా వుండదు. విసుగ్గా అలసటగా వుంటుంది. చిన్న పిల్లలకు అదొక అద్భుతమైన అనుభవం. వళ్ళంతాదుమ్ము కొట్టు కొనివున్న కూతుర్ని చూస్తుంటే ఆమెకు ఈర్ష్య కలిగింది. ఆ స్కూలు హెడ్ మాస్టరు మీద గౌరవం ఇనుమడించింది. పిల్లల దుస్తుల విషయంలో కూడా ఆయన చేసిన సూచనలు ఆయనకు పిల్లల పట్లగల ప్రేమ వ్యక్త మౌతుంది.

## టాకాహాషీ

ఒకరోజు పిల్లలంతా బడి ఆవరణలో ఆడుకొంటున్నారు. హెడ్ మాస్టరు ఒక చిన్న పిల్లవాడిని వెంటబెట్టుకొని వచ్చాడు. "ఇదుగో! పిల్లలూ! ఇలారండి. చూడండి! మీకొక కొత్త నేస్తం వచ్చాడు. పేరు టాకాహాషీ! ఒకటో తరగతి రైలు పెట్టెలోకి ఎక్కుతాడు," అన్నాడు పిల్లలను ఉద్దేశించి. టోటో చాన్, మిగతా ఒకటో తరగతి పిల్లలందరూ చిన్న వాళ్లే. టాకాహాషీ మరీ చిన్న వాడు. చిన్ని చిన్ని చేతులు బుల్లి బుల్లి కాళ్లు! చిన్న తలకాయి. దానిమీదొక టోపీ. భుజాలు మాత్రం వెడల్పుగా ఉన్నాయి. బిక్కు బిక్కు మని చూస్తూ నిల్చున్నాడు.

"మనం ఆ అబ్బాయి తో మాట్లాడదాం!" అంది టోటోచాన్. మియోచాన్ సాకోచాన్ అందుకు సరేనన్నారు. అందరూ ఆకుర్రాడి దగ్గరకు వెళ్ళారు. వాళ్ళను చూసి ఆ పిల్లవాడు చిరునవ్వు నవ్వాడు. వాళ్ళు కూడా జవాబుగా నవ్వారు. టాకాహాషీకళ్ళు చాలా పెద్దవిగా ఉన్నాయి. ఆకళ్లు ఏదో చెప్ప బోతున్నట్టున్నాయి.

"రైల్లో మన తరగతి గది చూస్తావా?" అడిగింది టోటో

"ఊఁ" అన్నాడు టాకాహాషీ తలమీద నుంచి టోపీతీసి పెట్టుకుంటూ.

టాకాహాషికి తరగతిగది చూపించాలని తొందర పడి పోతున్నాది టోటోచాన్. గబగబా వెళ్ళి రైలు పెట్టె ఎక్కింది. తలుపు దగ్గర నిలబడి "రా! రా! త్వరగా రా!" అంటూ అరుస్తూ పిలిచింది.

టాకాహాషీ త్వరత్వరగా నడుస్తున్నట్టే కన్పించాడు. కాని ఇంకాచాలా

దూరంలోనే ఉన్నాడు.

"వస్తున్నా" అంటూ పరిగెత్తడానికి ప్రయత్నిస్తున్నాడు. కాని తప్పటడుగులు వేస్తున్నాడు.

యాసువాకీ చాన్ లాగ కాలు ఈడుస్తూ నడవడం లేదు. కాని ఇతను కూడా సరిగ్గా నడవడం లేదనుకుంది. టోటోచాన్ చూస్తూ నిల్చుంది. ఆకుర్రాడు వేగంగా నడవడానికే ప్రయత్నిస్తున్నాడు. తొందర పెట్ట నవసరం లేదనుకుంది. ఆకుర్రాడి కాళ్లు మరీ కురచగా ఉన్నాయి. దొడ్డికాళ్ళు. అతడి ఎదుగుదల ఆగిపోయిందని ఉపాధ్యాయులకు తెలుసు. "నువ్వు వేగంగా పరిగెత్తు తావుగదూ?" అన్నాడు దగ్గరకు వచ్చిన టాకాహాషి "మాది ఒసాకా" అన్నాడు తనను పరిచయం చేసుకుంటున్నట్టుగా.

"ఒసాకానా!" ఉత్సాహంగా అడిగింది టోటోచాన్. తను ఒసాకాకు ఎప్పుడూ వెళ్ళలేదు. అయితే అది ఆమె కలలప్రపంచం. ఆమె మేనమామ అక్కడే చదువుకుంటున్నాడు. ఆయన ఎప్పుడు వచ్చినా టోటోచాన్ చెవుల దగ్గర చేతులు పెట్టి పైకెత్తి "నీకు ఒసాకా చూపిస్తాను. ఊ చూశావా? కనబడిందా?" అని అడిగేవాడు.

అది పెద్దవాళ్ళు పిల్లలతో ఆడే ఆట. టోటోచాన్ మామయ్య మాటలు నమ్మేది. ఆయన అలా చేస్తున్నప్పుడు చెంపలు సాగి నట్టయి నొప్పి పుట్టేవి. కళ్ళు తిరిగినట్టయ్యేవి. చెవులు నలిగి ఎర్రబడేవి. కాని ఎంత సేపు అలా చూసినా ఒసాకా కన్పించేది కాదు. ఏదో ఒకరోజు కన్పిస్తుందని నమ్మింది. మామయ్య వచ్చినప్పుడల్లా మావయ్యా! మరేమో! ఒసాకా చూపించవా? అని అడిగేది. ఇప్పుడు ఈ అబ్బాయి తను కలలు కంటున్న ఊరి నుంచి వచ్చానంటున్నాడు! భలే! భలే!

"ఒసాకా బాగుంటుందికదూ? దానిని గురించి చెప్పు!"

"ఒసాకా గురించి చెప్పాలా?" అన్నాడు. ఆగొంతు స్పష్టంగా, నిండుగా ఉంది. అంతలో తరగతి గంటమోగింది.

టోటోచాన్‌కు గంటమోగడం నచ్చలేదు. పుస్తకాల బరువుతో ఊగుతూ రైలు పెట్టె లోకిఎక్కి, మొదటివరసలో కూర్చున్నాడు. టోటోచాన్ గబగబా వెళ్ళి అతడిపక్కన కూర్చుంది. ఆమెకు ఆకుర్రాణ్ణి వదలాలని పించడం లేదు.

టాకాహాషి ఇప్పుడు టోటోచాన్‌కు నేస్తం.

## "దూకబోయే ముందు చూసుకో!"

టోటోచాన్ బడి నుంచి ఇంటికి వస్తుండగా దారిలో ఒక ఆసక్తి కరమైన వస్తువు కన్పించింది. అది ఒక ఇసుకదిబ్బ. సముద్రానికి ఇంత దూరంలో ఇసుక కుప్ప కన్పించడం ఆశ్చర్యాన్ని కలిగించే సంగతే కదా? దాన్ని చూసిన టోటోచాన్‌కు అంతులేని కుతూహలం కలిగింది. ఇది కలా? నిజమా! నిల్చున్న చోటనే ఆనందంతో గంతులేసింది. మరుక్షణం ఆ దిబ్బకేసి పరుగుతీసింది. ఒక్కసారిగా దానిమీదకు ఎగిరిదూకింది. అది ఇసుక దిబ్బకాదు. గోడలకు పూతగా వెయ్యడానికి తయారు చేసిన సున్నపు ముద్ద అది. టోటోచాన్ గభాల్న దాంట్లోకి దిగబడిపోయింది. పుస్తకాలసంచి, జోళ్ళసంచితో పాటు అందులో పూర్తిగా మునిగి విగ్రహంలా అయింది. గుండెలదాకా దిగబడిపోయింది. బయటికి రావడానికి ప్రయత్నించిన కొద్దీ కిందకు దిగబడి పోతున్నది. చెప్పులు కాళ్లనుంచి జారిపోతున్నాయి. జోళ్ల సంచిని పట్టుకున్న ఎడంచెయ్యి ఆజిగట పదార్థం మీద అతుక్కు పోయింది. ఒకరిద్దరు స్త్రీలు అటుగా వెళ్ళారు. టోటో చాన్ వాళ్ళను పిల్చింది. వాళ్ళు తిరిగి చూసి పిల్ల ఆడుకుంటుంది కాబోలు అనుకొని, నవ్వుకుంటూ వెళ్ళి పోయారు.

చీకటిపడింది. పిల్ల ఇంటికి రాలేదు. తల్లి వెదుక్కుంటూ బయలు దేరింది. సున్నపుదిబ్బలోంచి పైకి కన్పిస్తున్న టోటోచాన్ ముఖం కన్పించింది. ఆమెకు అమితమైన ఆశ్చర్యం కలిగింది. ఆమె కూతుర్ని చెయ్యిపట్టు కొని లాగాలని ప్రయత్నించింది. ఆ ప్రయత్నంతో ఆమె పాదం కూడా ఆజిగటలో దిగబడసాగింది. వెంటనే జాగ్రత్తపడింది. ఒక దుడ్డు కర్ర సంపాదించింది. టోటోచాన్‌కు ఒక చివర అందించి లాగ సాగింది.

టోటోచాన్ వళ్ళంతా బూడిదరంగు సున్నం అంటుకుంది.

"నీకి దివరకోసారి చెప్పాను. గుర్తుందా? ఏదైనా ఆసక్తి కరంగా కన్పిస్తే ఒక్కసారిగా దానిమీదకు దూకొద్దనీ, దూక బోయే ముందు చూసుకోమనీ చెప్పలేదూ?" అన్నది తల్లి.

తల్లి చెప్పిన "ఆ ఇదివరకోసారి" ఏమిటో తెలుసా? అది బళ్లో

మధ్యాహ్నం విరామ సమయంలో జరిగింది. టోటోచాన్ అసెంబ్లీ వెనక భాగంలో పచార్లు చేస్తున్నది. అక్కడ బాట మధ్యలో ఒక పత్రిక పరచి వుండడం కన్పించింది. కుతూహలంగా చూసింది. దానిమీదకు దూకితే? ఆలోచన వచ్చీరాగానే వెనక్కు రెండడుగులు వేసి, కాగితం మీదకు ఒక్క దూకు దూకింది. అంతే మరుగు దొడ్డిగోతిలోకి పడిపోయింది. దానిమీద మూత ఏమైందో! మాలి కాగితం కప్పాడు. ఇంతకు ముందు ఆగొయ్యి గురించే చెప్పడం జరిగింది కదూ! ఇది అదేగొయ్యి. ఆగొయ్యి ఎంత దారుణంగా వుంటుందో ఊహించుకొండి. అదృష్టం బాగుండి వెంటనే బయటకు తియ్యడం ఆ పిల్లను శుభ్ర పర్చడం జరిగింది. ఆ విషయాన్నే తల్లి గుర్తు చేసింది.

"ఇంకెప్పుడూ అట్టా దూకనమ్మా!" తప్పు చేసినట్టు చిన్నగా అన్నది. తల్లిమనసు కుదుటపడింది. కాని ఆ తర్వాత అన్న మాటవిని తల్లి గతుక్కు మంది.

"ఇక మీదట పత్రికల మీదకూ ఇసుక కుప్పల మీదకూ దూకను" అవికాక వేరే వేటి మీదకైనా దూకడానికి మళ్ళీ వెనకాడదని తల్లికి తెలిసిపోయింది.

అధి పొద్దు తక్కువ కాలం. వాళ్ళు ఇల్లు చేరే సరికీ బాగా చీకేటి పడిపోయింది.

## "ఆ తర్వాత...వ్వాహ్"

టోమోలో మధ్యాహ్నపు భోజనాల సమయం చాలా సరదాగా వుంటుంది. తర్వాత అది ఆసక్తి కరంగా కూడా తయారైంది.

హెడ్‌మాస్టరు రోజూ పిల్లల టిఫిన్ బాక్సులోకి చూస్తూ "కొండల నుంచి కొంచెం, సముద్రం నుంచి కొంచెం, తెచ్చుకున్నారా?" అని అడుగుతూనే వున్నాడు. అతని భార్య రెండు గిన్నెల్ని చేతపట్టుకొని ఎవరికి ఏంకావాలో పెడుతూనేవుంది. తింటూ "నములు-నములుబాగా" అంటూనే ఉన్నారు. "ఇటాడాకీ మాను" అని అంటూనే ఉన్నారు. ఇప్పుడు మాత్రం, "ఇటాడాకీ మాను" అన్నతర్వాత పిల్లలు లేచి ఉపన్యాసం ఇవ్వాల్సివస్తోంది.

"మనందరం బాగా మాట్లాడడం నేర్చుకోవాలిగామరి! అందుకని,

మధ్యాహ్నం భోజనాలు చేస్తున్న సమయంలో ఎవరో ఒకరు మధ్యలో నిలబడి మాట్లాడాలి. విషయం ఏదైనా పర్వాలేదు. ఇలా చేస్తే బాగుంటుంది గదూ?" ఒకరోజు హెడ్‌మాస్టరు అడిగాడు.

పిల్లలందరూ కుతూహలంతో అంగీకరించారు.

జపనీస్ కుటుంబాలలో భోజనం చేసేటపుడు మాట్లాడకూడదని పిల్లలకు చెబుతారు. కాని హెడ్‌మాస్టరు భోజనాలు చేస్తున్నప్పుడు పిల్లలు ఉత్సాహంగా వుండాలని భావించాడు. అందుకే ఈ పద్ధతిని ప్రవేశపెట్టాడు. అంతేకాదు. ఇతరుల ముందు ఎలా నిలబడాలో, సిగ్గుతో మెలికలు తిరిగిపోకుండా ఎలా మాట్లాడాలో పిల్లలకు తెలియడం అవసరం అని ఆయన భావించారు.

ఈ విషయంలో ఆయన కొన్నిసూచనలు చేశారు.

"గొప్ప ఉపన్యాసకులు కావాలని మీరేమీ తాపత్రయపడనక్కర్లేదు.



గాభరాపడనక్కర్లేదు. మీకు ఇష్టమైన విషయం మీద మాట్లాడవచ్చు. ఏదయినా సరే! మీరు చెప్పాలనుకున్న దేదయినా సరే చెప్పొచ్చు."

ఎవరెవరు ఎప్పుడు మాట్లాడాలో నిర్ణయించారు. పాట అయి భోజనం పూర్తి కాగానే మాట్లాడాలి. పక్క పిల్లలతో మాట్లాడినట్టుకాదనీ, అందర్నీ ఉద్దేశించి మాట్లాడాలని పిల్లలకు అర్థం అయింది. ఇది సాధారణమైన విషయం కాదని కూడా అర్థం అయింది. కొందరు పిల్లలయితే మహా సిగ్గుపడిపోయారు. ముసిముసిగా నవ్వుకుంటూ నిలబడిపోయారు. ఒకబ్బాయి శ్రమపడి ఉపన్యాసం తయారు చేసుకున్నాడు. తీరా నిలబడే సరికి ఒక పాయింటు కుడా గుర్తు రాలేదు. "కప్పలు పక్కలకే ఎందుకు దూకుతాయి?" అని శీర్షిక చెప్పాడు, "వర్షం పడిన సమయంలో...సమ...యం...లో..." బండి ముందుకు సాగడం లేదు. తలవంచి అభివాదంచేసి వెళ్ళికూర్చున్నాడు.

టోటోచాన్ వంతు ఇంకా రాలేదు. కాని తనుమాట్లాడ దలచుకున్న విషయం ఆలోచించుకుంది. అది "రాజా రాణి" కథ ఆ కథ. అందరికీ తెలుసు. టోటోకు ఆ కథంటే ఇష్టం.

సమయం దొరికి నప్పుడల్లా ఆ కథ చెప్పడానికి ప్రయత్నించేది. "బాబోయ్! బోరు? మాకూ తెలుసు ఆ కథ"అనేవాళ్లు. ఇప్పుడు మంచి అవకాశం చిక్కింది. ఆ కథే చెప్పదల్చుకుంది. ఇంకా ఆమె వంతు రాలేదు.

ఒక్కరోజు ఉపన్యాసం ఇవ్వాల్సిన వంతు ఒక కుర్రాడికి వచ్చింది. వాడు "నాకు మాట్లాడడానికేమీలేదు," అనేసి కూర్చున్నాడు.

ఎవరికైనా, మాట్లాడడానికి ఏమీ లేకుండా ఎట్లా వుంటుందో టోటోచాన్‌కు అర్థం కాలేదు.

హెడ్‌మాస్టరు, ఆకుర్రాడు కూర్చున్న బల్లదగ్గిరకు వెళ్ళాడు. అతని టిఫెన్‌బాక్స్ ఖాళీగా వుంది.

"నీకు చెప్పడానికి ఏమీలేనట్టేనా?" అని అడిగాడు.

"లేదు!"

ఆకుర్రాడు తప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టుగా అన్పించలేదు. నిజంగానే చెప్పడానికి ఏమీలేదేమో! హెడ్‌మాస్టరు తలవెనక్కి విరిచి బిగ్గరగా నవ్వసాగాడు. అలానవ్వుతుంటే పళ్లమధ్యతొర్రి కన్పిస్తుందేమోననే బెంగ

ఆయనకు లేదు.

"ప్రయత్నిద్దాం. నువ్వేమైనా చెప్పగలవేమోచూద్దాం!" అని హెడ్‌మాస్టరు ఆకుర్రాణ్ణి పిల్లల మధ్య వలయంలో నిల్చోబెట్టాడు. తను వెళ్ళి ఆకుర్రాడు కూర్చున్న బల్ల ముందు కూర్చున్నాడు.

"గుర్తు చేసుకో. ఈరోజు నిద్ర లేచినప్పట్నుంచి. బడికి వచ్చేంత వరకు ఏం చేశావో గుర్తు చేసుకో" అన్నాడు హెడ్‌మాస్టరు.

ఆకుర్రాడు బుర్రగోక్కున్నాడు. "అలాగే..." అని ఆలోచనలో పడ్డాడు.

"బాగుంది. 'అలాగే' అన్నావుగా? అంటే ఏదో చెప్ప బోతున్నావనేగా?



అలాగే చెప్పు! పొద్దుట ఏం చేశావో చెప్పు."

"అది...ఆ...నేను నిద్రలేచాను..." బుర్రగోక్కుంటూ అన్నాడు ఆకుర్రాడు.

టోటోచాన్, మిగతా పిల్లలూ తమాషా చూస్తున్నారు. శ్రద్ధగా వింటున్నారు. ఆ కుర్రాడు "అదీ...అదీ...అప్పుడు..."అంటూ బుర్రగోక్కున్నాడు,

"బాగుంది. సరే! అన్నావుకదా! చాలా బాగుంది. ఆ తర్వాత ఏం చెబుతావో చెప్పు," అన్నాడు హెడ్‌మాస్టరు.

"సరే...మరే...నిద్రలేచాను. మళ్లీబుర్ర గట్టిగా గోక్కున్నాడు.

పిల్లలంతా తమాషాచూస్తున్నారు. జాగ్రత్తగావింటున్నారు. హెడ్‌మాస్టరు ఆ పిల్లవాడ్ని చూస్తూ ఓపిగ్గా కూర్చున్నాడు. ఆయన పెదవుల మీద చిరునవ్వు తొణికిసలాడుతోంది. "బాగుంది-చాలాబాగా చెప్పావు. నువ్వు ఇవ్వాళ ఉదయం చాలా తొందరగా నిద్రలేచావు. ఆ విషయం చక్కగా అందరికీ అర్థం అయ్యేలాగ చెప్పావు. మొదట్లో అసలు చెప్పడానికి ఏమీ లేదన్నావు. కాని ఉన్నది అని నీకు ఇప్పుడు అర్థం అయిందికదూ? ఉపన్యాసం బాగా చెప్పడానికి నవ్వించక్కర్లా. ముఖ్యమైన విషయం ఏమిటో తెలిస్తేచాలు. అదినీకు తెలిసింది."

ఆ కుర్రాడు కూర్చోకుండా మళ్లీ చెప్పడానికి ప్రయత్నించాడు. "అప్పుడు... అప్పుడేమైంది... అమ్మ...పళ్లు తోముకో అంది."

పిల్లలు ముందుకు వంగి కుతూహలంగా వింటున్నారు.

హెడ్‌మాస్టరు చప్పట్లు కొట్టాడు. పిల్లలు కూడా చప్పట్లు కొట్టారు. టోటోచాన్ ఉత్సాహంగా చప్పట్లు కొట్టింది. పిల్లల మధ్యలో నిల్చుని వున్న ఆకుర్రాడు కూడా చప్పట్లు కొట్టారు.

పెద్దవాడయ్యాక కూడా ఆనాటి ఆ చప్పట్లు అతనికి గుర్తు వుండే వుంటాయి.

## "మేం ఆడు కుంటున్నాం!"

టోటోచాన్ భోజనం చెయ్యబోయే ముందు రాకీతో ఆడుకుంటూ వుండగా ఒక ప్రమాదం జరిగింది.

ఆ ఆటలో ఇద్దరూ చెరొక వైపునుంచి దొర్లుకుంటూవచ్చి ఒకర్నొకరు

గుద్దుకోవాలి. అప్పుడు ఇద్దరికీ తగాదా వస్తుంది. ఇలా రెండు మూడు సార్లు ఆడారు. ఆ తర్వాత టోటోచాన్‌కు కొత్త ఆట ఆడాలని పించింది. ఆ ఆటలో కూడా ఇద్దరు చెరొకవైపు నుంచి దొర్లుకుంటూ రావాలి. ఒకర్నొకరు ఢీకొట్టు కున్న తర్వాత తోడేళ్లలా ముఖం పెట్టి భీకరంగా చూడాలి. ఎవరెంత ఎక్కువ భయంకరంగా చూస్తే వాళ్ళు గెలిచినట్టు. రాకీ జర్మన్ జాతి కుక్క. దానికి భయంగొలిపేలా చూడడం కష్టం కాదు. అయితే అది ఒకటి చెయ్యాలి. చెవి నిక్కబొడిచి, నోరు తెరిచి పళ్లు చూపిస్తూ గుర్రుమనాలి. దాని చేత అలా చేయించడం కష్టమైన పనే. టోటోచాన్ తన చెప్పులు రెండూ రెండు చేతులతో పైకిలాగి పట్టుకొని నోరు తెరిచి గుర్రుమని రాకీని బెదిరించింది. రెండు మూడు సార్లు రాకీ ఆ ఆట బాగానే ఆడింది. కాని రాకీ మరి కుక్క కదా? ఆ కరవబోవడం ఆట మాత్రమేనని మర్చిపోయింది. టోటోచాన్‌ను నిజంగా కరిచేసింది.

రాకీ ఇంకా పిల్లే. అయినా టోటోచాన్‌కు రెండింతలు పెద్దగా వుండేది. దాని పళ్లు బాగా పదునుగా వుండేవి. టోటోచాన్‌కు ఏం జరిగిందో తెలుసుకొనే లోపలే, చెవితెగి రక్తం వరదలైపారింది.

టోటో చాన్ ఏడుపు విని తల్లి పరిగెత్తు కొచ్చింది వంటింట్లోనుంచి గదిలో ఓమూలగా టోటోచాన్, రాకీ ఉన్నారు. టోటోచాన్ చెవిని రెండు చేతులతో పట్టుకొని ఏడుస్తున్నది. హాల్లో కూర్చుని వైలన్ వాయించు కుంటున్న తండ్రి కూడా పరిగెత్తు కొచ్చాడు. రాకీకి తనేదో తప్పు చేసినట్టు అర్థం అయింది. తోకను రెండు కాళ్లమధ్య ఇరికించుకొని, ముడుచుకొని, మూల కూర్చుని, టోటోచాన్ కేసి చూడ సాగింది జాలిగా.

టోటోచాన్‌కు ఒకభయం కలిగింది-అమ్మకూ నాన్నకూ రాకీమీద కోపంవచ్చి తరిమేస్తారేమో-లేక ఎవరికైనా ఇచ్చేస్తే? రాకీ లేకుండా తను ఉండగలదా? చెవిపట్టుకొని రాకీ పక్కగా కూర్చుని "రాకీని ఏమీ అనకండి. దాన్ని తిట్టకండి" ఏడుస్తూనే పదేపదే అన్నది.

టోటోచాన్‌కు ఏం జరిగిందో తెలుసుకోవడానికి ప్రయత్నిస్తున్నారు తల్లిదండ్రులు. చెవిమీద నుంచి చేతులు తియ్యకుండా "నాకేం కాలేదు. చిన్నగాయం. అంతే! రాకీని ఏమీ అనవద్దు," అన్నది. నిజంగానే ఆ

సమయంలో టోటోచాన్ తన నొప్పిని మర్చి పోయింది. కారుతున్న రక్తంచూసి తల్లిదండ్రులు, రాకీ కరిచి వుంటుందని అర్థం చేసుకున్నారు. "రాకీని ఏం చెయ్యం" అన్న తర్వాతే చెవిమీది నుంచి చేతులు తీసింది. తెగివేలాడుతున్న కూతురి చెవి చూసి తల్లిగొల్లున ఏడ్చింది. తండ్రి పిల్లను ఎత్తుకొని డాక్టరు దగ్గరకు పరుగుతీశాడు. తల్లి అతని కంటే ముందే పరుగుతీసింది. డాక్టరు చెవును యథాస్థానంలో వుంచి కుట్టేశాడు. తల్లిదండ్రులు ఊపిరి పీల్చుకున్నారు. అమ్మానాన్నా అన్న మాట నిలు పుకుంటారా! అనే ఆలోచనతో సతమతమవుతున్నది టోటోచాన్.

తలమీది నుంచి గడ్డం దాకాకట్టు కట్టారు. ఆకట్లతో టోటోచాన్ తెల్ల కుందేలులావుంది. ఇంటికి వచ్చారు. తండ్రికి రాకీ మీదకోపంగా వుంది. కాని తల్లి కళ్లతోనే దాన్ని ఏమీ అనొద్దని వారించింది.

అంతా సర్దుకుందనీ, అమ్మకూ నాన్నకూ రాకీమీదకోపం లేదనీ టోటోచాన్‌కు అన్పించింది. అంతే ! వెంటనేరాకీ వుండే గదిలోకి వెళ్ళింది. ఎక్కడా అది కన్పించలేదు. డాక్టరు దగ్గర కూడా ఎంత బాధకలిగినా ఏడుపుదిగ మింగుకున్న టోటోచాన్‌కు రాకీ కన్పించకపోయే సరికి ఏడుపువచ్చేసింది. చెంపల మీదగా కన్నీరు కారిపోతున్నది.

"రాకీ! రాకీ! ఎక్కడి వెళ్ళావు? రా! రాకీ!" అంటూ ఏడుస్తూ పిలవ సాగింది. పిలవగా పిలవగా సోఫాల వెనకనక్కి వున్న రాకీ చిన్నగా బయటికివచ్చింది. టోటోచాన్ కళ్ళు ఆనందంతో వెలిగిపోయాయి. రాకీ పిల్లిలావచ్చి, కట్లమధ్యగా కన్పిస్తున్న టోటోచాన్ కుడి చెవును మృదువుగా నాకింది. రాకీ మెడచుట్టూ చేతులు వేసి దానిచెవుల వాసనచూసింది. తల్లిదండ్రులు దానిచెవులు కంపుకొడ్తాయంటారు. కాని టోటోచాన్‌కు ఆవాసన ఎంతో ఇష్టం.

ఇద్దరూ అలసి పోయారు. నిద్రతో కళ్లుమూసుకు పోతున్నాయి.

అవి ఎండాకాలపు చివరి రోజులు. చంద్రుడు తోట మీదగా, ముఖం నిండాకట్లతో వున్న ఆపసిదాని కేసీ, రాకీ కేసీ చూశాడు. ఆరోజు నుంచి వాళ్ళిద్దరి స్నేహం మరీ బలపడింది.

## ఆటల దినం

"టోమోకు, ప్రతి సంవత్సరం, నవంబరు మూడోతేదీ ఆటలదినం." వర్షాకాలంలో అతితక్కువ సార్లు వర్షం పడిన రోజు నవంబరు మూడుగా నమోదు చెయ్యడం జరిగింది. అందుకే హెడ్‌మాస్టరు ఆరోజును క్రీడోత్సవానికి ఎంచు కున్నాడు. ఏమైనా ఆరోజువర్షం వల్ల ఆటలు ఆగిపోకూడదని ఆయన ఆశయం. ఆరోజు నిజంగానే వర్షం పడేదికాదు. అందరికీ ఆశ్చర్యంగా వుండేది.

టోమోలో అన్ని విషయాల్లో లాగే, ఆటల్లో కూడా ఒక విశిష్టత వుంది. ఇతర స్కూళ్లల్లో ఆడే ఆటలు ఇక్కడ వుండవు. అన్నీ హెడ్‌మాస్టరు స్వయంగా కనిపెట్టిన ఆటలేవుంటాయి. కాని 'టగ్-ఆఫ్-వార్' అనే ఆట మాత్రం సాధారణంగా అన్ని స్కూళ్లల్లోవుండేదే, ఇక్కడ కూడా వుంటుంది. ఇక్కడ ఆడే ఆటలకు ప్రత్యేక ఏర్పాట్లుగానీ, సాధనాలు గానీ అవసరంలేదు.

చేపల పందాన్ని ఉదాహరణగా తీసుకోవచ్చు. గుడ్డరిబ్బన్లను పొడవాటిగొట్టాల్లా తయారు చేసి, వాటిని చేపల ఆకారంలోకి మార్చి రంగులు వేసేవాళ్ళు. అచ్చం బాలల దినోత్సవానికి ధృవ ప్రాంతం నుంచి తీసుకొచ్చే చేపల్లాగే ఉండేవి. ఆ చేపల్ని బడి ఆవరణ మధ్యలో పెట్టి, సూచన అందుకోగానే పిల్లల్ని వాటివైపు పరుగెత్త మనేవారు. అలా పరిగెత్తి ఆచేపలనోళ్లల్లో నుంచి దూరి తోక ద్వారం నుంచి బయటికి వచ్చి, మళ్ళీ, పరిగెత్తి, మొదటి చోటుకు చేరుకోవాలి. అక్కడ మూడు చేపలు మాత్రమే ఉండేవి. తడవకు ముగ్గురు మాత్రమే పందెంలో పాల్గొనే అవకాశం ఉంది. ఇది చూడడానికి చాలా తేలికైన ఆటలా వుండేది. కాని వాస్తవానికి ఈ ఆట ఆడడం కష్టమైన పనే! చేపలు చాలా పొడుగ్గా వుండేవి. లోపలంతా చీకటే. ఎటుపోతున్నామో తెలిసేదికాదు. కొందరు పిల్లలు చేపనోట్లో నుంచే తిరిగివచ్చే వాళ్లు. టోటోచాన్ కూడా మళ్ళీ చేపనోట్లో నుంచే వచ్చేది. తల బయటకు పెట్టగానే తాము చేసిన తప్పు తెలిసేది. మళ్ళీ లోపలకు వెళ్ళిపోయేవాళ్లు. ఈ ఆట చూడడానికి చాలా తమాషాగావుండేది. పిల్లలు ఆ చేపల పొట్టల్లో కదులుతూ వుంటే, అవికూడా ప్రాణంవున్న చేపల్లా కదిలేవి.

"అమ్మను వెతుక్కో" అనే చిత్రమైన ఆట వుండేది. సూచన ఇవ్వగానే అడ్డంగా నిల బెట్టిన నిచ్చెనకేసి పరిగెత్తాలి. ఆ నిచ్చెనలోనుంచి పిల్లిలా పాకి,

అవతలవైపువున్న బుట్టలో నుంచి ఒక కవరు తీసుకోవాలి. ఆకవరు తెరిస్తే అందులో ఒక కాగితం వుంటుంది. ఉదాహరణకు ఆకాగితం మీద. "సాకోచా న్‌వాళ్ళ అమ్మ" అనివుందనుకో, అక్కడ కూర్చుని వున్న ప్రేక్షకుల్లోనుంచి ఆమెను వెతికి పట్టుకొని గీత దగ్గరకురావాలి. నిచ్చెన మెట్లమధ్య నుంచి జాగ్రత్తగా దూరకపోతే, నడుం దగ్గర నిచ్చెన పట్టుకుంటుంది. అంతేకాదు పిల్లలందరికీ, అందరి అమ్మలూ తెలిసివుండాలి. కాని ఒక్కోసారి కాగితంలో "మిస్ ఒకు అక్కయ్య" "అనో మిస్టర్ ట్సుయెవాళ్ళ అమ్మ" అనో, లేక "శ్రీమతి కునినోరికొడుకు" అనో వుంటే, కనుక్కోవడం కొంచెం కష్టం అయేది. అలాంటప్పుడు వాళ్ళు ప్రేక్షకులముందుకెళ్ళి నిలబడి "మిస్ ఒకువాళ్ళ అక్కయ్య" అని పిలవాల్సి వచ్చేది. అలా పిలవడానికి జంకుగావుండేది. ఒక పిల్లకు వాళ్ళమ్మను కనిపెట్టమనే చీటీవస్తే ఎగిరిగంతేసినంతపని చేసేది ఆ పిల్ల. ఈ ఆటలు ప్రేక్షకులు కూడా జాగ్రత్తగా గమనించాల్సి వచ్చేది. మరి వాళ్ళ పేర్లు ఎవరు ఎప్పుడు పిలుస్తారో తెలియదుగా? పిలవగానే లేచి జనంలోనుంచి వెళ్ళి, ఆ పిల్లచెయ్యి పట్టుకొని పరుగుతియ్యాలి. అందువల్ల ఆడపిల్లగానీ, మగ పిల్లవాడుగానీ, వచ్చి ప్రేక్షకుల ముందు నిలబడగానే అందరూ కుతూహలంగా చూసేవారు. అక్కడ సోమరి తనంగా కూర్చుని కబుర్లు చెప్పుకోవడానికి వీలుండదు. ఆటల్లో పిల్లలు ఎంత ఉత్సాహంగ పాల్గొంటారో, పెద్దలూ అంత ఉత్సాహంగానూ పాల్గొనాల్సివుంటుంది.

టగ్-ఆఫ్-వార్ ఆటలో పిల్లలూ, టీచర్లూ అందరూ పాల్గొన్నారు. కేకలు పెడ్తూ తాడు లాగసాగారు. యాసువాకీ చాన్ వంటి అంగవైకల్యంగల పిల్లలు మాత్రం ఈ ఆట పాల్గొన లేకపోయేవారు. వాళ్ళ పని ఆటను శ్రద్ధగా చూసి ఎవరుగెలిచారో చెప్పడం.

చివరి రోజు జరిగే పందెంలో అందరూ పాల్గొంటారు. అది కూడా ఇతర స్కూళ్లకు భిన్నంగానే వుంటుంది.

ఎక్కువ దూరం పరిగెత్తక్కర్లేదు. అర్ధ చంద్రాకారంలో వుండే అసెంబ్లీహాలు మెట్లమీద పైకీ కిందకూ పరిగెత్తాలి. ఈ ఆట చూడడానికి చాలా తేలిగ్గా వున్నట్టే కల్పిస్తుంది. కాని ఈ మెట్లు కూడా అసాధారణంగానే వుంటాయి. ఒక దానికొకటిచాలా దగ్గరగా వుండి, ఎత్తుతక్కువగా వుంటాయి. అన్నిమెట్ల

మీద కాళ్లు మోపి పరిగెత్తాల్సిందే. పొడవుగావున్న వాళ్లకు, పెద్దపాదాలు వున్న వాళ్లకూ ఆమెట్లు ఎక్కడం కష్టమే. రోజూ ఎక్కి దిగే ఆమెట్లే ఆటల రోజు ఉత్సాహం కలిగించేవి. పిల్లలందరూ కేరింతలు కొడ్తూ ఆమెట్లు ఎక్కుతూ దిగుతూ వుంటే, దూరం నుంచి చూసేవాళ్లకు అది కలైడోస్కోపులోని దృశ్యంలా కన్పిస్తుంది. పై మెట్టుతో కలిసి అక్కడ మొత్తం ఎనిమిది మెట్లుంటాయి.

టోటో చాన్‌కు ఆబడితో అదిమొట్ట మొదటి ఆటలరోజు. ఆ క్లాసు పిల్లలందరికీ మొదటి ఆటలరోజే, హెడ్‌మాస్టరు ఆశించినట్టే పిల్లలందరూ చాలా సర్దాపడ్డారు ఆటకు. పిల్లలు క్రితంరోజు తయారు చేసిన కాగితపుగొలుసులూ, బంగారు నక్షత్రాలు, ఉత్తేజాన్ని కలిగించే కవాతు మ్యూజిక్, అన్నీకలసి అక్కడ ఏదో ఉత్సవం జరుగుతున్నట్టుగా అనిపించే వాతావరణం సృష్టించాయి.

టోటో చాన్ ముదురు రంగునీలం నిక్కరూ, తెల్లటి జాకెట్టూ వేసుకుంది. ఆ మాటకొస్తే ఆ పిల్లకు వ్యాయామ దుస్తులంటేనే ఇష్టం. ఒకరోజు బడి అయిపోయాక, కొందరు కిండర్‌గార్డెన్ టీచర్లకు, హెడ్‌మాస్టరు యురిథమిక్స్ పాఠాలు నేర్పుతున్నాడు. ఆ సమయంలో ఆ టీచర్లు వ్యాయామం దుస్తులు వేసుకున్నారు. ఆదుస్తుల్లో వాళ్లు కదం తొక్కుతూవుంటే వాళ్ల తొడల కింది భాగాలు తమాషాగా కదులు తున్నాయి. టోటోచాన్‌కు ఆదృశ్యం ఇష్టంగా అన్పించింది. అందుకే అలాంటి దుస్తులంటే ఆ పిల్లకు అంత ఇష్టం. ఆరోజు ఇంటికి వెళ్ళగానే, నిక్కరు తీసేసి కదం తొక్కసాగింది. కాని అపసిదాని తొడలు కదలలేదు. చాలా సేపు ప్రయత్నించింది ఊ!హూ! కదలందే! అలాంటిదుస్తులు అయితేనే తొడలు కదలుతాయని అన్పించింది. అవి వ్యాయామ దుస్తులని తల్లి నుంచి తెలుసుకుంది. ఆటలరోజు అవే వేసుకోవాలని నిర్ణయించుకుంది. కాని తీరా ఆరోజు, తనకు సరిపడే దుస్తులు దొరకలేదు. అందుకే నిక్కరుతో సరిపెట్టుకోకతప్పలేదు.

ఆరోజు ఒక విచిత్రం జరిగింది. అందరికంటే పొట్టిపొట్టి కాళ్ళూ, చేతులూ వున్న టాకాహాషీ అన్ని ఆటల్లోనూ గెలిచాడు. ప్రథమ బహుమతులన్నీ అతనికే దక్కాయి. అది అందరికీ అమిత ఆశ్చర్యాన్ని కలిగించింది. చేప పొట్టలోని చీకట్లో పిల్లలందరూ తడుముకుంటూవుండగా, టాకాహాషీ చిటుక్కున బయటికి

వచ్చాడు. మిగిలిన వాళ్ళంతా నిచ్చెనలోకి తలలు దూరుస్తూ వుండగానే, ఆ పిల్లాడు నిచ్చెనలో నుంచి రెండో వైపుకు దూరాడు. ఇక మెట్లెక్కడంలో, అందరూ గజిబిజిగా ఎక్కుతూ వుండగానే టాకాహాషీ ఎక్కడం, దిగడం కూడా అయిపోయింది. ఆ బుజ్జి బుజ్జి పాదాలు పస్తన్స్‌లాగ కదులుతూ వుంటే, సినిమాలో రీలు తిరుగుతున్నట్టుగావుంది.

"మనం టాకాహాషీని ఓడించాలి," పిల్లలంతా అనుకున్నారు.

పిల్లలందరూ పట్టుదలగా ఆడారు. వాళ్లెంత ప్రయత్నంచేసినా విజయం టాకాహాషికే దక్కింది. టోటో చాన్ కూడా అతడ్ని ఓడించాలని ప్రయత్నించింది. మామూలుగా భూమి మీద పరిగెత్తే పందెంలో మాత్రమే వాళ్లు అతడ్ని ఓడించగలిగారు.

టాకాహాషి బహుమతులు అందుకోవడానికి వేదిక ఎక్కాడు అతడికి ఆనందంగావుంది. గర్వంగా కూడా వుంది. ప్రతిసారీ ప్రథమ బహుమతి తీసుకోవడానికి వేదికమీదకు వెళ్తున్న అతడ్ని చూసి అందరూ అసూయ పడ్డారు.

ఒకరితో ఒకరు "వచ్చే సంవత్సరం చూస్తూవుండువాడ్ని ఓడిస్తాను" అంటున్నారు. కాని ప్రతి సంవత్సరం ఎక్కువ బహుమతులు అతడికే వచ్చేవి.

అక్కడ ఇచ్చే బహుమతులు కూడా విచిత్రంగానే వుండేవి. మొదటి బహుమతి ఒక పెద్ద ముల్లంగి దుంప, రెండో బహుమతి బీట్‌రూట్, మూడో బహుమతి ఒక ఆకుకూర కట్ట. దాదాపు బహుమతులన్నీ ఇలాగేవుంటాయి. టోటోచాన్ అన్ని స్కూళ్లల్లో బహుమతులు కూరగాయలే ఇస్తారను కొనేది ఆ వయసులో.

ఇతర స్కూళ్లల్లో బహుమతులుగా, నోటుబుక్కులూ, పెన్సిళ్లూ, రబ్బరూ మొదలైనవి ఇచ్చేవారు. కాని టోమో పిల్లలకు ఆసంగతి తెలియదు. అయినా వాళ్లకు ఈ కూరగాయల బహుమతులు బొత్తిగా నచ్చేవి కావు. ఒకరోజు టోటోచాన్‌కు బీట్‌రూట్‌లూ, ఉల్లిపాయలూ బహుమతిగా వచ్చాయి. అవిరైల్లో పట్టు కెళ్ళాలంటే చచ్చేంత సిగ్గేసింది. తీరా చూస్తే ఆరోజు పిల్లలందరికీ ఏదో ఒక కూరగాయ బహుమతి వచ్చింది. అప్పుడను కుంది "సిగ్గెందుకు? అమ్మ తెమ్మంటే తీసుకెళ్ళనూ" అని ఏది ఏమైనా బడి నుంచి ఇంటికి

కూరగాయలు తీసు కెళ్ళాలంటే వాళ్ళందరికీ కొంచెం ఇబ్బంది గానే అన్పించింది.

క్యాబేజ్ గెల్చుకున్న లావుపాటి కుర్రాడికి దాన్ని ఏం చెయ్యాలో తెలియలేదు.

"ఛ! దీన్ని మోసుకెళ్ళాలంటే నాకెలాగో వుంది. ఎక్కడైనా పారేసిపోతాను," అన్నాడు.

పిల్లలందరూ తమలో తాము సణుక్కోవడం మొదలు పెట్టారు.

హెడ్‌మాస్టరు అది గమనించాడు, వాళ్ళ దగ్గరకు వచ్చి "ఏమిటి విషయం?" అన్నాడు. ఎవరూ సమాధానం ఇవ్వలేదు, మళ్ళీ ఆయనే అన్నాడు- "చూడండి పిల్లలూ! ఇవి మీరు స్వయాన సంపాదించు కున్నవి. ఇంటికి వెళ్ళి ఈ రాత్రి భోజనంలోకి ఇవేవండమని మీ అమ్మలకు చెప్పండి. ఇవ్వాళ మీరు కష్టపడి, మీ ఇంటికి ఇవి సంపాదించారు. ఇది మంచిపని కదూ? ఈ కూరలు చాలా బాగుంటాయి. పందెం!"

ఆయన చెప్పింది నిజమే అనిపించింది. టోటోచాన్‌కు ఆరోజు కూరచాలా రుచిగా ఉన్నట్టనిపించింది. ఎందు కంటే మొదటిసారిగా తనంతటతను సంపాదించిన కూర అది.

"నేనే అమ్మతో చెప్పి బీట్‌రూట్ కూరచేయించు కుంటాను. కాని ఈ ఉల్లి పాయలతో ఏం చేయించాలో తెలియడంలేదు." అంది టోటోచాన్ హెడ్‌మాస్టరుతో. అక్కడున్న పిల్లలందరూ ఉత్సాహంగా తమ తమ కూరల్ని గురించి చెప్పసాగారు.

"అమ్మయ్య! ఇప్పటికి మీరు అర్థం చేసుకున్నారు." అంటూహాయిగా నవ్వేడు హెడ్‌మాస్టరు. పిల్లలు ఇళ్ల దగ్గర తాము తెచ్చిన కూరలు వండించుకొని, కుటుంబసభ్యులతో ముచ్చట్లాడుతూ భోజనాలు చేస్తున్నట్లు ఊహించు కున్నాడు.

ముఖ్యంగా ఆయన టాకాహాషి గురించి ఆలోచిస్తున్నాడు. ఆ కుర్రాడి బల్లనిండా ప్రథమ బహుమతి కూరగాయలే వుంటాయి. తన పొట్టితనాన్ని గురించీ, ఆపైన ఇక పెరగననే బెంగనుంచీ, ఆత్మన్యూనతా భావంనుంచీ, బయట పడి తన బహుమతులను చూసుకుంటూ గర్వంగా, ఆనందంగా వుంటాడు. ఏమో ఎవరికి తెలుసు? ఆకుర్రాణ్ణి దృష్టిలో పెట్టుకొనే ఆయన

ఆ చిత్రమైన ఆటల్ని కనిపెట్టాడేమో?

## కవి ఇస్సా

హెడ్‌మాస్టర్ని "ఇస్సా కొబయాషి" అని పిలవడం పిల్లలకు ఇష్టం. ఆయన మీద వాళ్లు పాటలు కూడా కట్టారు. అందులో ఒకటి:

ఇస్సా కొబయాషి,
ఇస్సా మా పెద్దమనిషి
ఇస్సా బట్టతలతో!

కారణం ఏమిటంటే హెడ్‌మాస్టరు ఇంటి పేరు "కొబయాషి" 19 వ శతాబ్దపు ప్రఖ్యాత కవి ఇస్సా ఇంటిపేరు కూడా కొబయాషి-ఇస్సా కొబయాషి. ఆయనకు ఇస్సా కొబయాషి కవిత్వం అంటే ఇష్టం. పిల్లలకు అతనిని గురించి చెప్పేవాడు. అందువల్ల పిల్లలకు ఇస్సా కొబాయాషి చాలా సన్నిహితుడిగా అన్పించేది. వాళ్ళు హెడ్‌మాస్టరు తమను "ఇస్సా కొబయాషి" అని పిల్చుకొనే వాళ్లు.

ఇస్సా కొబాయాషి కవిత్వం మానవ జీవితానికి దగ్గరగా వుండేది. అందుకే ఆయన కవిత్వం అంటే హెడ్‌మాస్టరుకు అంత ఇష్టం. వేల మంది కవుల్లో ఆయన తనదైన ఒక ప్రత్యేక స్థానాన్ని సంపాదించుకున్నాడు. సరళంగా వుండే ఆ కవిత్వం అంటే హెడ్‌మాస్టరుకి చాలా ఇష్టం. అందుకే సమయం దొరికి నప్పుడల్లా ఇస్సా కవిత్వం విన్పించేవాడు. పిల్లల్ని ఆ కవిత్వం కంఠతా పట్టమనేవాడు. అందులో ఒకటి-

సన్న కప్పా! సన్న కప్పా!
లొంగి పోకు.
ఇస్సా వున్నాడు నీ పక్కన
రెక్క లొచ్చిన పిచ్చుకా!
దారి ఇవ్వు! దారి ఇవ్వు!
మంచి గుర్రానికి దారి ఇవ్వు!
ఈగను వదిలెయ్







కాళ్లూ-చేతులు కొట్టుకుంటూ
అడుగుతుంది నిన్ను
కనికరించ మని.

హెడ్‌మాస్టరుతో పాటు పిల్లలంతో ఈ పాటలు పాడేవారు. తరుచుగా ఈ గీతాలను ఆలపించేవాడు హెడ్‌మాస్టరు. కాని ఇవి పిల్లలు చదవాల్సిన పాఠాల్లోని అంశాలుకావు.

టోటో చాన్ కూడా ఒక గీతం అల్లడానికి ప్రయత్నించింది. బొమ్మల పుస్తకంలోని కథలూ దారితప్పిన నల్ల కుక్కమీద గీతం అల్లింది. ఆనల్లకుక్క సైన్యంలో చేరి, క్రమంగా పెద్ద పదవుల్లోకి వెళుతుంది. అయితే ఈ ఎదుగుదలలో ఒడిదుడుకులు లేకపోలేదు. ఈ బొమ్మల కథ, విశేషంగా ప్రచారంలో వున్న ఒక పిల్లల పత్రికలోపడింది.

కుహోంబుట్సు ఆలయానికి నడిచివెళుతున్నప్పుడు కానీ, బైటవర్షం పడుతుంటే పిల్లలంతా అసెంబ్లీహాలులో చేరివున్నప్పుడుగానీ, హెడ్‌మాస్టరు వారికి ఇస్సా కవితల్ని చదివి వినిపించేవాడు. జీవితం గురించీ ప్రకృతి గురించీ, కూడా కవిత్వం ద్వారానే చేప్పేవాడు.

ఇస్సారాసిన కొన్నిగీతాలు వింటుంటే. అవి టోమోకోసమే రాశాడా అన్పించేది-

మంచు కరిగిపోతున్నది
అకస్మాత్తుగా పిల్లలతో
గ్రామం నిండిపోతున్నది.

## ఒక రహస్యం

ఆరోజు, మొదటిసారిగా, టోటోచాన్‌కి డబ్బు దొరికింది. బడినుంచి ఇంటికి వెళ్ళేప్పుడు రైల్లో దొరికింది. మిడోరిగేకా అనే స్టేషనుకు చేరబోయే ముందు ఆ రైలు పెద్దగా చప్పుడు చేస్తూ ఒకపక్కకు ఒరిగినడుస్తుంది.

టోటోచాన్ సాధారణంగా రైలు వెనక భాగంలోని కుడిచేతి వైపు తలుపు దగ్గర నిలబడుతుంది. కారణం తను దిగే స్టేషన్‌లో ఫ్లాట్‌ఫారం కుడివైపున వుంటుంది.

ఆరోజు కూడా, ఎప్పటిలాగే, రైలు శబ్దం చేస్తూ పక్కకు వరిగి నడుస్తోంది, టోటో చాన్‌కు డబ్బుతన ముందు పడినట్టుగా అన్పించింది. అంతకు ముందు కూడా ఒక సారి ఇలాగే జరిగింది. తీరా చూస్తే అది గుండీ. ఈ సారి జాగ్రత్తగా చూసి తీసుకోవాలనుకుంది. బండి మళ్లీ మామూలుగా అయిన డుస్తోంది. టోటోచాన్ పడిన వస్తువు కేసి దీక్షగా చూసింది. అది డబ్బే! ఐదు సెన్లకాయిన్. రైలు వొరిగి నప్పుడు ఎవరో పారేసు కొని వుంటారని తలతిప్పి చూసింది. కాని దగ్గర్లో ఎవరూ లేదు.

ఇప్పుడేం చెయ్యాలి? డబ్బు దొరికితే పోలీసుల కివ్వాలని అంటారు? మరి రైల్లో పోలీసులు లేరుగా? ఉన్నారేమో?

అదే సమయంలో, కండక్టర్ తలుపు తెరచుకొని వచ్చాడు. అతడ్ని చూడగానే టోటో చాన్ కుడి పాదం ఆ నాణెంమీద పెట్టింది. టోటోచాన్‌ను అతను నిత్యం చూస్తూనే వుంటాడు రోజూలాగే చిరునవ్వు నవ్వాడు. టోటోచాన్ బదులుగా నవ్వలేదు. నాణెంమీద కాలుపెట్టి దాచడం తప్పుగా అన్పించింది. అందుకే నవ్వలేకపోయింది. అప్పుడే రైలు యూకాయామాలో ఆగింది. వచ్చే స్టేషన్‌లో నే టోటోచాన్ దిగాలి. రైల్లోకి అనుకోకుండా చాలా మంది ఎక్కారు. టోటోచాన్‌ను నెట్టారు. పక్కకు జరగమన్నారు. ఆ పిల్ల మాత్రం తన పాదాన్ని నాణెం మీద నుంచి తియ్యదల్చుకోలేదు. అక్కడే నిలబడిపోయింది. "స్టేషన్‌లో దిగేప్పుడుదాన్ని తీసేసుకోవాలి. దిగగానే స్టేషన్‌లో కన్పించిన పోలీసుకు ఇచ్చెయ్యాలి" అని అనుకుంది. మరో ఆలోచన వచ్చింది. అలా తీస్తున్నప్పుడు ఎవరైనా చూసి తనను దొంగ అనుకోరూ! ఆరోజుల్లో ఐదు సెన్‌నాణెం అంటే తక్కువేమీ కాదు. దాంతో పిల్లలయితే

చిన్న పిప్పరమెంట్ల పొట్లంకొనుక్కోవచ్చు. లేకపోతే చాక్‌లెట్ చాకో బారు కొనుక్కో వచ్చు. పెద్దవాళ్ళ దృష్టిలో ఆ నాణెం, చిన్నదే కావచ్చు కాని పిల్లలకు అది ఎక్కువడబ్బే! టోటోచాన్‌కు ఒక ఉపాయం తట్టింది.

"అయ్యో నా డబ్బుపోయింది. అంటూ వెదికినట్టే వెదికి దాన్ని తీసేసుకుంటా" అని అనుకుంది.

వెంటనే మరో సందేహంవచ్చింది. "నేను ఆమాట అనగానే అందరూ నావైపుచూస్తారు. అప్పుడే ఎవరో వచ్చి అది నాడబ్బు అంటే?"

అలా లాభం లేదని నిర్ధయించుకుంది. స్టేషన్ దగ్గర పడుతుండగా కూర్చుని బూటు లేసు ముడివేసుకుంటున్నట్లు నటిస్తే? అవును! అదే మంచిపని! టోటోచాన్ స్టేషన్‌లో దిగేసరికి వళ్లంతా చెమట్లు పట్టాయి. చాలా అలసిపోయి నట్టుగా అయింది. చేతిలో ఐదు పైసల నాణెం. ఇప్పుడేం చెయ్యాలి? పోలీసు స్టేషను చాలా దూరం. అక్కడి కెళితే ఆలస్యం అయిపోతుంది. అమ్మ గాభరాపడి పోతుంది.

"నేను దీన్ని రహస్యంగా దాచిపెడ్తాను. రేవు స్కూలుకు తీసుకువెళ్ళి అందరికీ చూపించి, వాళ్ళ సలహాకూడా అడుగుతాను. స్కూల్లో ఎవరికీ ఇంతవరకు డబ్బులు దొరకలేదు."

దీన్ని ఎక్కడ దాచాలి? ఇంటికి తీసు కెళితే అమ్మ అడుగుతుంది. ఎక్కడిదని! దీన్ని ఇంకెక్కడైనా దాచెయ్యాలి.

స్టేషన్ దగ్గర్లో వున్న చెట్ల గుబురు దగ్గరకు వెళ్ళింది. అక్కడ ఆమెను ఎవరూ గమనించ లేదు. అక్కడ డబ్బు సురక్షితంగ వుంటుంది, అనుకుంది. వెంటనే గుబురుల మధ్యలో, చిన్న కర్రవుల్ల తీసుకొని నేలమీద గుంట తవ్వింది. ఆ గుంటలో నాణెంవేసింది. మట్టి పోసింది. ఒకరాయి తెచ్చి ఆగుంట మీద పెట్టింది. ఇంటికేసి పరుగు తీసింది.

రోజూ టోటోచాన్ రాత్రుళ్లు "ఇక కబుర్లుచాలు పడుకోరా!" అని తల్లి అనేంత వరకు ఏదో ఒకటి బడిగురించి మాట్లాడుతూనే వుండేది కాని ఆరోజు త్వరగా మంచం ఎక్కింది.

రెండోరోజు నిద్రమెలకువరాగానే, టోటోచాన్‌కు తన రహస్య నిధి గుర్తొచ్చింది. ఆరోజు స్కూలుకు త్వరగా బయలు దేరింది. రాకీని తీసుకొని

అ చెట్టు దగ్గర కెళ్ళింది. కొంచెం సేపు హడావిడిగా వెదికింది.

"అమ్మయ్య! ఇదుగో! ఇక్కడే!" రాయిపెట్టింది పెట్టినట్టేవుంది.

"ఏయ్ రాకీ! చూడు! నీకు తమాషా చూపిస్తాను." అంటూ రాయితీసింది. మట్టి లాగింది. కాని చిత్రంగా నాణెం మాయం అయింది. ఎంత వెదికినా కన్పించలేదు. ఆ నాణాన్ని బళ్లో పిల్లలకు చూపించలేక పోయినందుకు బోలెడంత బాధపడి పోయింది.

ఆ తర్వాత ఎన్నోసార్లు టోటోచాన్ ఆగుబుర్లలోకి వెళ్ళి నాణెం కోసం మట్టి కెలికి కెలికి వెతికేది. కాని ఆ నాణెం కన్పించలేదు.

"చిట్టెలుక తీసుకు వెళ్ళిందేమో?"

"అసలు నిజంగా తనకు నాణెందొరికిందా? కల కన్నాదా?"

"నేను దాచిపెడ్తున్నప్పుడు దేముడు చూశాడో ఏమో!" రకరకాలుగా అనుకుంటూ ఉండేది అటుగా వచ్చినపుడల్లా. టోటోచాన్‌కు ఎప్పటికీ మరువురాని చిత్రమైన రహస్యం అది.

## చేతులతో మాట్లాడడం

ఒకరోజు మధ్యాహ్నం టోటోచాన్ రైలు స్టేషన్‌లో టికెట్లు తీసుకొనే గేటు దగ్గర ముగ్గురు పిల్లల్ని చూసింది. ఇద్దరు మగపిల్లలు-ఒక ఆడపిల్ల. వాళ్లు ఆమెకంటే కొద్దిగా పెద్దవాళ్లు. "రాయి-కాగితం-కత్తెర" ఆట ఆడుతున్నట్టుగా వుంది వాళ్లు నిలబడివున్న తీరు చూస్తుంటే. కాని వాళ్లు మామూలుగా కంటే ఎక్కువగా చేతులతో సైగలు చేసుకోవడాన్ని గమనించింది. వాళ్లను గమనించడం సరదాగా అన్పించింది. వాళ్ళకు దగ్గరగా వెళ్ళింది. బొత్తిగా చప్పుడు లేకుండా వాళ్లు మాట్లాడు కుంటున్నారు. వాళ్ళుచేతులతోనే సైగలు చేస్తూ మాట్లాడు కుంటున్నారు. నవ్వు కుంటున్నారు. వాళ్లు చాలా ఉత్సాహంగా కన్పిస్తున్నారు.

"అబ్బ! నేను కూడ అట్టా మాట్లాడ గలిగితే ఎంత బాగుంటుందో!" అనుకుంది. వాళ్లను చూస్తుంటే అసూయ కలిగింది. వాళ్ళ దగ్గరకు వెళ్ళాలనీ, వాళ్ళతో ఆడుకోవాలనీ అన్పించింది. కాని చేతులతో మాట్లాడడం తనకు

రాదుగా? అనుకుంది. పైగా వాళ్లు టోమో విద్యార్థులు కారాయె! వేరే రైలెక్కి వాళ్ళు వెళ్ళిపోయారు.

"నేను కూడా చేతులతో మాట్లాడం నేర్చుకుంటా." అనుకుంది. టోటోచాన్‌కు అంతవరకు చెవిటి-మూగ వాళ్ళ గురించి తెలియదు.

ఒకరి చేతులవేసి ఒకరు మిలమిలలాడే కళ్లతో చూసుకోవడం టోటోచాన్‌కు చాలా సంతోషాన్ని కలిగించింది. ఎప్పటికైనా వాళ్ళతో నేస్తం కట్టాలని నిర్ణయించుకుంది.

## నలభై ఏడుమంది

కొబయాషి బోధనా పద్ధతి చాలా చిత్రమైనది. ఆయన ఎక్కువగా యూరప్, ఇతరదేశాల పద్ధతులతో ప్రభావితుడైనాడు. యురిథిమ్స్ పాఠాలు, మధ్యాహ్న భోజన అలవాట్లు, బడిలో షికార్లు, రోరోరో యువర్‌బోట్ మొదలైన వన్నీ ఆ ప్రభావం వల్ల వచ్చినవే.

మరుయామా అనే ఒకాయన హెడ్‌మాస్టరుకు కుడి భుజంలా వుండేవాడు. మామూలు స్కూళ్లల్లో అయితే ఆయనలాంటి వాళ్ళను "వైస్ ప్రిన్సిపాల్" అంటారు. 'మరుయామా' అంటే గుండ్రటి కొండ అని అర్థం. ఆయన తలకూడా గుండ్రంగా వుండేది. కాని వెనకవైపున చెవులవరకు కొద్దిగా తెల్ల వెంట్రుకలుండేవి. నున్నగా వుండేచెంపలు. ఆయన హెడ్‌మాస్టరు కంటే భిన్నంగా, కన్పించేవాడు అన్ని విషయాల్లోను.

అది డిసెంబరు 14 ఉదయం. పిల్లలందరూ బడికి రాగానే ఒక ప్రకటన చేశాడు.

"పిల్లలూ! వినండి! రెండున్నర శతాబ్దాలకు ముందు నలభై ఏడుగురు రొనిన్లు తమ ప్రతీకారాన్ని తీర్చుకున్న రోజు ఇది. అతి ముఖ్యమైనరోజు. ఇప్పుడు మనం సెంగాకుజి గుడి దగ్గరకు వెళ్దాం. అక్కడున్న వారి సమాధులకు శ్రద్ధాంజలి ఘటిద్దాం. మీ పెద్ద వాళ్లకు కబురు చేశాం," అన్నాడు మరుయామా.

మరుయామా అభిప్రాయాన్ని హెడ్‌మాస్టరు వ్యతిరేకించలేదు. కనుక ఆయన తన అంగీకారాన్ని వెల్లడించినట్టే.

మరుయామా, బయలు దేరేముందు ఆనలభైఏడుగురు గురించి పిల్లలకు

వివరంగా చెప్పాడు. వాళ్ళందరూ రెండేళ్ల పాటు పథకాలు వేసుకొని, తమ ప్రభువును చంపినవారిమీద ఎలా పగతీర్చు కున్నారో చెప్పాడు. పిల్లలకు ఆయన చెప్పిన విషయాలేను పెద్దగా అర్థం కాలేదు. కాని క్లాసులు ఎగగొట్టి బయటికి వెళ్ళి పోతున్నందుకు మహా సంబర పడిపోయారు. మధ్యాహ్నపు భోజనం వనభోజనంగా మారబోతున్నందుకు సంతోషించారు.

పిల్లలందరూ మరుయామాను అనుసరించారు. అలానడుస్తున్న పిల్లల బారుల్లోనుంచి "రిహెయి అనుయోయా అనబడే నేను ఒకమనిషి" అనే మాటలు వినిపిస్తున్నాయి. రిహెయి అనుయోయా ఒక వ్యాపారి. అతడే



ఆయుధాలను సప్లయి చేశాడు. ప్రభుత్వం పట్టుకొని నిజం చెప్పమని చిత్రహింస పెట్టినా అతను రహస్యం బయట పెట్టలేదు. పదే పదే పైమాట అన్నాడు. ఆమాటనే పిల్లలు వల్లిస్తున్నారు నడుస్తూ. అలావాళ్లు అరుస్తూ వెళ్తూ వుంటే దారిన పోయేవాళ్లు చూసి నవ్వు కుంటూ వెళ్ళిపోతున్నారు. అది పదిమైళ్ల దూరం. వాహనాలు లేవు. డిసెంబరు నెల ఆకాశం నిర్మలంగా వుంది. చిన్నారులు కేరింతలుకొడ్తూ నడుస్తున్నారు.

సెంగాకుజికి చేరారు. మరుయామా పిల్లలందరికీ అగర్‌బత్తీలూ, పూలూ ఇచ్చాడు. అక్కడ వరసగా చాలాసమాధులు ఉన్నాయి. ఇక్కడ నలభై ఏడు మంది రొనిన్లు సమాధులైనారని తెలుసు కున్న టోటోచాన్ గంభీరంగా వుంది. నిశ్శబ్దంగాతల వంచి గౌరవ సూచకంగా నిలబడింది. అందరూ అలాగే చేశారు. టోమో పిల్లలు అంత నిశ్శబ్దంగా వుండడం అరుదైన విషయం. సమాధులమీద ఉంచిన ఊదుబత్తీల పొగ ఎగసి చాలాచాలా సేపు గాలిలో చిత్రాలు గీచింది.

ఆ తర్వాత, చాలాకాలం, ఎక్కడ ఊదుబత్తీల వాసనవచ్చిన మరుయామా, రొనిన్లూ గుర్తొచ్చేవారా పిల్లలకు.

మరుయామా కళ్ళజోడుకున్న దళసరి అద్దాలనుంచి కన్పించే ఆ చిన్న చిన్న కళ్ళంటే టోటోచాన్‌కు ఇష్టం. సన్నగా, మృదువుగా విన్పించే ఆయన కంఠ స్వరం అన్నా ఇష్టమే. అయితే అంతలావు మనిషికి, అంత మృదువైన స్వరం ఏమిటని అనిపించేది.

## "మాసౌచాన్!"

స్టేషన్‌నుంచి వెళ్ళేదారిలో టోటో చాన్ ఒక ఇంటి మీదగా వెళ్ళేది. అందులో కొరియన్లు ఉండేవారు. వాళ్లు కొరియన్లు అని అప్పుడు ఆ పిల్లకు తెలియదు. ఆవిడకు తెలిసింది అక్కడ వుండే ఒక స్త్రీమాత్రమే. ఆమె జుట్టును రెండు పాయలుగా విడదీసి, వెనక కలిపి ముడి వేసుకొనేది. ఆవిడ కొంచెం లావుగావుండేది. ముందు పొడుచుకు వచ్చినట్టుండి. చిన్న పడవల్లా కన్పించే తెల్లటిరబ్బరు. జోళ్లు వేసుకొనేది. పొట్టి జాకెట్ వేసుకొని, పొడవాటిలంగా వేసుకొనేది. లంగాబొందులు జాకెట్ ముందు భాగానికి కట్టేది. ఆమె ఎప్పుడూ

"మాసొచాన్" అని పెద్దగా పిలుస్తూ వుండేది. ఆ పిలుపు మామూలుగా వుండేదికాదు. ఆ పిలుపులో ఏదో విషాదం ధ్వనించేది.

ఆ ఇల్లు ఒయిమాచి రైలు పట్టాల పక్కగా వున్న కట్టమీద వుండేది. టోటోచాన్‌కు మాసొచాన్ ఎవరో తెలుసు. ఆ అబ్బాయి ఆ అమ్మాయికంటే కొంచెంపెద్దవాడు. బహుశా రెండో క్లాసు చదువుతూ వుండివుంటాడు. కాని ఏబళ్లో చదువుతున్నాడో టోటోచాన్‌కు తెలియదు. ఆ అబ్బాయి చింపిరి జుట్టుతో, ఒక కుక్కను వెంట బెట్టుకొని తిరుగుతూవుండేవాడు. ఒకరోజు టోటోచాన్ ఇంటికి వెళ్తున్నప్పుడు ఆ అబ్బాయి కన్పించాడు. రైలు కట్టమీద కాళ్లు దూరంగా పెట్టి రెండు, చేతులూ నడుంమీద పెట్టుకొని, నిటారుగా నిల్చుని వున్నాడు.

ఆకుర్రాడు టోటోచాన్ వైపు చూస్తూ "కొరియన్" అని అరిచాడు.

అగొంతులో కోపం, కసి ఉన్నాయి. ఆగొంతువిని ఆ పిల్లకు భయం వేసింది. అబ్బాయిని తను ఏమీ అనలేదు. అసలు ఎప్పుడూ మాట్లాడ లేదు. మరి తన మీద ఎందుకంత కోపం. అయోమయంలో పడింది.

"అమ్మా! అమ్మా! మరే! మాసొచాన్ నన్ను కొరియన్ అంటూ పిలిచాడమ్మా," ఇంటికి వస్తూనే తల్లితో చెప్పింది. తల్లి టోటో నోటిని చేత్తో మూసేసింది. తల్లి కళ్ళల్లో కన్నీళ్లు. ఆ పిల్లకు అంతా అయోమయంగా ఉంది. "పిచ్చితండ్రి! వాడ్ని ఎంతమంది ఎన్ని సార్లు" "కొరియన్" అని వెక్కిరించారో? వాడికి ఆమాటకు అర్థం తెలియదు. అదొకతిట్టు అనుకుంటున్నాడు. అది 'చాకా' (మూర్ఖుడా) అనేతిట్టు లాంటిదే నని అనుకొని వుంటాడు. "పసి వాళ్ళతో కూడా ఎందుకింత క్రూరంగా ప్రవర్తిస్తారో?"

తల్లి ఆగి కళ్ళుతుడుచు కుంది. మళ్ళీ ప్రారంభించింది- "మనం- అంటే నువ్వూ నేనూ జపాన్ వాళ్ళం. ఆకుర్రాడు కొరియా దేశం నుంచి వచ్చాడు. వాడూ నీలా పసివాడేగా? అందుకే తల్లీ మనుషులంతా ఒకటే అనుకో. ఈ మనిషి జపాన్‌వాడు, ఆమనిషి కొరియావాడు అని ఎప్పుడూ బేధంగా చూడొద్దు. మాసొచాన్‌తో స్నేహంగావుండు. కొరియన్లు బాగుండరని కొందరు అనుకుంటారు. అలా అనుకోవడం తప్పుతల్లీ!"

ఇంత గంభీరమైన విషయాన్ని తెలుసుకొనే వయసుకాదు టోటోచాన్‌ది.

ఒకటి మాత్రం అర్థం అయింది. ఆ పిల్లవాడూ తనలాంటివాడే. అయినా అందరూ ఆ అబ్బాయి గురించి చెడ్డగా మాట్లాడతారు. అందుకే అమ్మ వాడ్ని తలుచుకొని బాధపడుతూ వుంటుంది. ఆ పిల్ల ఒక నిర్ణయానికి వచ్చింది. ఈ సారి ఆ కుర్రాడు తనను కొరియన్ అని పిలిస్తే తప్పక జవాబు ఇస్తుంది. మనందరం ఒకటేనని చెబుతుంది.

మాసౌచాన్ తల్లి ముఖంలో ఎప్పుడూ చిరాకూ, కోపం కన్పించేవి. ఆమెగొంతు చిత్రంగా వుండేది. గాలిలో చాలాసేపు వేలాడుతున్నట్టుగావుండేది. అంతలో ఏర్రైలో వచ్చి ఆ స్వరాన్ని మింగేసేది.

"మాసౌచాన్!"

ఆ విషాదం నిండిన పిలుపు, ఆర్ధ్రతతోకూడిన అ స్వరం ఒకసారి విన్న వాళ్ళు ఎప్పటికీ మర్చిపోలేరు.

## తేలు కొండీ జడలు

టోటోచాన్‌కు రెండు కోరికలుండేవి. ఒకటి వ్యాయామం చేసే వాళ్ళు వేసుకొనే దుస్తులు లాంటి దుస్తులు వేసుకోవాలనీ, జుట్టును రెండు పాయలుగా తీసి జడలు వేసుకొవాలని. ఒక పెద్దమ్మాయి రెండు పెద్ద పెద్ద జడలు వేసుకొని రైల్లో ప్రయాణం చేస్తుంటే చూసింది. ఆమె తరగతిలో పిల్లలంతా జుట్టు కత్తిరించు కొనేవాళ్ళు. ముంగురులు నుదురు మీదకు వుంటాయి. టోటోచాన్ జుట్టు పొడుగ్గా వుండేది. రెండు పాయలుగా తీసి రిబ్బన్లు కట్టు కొనేది. తల్లికి అలా వుండడమే ఇష్టం.

ఒకరోజు తల్లి కూతురి కోరికను తీర్చింది. రెండు జడలు అల్లి చివర్లో రిబ్బన్లు కట్టింది. టోటోచాన్-అద్దంలో జడలు చూసుకుంది. అవి తను రెల్లో చూసిన పెద్ద పిల్లల జడల్లాలేవు. పొట్టిగా, సన్నగా, పిలకల్లా వున్నాయి. అయినా ఆ పిల్లకు అవి చూస్తూవుంటేకాస్త గర్వంగా అన్పించింది. రాకీ దగ్గర కెళ్ళి అవి చూపించింది. రాకీ రెండు సార్లు కళ్ళు మిటకరించి చూసి ఆవులించింది.

"రాకీ! నీక్కూడా జడలు అల్లేంత పెద్దజుట్టుంటే ఎంత బాగుండేదో

కదూ?" అంది రాకీతో.

రైలు ఎక్కి తలనిటారుగా పెట్టి వుండిపోయింది. "ఆహా! ఈజడలు ఎంత బాగున్నాయో?" అని రైల్లో ఎవరైనా అంటే ఎంత సరదాగావుంటుంది! కాని రైల్లో ఎవరూ పట్టించుకోలేదు. కాని బడికివెళ్ళగానే పిల్లలందరూ "పిలక జడలోచ్" అంటూ అరిచారు. టోటోచాన్‌కు చాలా సంతోషం కలిగింది. అమ్మాయిలందర్నీ తన జడలు ముట్టుకొని చూడడానికి అనుమతి ఇచ్చింది.

ఒక అబ్బాయి కూడా గుర్తించినందుకు సంబర పడిపోయింది. "ఇవి పిలక జడలు తెలుసా?" అన్నది.

ఆ అబ్బాయి దగ్గరగా వచ్చి పిలక జడల్ని రెండు చేతులతో పట్టుకొన్నాడు. "ఈజడలు పట్టుకొని ఊగవచ్చా? రైల్లో పట్టుకొనే జడలకంటే ఇవి చాలా మెత్తగావున్నాయి సుమా!" అన్నాడు.

ఆకుర్రాడి పేరు ఒయి. వాడు ఆ పిల్లకంటే పెద్దవాడు. పైగా ఎత్తుగా లావుగా వుంటాడు. ఆ జడలు పట్టుకొని లాగేసరికి టోటోచాన్ వెల్లకిలా పడిపోయింది. పైగా పిలకలు పట్టుకొని టగ్-ఆఫ్-వార్ ఆటలో లా రెండు వైపులకూ లాగాడు. టోటోచాన్ కళ్ళల్లో నీరుతిరిగింది.

జడలు వేసుకుంటే పెద్ద పిల్లలా వుంటాననీ, తనను చూడగానే అందరూ గౌరవిస్తారనీ అనుకుంది. ఏడుస్తూ హెడ్ మాస్టరు గది దగ్గర కెళ్ళి, తలుపు కొట్టింది. తలుపులు తెరుచుకున్నాయి. హెడ్ మాస్టర్ ముఖంలో ముఖం పెట్టి "ఏమిటి? ఏమైంది?" అని అడిగాడు.

ముందు తన పిలక జడలు వున్నాయో లేవోతడిమి చూసుకుంది. "వీటిని పట్టుకొని, హైలెసా-హైలెసా?" అంటూ ఒయి పట్టుకు లాగాడు, అంది.

టోటోచాన్ నీళ్ళు నిండిన కళ్ళవైపు చూశాడు. ఆ తర్వాత జుట్టు కేసి చూశాడు. రెండు సన్నటి జడలు, తేలుకొండీలలా వంపు తిరిగి గాలిలో ఎగురుతున్నాయి. వాటికి ఆ పిల్లబాధ ఏమీ పట్టలేదు. హెడ్‌మాస్టరు తను కూర్చుని, ఆ పిల్లను కూడా కూర్చోమన్నాడు. బోసి నోరు తెరిచి నవ్వాడు.

ఏడవకమ్మా! నీ తేలు కొండేల్లా వున్న జడలు బలేగావున్నాయి, తెలుసా?

"మీకు ఇవి బాగున్నాయా?" వెక్కిళ్ళు మధ్యలో ఆపి అడిగింది.

"అద్భుతం! చాలా బాగున్నాయి."

టోటోచాన్ కుర్చీదిగింది. "ఇకమీదట ఒయి ఎంత ఎగతాళిచేసినా నేను ఏడవను."

హెడ్‌మాస్టరు చిరునవ్వు నవ్వాడు. ఆ పిల్లకూడా చిరునవ్వు నవ్వింది. అనవ్వు ముఖానికి ఆ జడలు బలేగా నప్పాయి. టోటోచాన్ బయటికి పరిగెత్తింది. మిగతా పిల్లలతో ఆటల్లో మునిగి పోయింది.

ఒయి వచ్చి ఎదురుగా నిల్చున్నాడు. "నీ జడలు లాగినందుకు నన్ను క్షమించు. హెడ్ మాస్టరు నన్ను కోప్పడ్డారు. అమ్మాయిలతో మంచిగా వుండమని చెప్పాడు. వాళ్ళకు కావాల్సిన సహాయం చెయ్యమని చెప్పాడు," పెద్ద గొంతుతో అన్నాడు. ఆగొంతులో ఎటువంటి ఆవేశంలేదు.

టోటోచాన్‌కి ఆశ్చర్యం వేసింది. అమ్మాయిలతో మంచిగా వుండాలని అంతకు ముందు ఎవరూ చెప్పడం వినలేదు. ఎప్పుడూ మగపిల్లలే అధికులుగా వుండేవాళ్లు. పెద్దవాళ్లు కూడా అబ్బాయిల్ని అమ్మాయిలకంటే గొప్పవాళ్ళు గా చూస్తారు. భోజనాల దగ్గర ముందు మగ పిల్లలకు వడ్డించాకనే ఆడపిల్లలకు వడ్డిస్తారు. ఎప్పుడైనా ఆడపిల్లలు గట్టిగా మాట్లాడితే "ఆడపిల్లలు అందంగా కన్పించాలి. అంతేగాని వాళ్ళగొంతులు విన్పించకూడదు," అనేవారు.

హెడ్‌మాస్టరు మాత్రం అమ్మాయిలకు మర్యాద ఇవ్వమని చెప్పాడు. ఇదంతా వింతగా తోచింది. నిజంగా అబ్బాయిలు అమ్మాయిల్ని గౌరవిస్తే ఎంత బాగుంటుందో అనిపించింది.

ఒయి కయితే మింగుడు పడలేదు. అమ్మాయిలతో మర్యాదగా వుండాలట!

టోమోలో ఒయిని హెడ్ మాస్టరు కోప్పడడం అదే మొదటిసారి, చివరి సారికూడ.

## "ధన్యవాదాలు"

కొత్త సంవత్సరపు శెలవులు అయిపోవచ్చాయి. వేసవిశెలవుల్లోలాగ, శెలవుల మధ్యలో బళ్లో కలుసుకోవాల్సిన అవసరంలేదు. శెలవులన్నీ తమ కుటుంబాలతోనే గడిపారు.

"నేనీ సారి, కొత్త సంవత్సరం రోజున మాతాతగారింట్లోవుంటాను," అన్నాడు మిజిటా కన్పించిన వాళ్ళందరితో.

"నేను మా అన్నయ్యతో కలిసి ఒక ఫిజిక్స్‌లేబరేటరీ చూడడానికి వెళ్తున్నాను, తెలుసా?" అన్నాడు తాయిచాన్. ఇలా అందరూ శెలవుల్లో ఏమేమి చెయ్య బోతున్నారో ఎదుటివాళ్ళకు చెప్పసాగారు.

టోటోచాన్ తల్లి దండ్రులతో కలసి స్కైయింగ్‌కు వెళ్ళింది. ఆమె తండ్రికి హిడియో సైటూ అనే స్నేహితుడు ఉన్నాడు. ఆయన సెల్‌వాయిస్టాడు. అతనికి షిగా హైలాడ్స్‌లో ఒక ఇల్లువుంది. ప్రతి సంవత్సరం టోటోచాన్, తన తల్లితండ్రులతో చలికాలంలో అక్కడే వుండేది. కిండర్ గార్డెన్‌లో వున్నప్పుడే టోటోచాన్ మంచు మీద ఎలా జారాలో నేర్చుకుంది.

స్టేషన్ నుంచి స్కైయింగ్ ప్రాంతానికి వెళ్ళాలంటే గుర్రపు బండిమీద వెళ్లాల్సి వస్తుంది. చుట్టూ మంచుతో కప్పబడితెల్లగా వుండేది. అక్కడొక చెట్టు కొమ్మ, ఇక్కడొక చెట్టుకొమ్మ తప్ప మరింకేమీ కన్పించేదికాదు. స్వంత ఇళ్లులేని వాళ్లు, జపాన్ పద్దతిలో నిర్మించిన సత్రంలోగానీ, విదేశ హోటళ్లల్లోగానీ వుండేవారు. అక్కడకు విదేశీయులు చాలా మంది వచ్చే వాళ్ళు.

పోయిన సంవత్సరం కంటే ఈ సంవత్సరం ప్రత్యేకంగా అన్పించింది టోటోచాన్‌కు. ఇప్పుడు మొదటి తరగతిలో చదువు తున్నది. కొన్ని ఇంగ్లీషు మాటలు కూడా వచ్చు- "థ్యాంక్యూ" అనడం కూడా తండ్రి దగ్గర నేర్చుకుంది.

స్కైయిలలో కాళ్ళు పెట్టి మంచులో నిల్చుని వున్న టోటోను చూసి విదేశీయులు "ముద్దుగావుంది కదూ?" అనుకుంటూ పోయేవారు. కిందటి సంవత్సరం వరకు ఆమెకు ఏమనాలో తెలియదు. ఈ సంవత్సరం మాత్రం వాళ్లకు థ్యాంక్స్ చెప్పాలని నిర్ణయించుకుంది.

టోటోచాన్ "థ్యాంక్యూ" అంటే విదేశీయులు ఇంకానవ్వు కొనేవారు. కొందరు స్త్రీలు దగ్గరకు వచ్చి ఆ పిల్ల చెంపకు చెంప ఆనించేవారు. పురుషులు దగ్గరకు తీసుకొని "థ్యాంక్యూ" అనేవారు. ఈ "థ్యాంక్యూ" అనే పదంతో మంచి స్నేహితుల్ని సంపాదించు కోవచ్చు అనుకుంది.

ఒక రోజు ఒక యువకుడు టోటోచాన్ దగ్గరకు వచ్చాడు. "నాతోపాటు మంచు మీద జారతావా?" అని అడిగాడు టోటోచాన్‌కు అతడు మంచి వాడుగానే కన్పించాడు. తండ్రి కూడా అనుమతి ఇచ్చాడు.

అతడు టోటోచాన్‌ను తన కాళ్ల మధ్యగా కూర్చో బెట్టుకొని ఏటవాలుగా

వున్నమంచు మీద జారడం మొదలు పెట్టాడు. టోటోచాన్ చెవుల్లోకి గాలి దూసుకుపోతుంటే, అది ఈల వేస్తున్నట్టుగా అన్పించింది. వాళ్ళ ఆటపూర్తి అయాక వాళ్ళనే చూస్తూ నిలబడ్డవాళ్ళు చప్పట్లు కొట్టారు. టోటోచాన్ సంతోషంగా "థ్యాంక్యూ" అంది. వాళ్ళు మళ్లీ చప్పట్లు కొట్టారు.

చాలా సంవత్సరాల తర్వాత తనను ఆనాడు అలా ఆడించిన యువకుడు ఎవరో తెలిసింది. అతని పేరు ష్నీడర్. అతను ప్రపంచఖ్యాతిపొందిన స్కీయింగ్ విజేత. ఆయన ఎప్పుడూ వెండిస్కీ జతల్ని ఉపయోగించేవాడు. తనకు ఇప్పటికీ గుర్తుంది-ఆటపూర్తికాగానే అతడు తన పక్కగా కూర్చుని ముఖంలో ముఖం పెట్టి "థ్యాంక్యూ" అన్నాడు. తనను చిన్న పిల్లలాగ చూడలేదు. పెద్దవాళ్లను గౌరవించినట్టే గౌరవించాడు. ఆయన చాలా మంచివాడని పించింది. అతడి వెనక మంచుమైదానం వెండిలా మెరిసిపోతున్నట్టు అన్పించింది.

## లైబ్రేరీ రైలుపెట్టె

శెలవులు అయిపోయాయి. పిల్లలందరూ బడికివచ్చారు. అక్కడ వాళ్ళకొక కొత్త వింత కన్పించింది. పిల్లలు ఆనందంతో గంతులు వేశారు. అసెంబ్లీహాలును ఆనుకొనివున్న పూల తివాచి పక్కగా ఒక కొత్త రైలు పెట్టె కన్పించింది. అది లైబ్రేరీ పెట్టెగా మారింది. కాపలా దారు రోచాన్ అంటే అందరికీ గౌరవం, అతడికి అన్ని పనులూ వచ్చు. ఈ పెట్టెను లైబ్రేరీ పెట్టెగా తీర్చిదిద్దాడు. రంగురంగుల అట్టలతోవున్న పుస్తకాలు అరల్లో ఆకర్షణీయంగా అమర్చి వున్నాయి. బల్లలూ, కుర్చీలూ కూడా వున్నాయి. అక్కడ కూర్చుని చదువుకోవచ్చును. రాసుకోవచ్చును.

"ఇది లైబ్రేరీ! ఇందులో పుస్తకాలు మీరు చదువు కోవచ్చు. మీ కిష్టమైన ఏ పుస్తకమైనా తీసు కోవచ్చు. కావాలంటే ఇంటికి తీసుకువెళ్ళవచ్చు. మళ్లీ తెచ్చి ఇక్కడే పెట్టాలి. మీ ఇంట్లో ఏవైనా పుస్తకాలు, ఇవ్వాలను కుంటే, తెచ్చి ఇక్కడ పెట్టవచ్చు. మీరు వీలయినన్ని ఎక్కువ పుస్తకాలు చదవాలని నా కోరిక," అన్నాడు హెడ్‌మాస్టరు.

"ఇవ్వాళ మొదటి తరగతి లైబ్రేరీ తరగతి!" పిల్లలంతా ఏక కంఠంగా అరిచారు.

"ఓ అట్లాగే! మీకిష్టమైతే కాదనేవాళ్ళెవరు?" వాళ్ళ ఉత్సాహం చూసి హెడ్‌మాస్టరు సంతోషంగా అన్నాడు.

పిల్లలు ఆనందం పట్టలేకుండా వున్నారు. టోటో చాన్‌కు ఇంకా బాగా చదవడంరాదు. తనకు ఇష్టమైన బొమ్మల పుస్తకం ఒకటి తీసుకుంది. అందరూ తలాఒక పుస్తకం తీసుకున్నారు. ఆ రైలు పెట్టెలో ఒక్కసారిగా నిశ్శబ్దం చోటు చేసుకుంది. కాని అది ఎంతో సేపు లేదు. మళ్ళీ కలకలం. కొందరు పైకే చదివేస్తున్నారు. కొందరు పక్కవాళ్లను సందేహాలు అడుగుతున్నారు. ఒకళ్ళ పుస్తకం ఒకళ్లు మార్చు కుంటున్నారు. రైలు పెట్టెనిండా నవ్వులు పువ్వులై పరచు కుంటున్నాయి. ఒక పిల్ల ఒక పొడుపు కథను బిగ్గరగా పాడుతూ బొమ్మలు గీయసాగింది.

ఒకసున్న — ఒకచుక్క

ఒక సున్న — ఒకచుక్క!

వంకర టింకర ముక్కు—ఒకసున్న! ఒక చుక్క! వావ్! వావ్! చూడు! కన్ను మూసి తెరిస్తే లావాటి అత్తయ్య! వావ్! అనేసరికి ముఖం చుట్టు గుండ్రంగా గియ్యాలి. కన్నుమూసితెరిస్తే. అనేసమయానికి వెంట్రుకల మీద అర్ధసున్నాలు గియ్యాలి. ఇవన్నీ సరిగ్గా గీస్తే, పాతపద్ధతిలో కొప్పులు చుట్టుకున్న లావుపాటి జపాన్ స్త్రీ ముఖం ప్రత్యక్ష మవుతుంది.

పిల్లలకి పూర్తి స్వేచ్ఛవున్న ఆస్కూల్లో ఒకోసారి, ఒకరిపనికి మరొకరు అడ్డం వచ్చే అవకాశంవుంది. అందువల్లనే చుట్టూ జరిగేదాన్ని పట్టించు కోకుండా, తనపనిలో ఎలా లీనం అయిపోవాలో నేర్పడం జరుగుతుంది. అందుకే లావు పాటి అత్తయ్యబొమ్మగీస్తూ ఆ పిల్ల ఎంత పెద్దగా పాటపాడినా



ఎవరూ పట్టించుకోలేదు. ఒకరో ఇద్దరో తలెత్తి చూసినా మళ్ళీతమ పుస్తకాల్లో లీనం అయిపోయారు.

టోటోచాన్ తీసుకున్న పుస్తకం ఒక జానపద గాథకు సంబంధించింది. ఒక డబ్బున్న ఆసామికి ఒక కూతురుఉంది. ఆ అమ్మాయి ఎంత కాలానికీ పెళ్ళికాలేదు ఎందుకోతెలుసా? ఆ అమ్మాయి ఎప్పుడూ గాలివదులుతూ వుంటుంది. ఎట్లాగో కష్టపడి ఆ అమ్మాయికి పెళ్ళిచేశారు. తల్లిదండ్రులు. ఆ అమ్మాయి మహా ఉత్సాహపడిపోయింది. పెళ్లిరోజు రాత్రి మరీ పెద్దగా గాలివదిలింది, ఆ గాలికి మంచం మీద వున్న పెళ్లికొడుకు గాలిలోకిలేచాడు. ఆగదిలో ఏడున్నర సార్లు గాలిలో గిర్రునతిరిగి, మూర్ఛవచ్చి పడిపోయాడు. టోటో చాన్‌కు ఇష్టమైన బొమ్మ-పెళ్లికొడుకు గాలిలో గిర్రున తిరుగుతున్నట్టు వున్నబొమ్మ టోటోచాన్ చూశాక చాలామంది పిల్లలు ఆ పుస్తకం కావాలని తీసుకున్నారు.

పిల్లలందరూ చేప పిల్లల్లా లైబ్రెరీగదిలో తేలిపోతున్నారు. ఎగబడి పుస్తకాలు చదువుతున్నారు. కిటికీలో నుంచి సూర్య కిరణాలు లోపలకు ప్రసరిస్తున్నాయి. ఆ దృశ్యం చూస్తున్న హెడ్‌మాస్టరు మనసుపొంగిపోయింది.

పిల్లలు ఆరోజంతా లైబ్రెరీ పెట్టెలోనే గడిపారు.

వర్షంపడిబయటికి వెళ్ళలేని సమయాల్లోనూ, ఇతర ఖాళీ సమయాల్లోను పిల్లలు లైబ్రెరీలో గడుపుతున్నారు.

"లైబ్రెరీ పక్కన ఒక మరుగు దొడ్డి కట్టిస్తే బాగుంటుంది కదూ?" అన్నాడు హెడ్ మాస్టరు.

అందుకు కారణం లేక పోలేదు. పిల్లలు పుస్తకాలలో లీనమైన చివరి నిముషం వరకూ ఆధ్యాసే లేకుండా కూర్చుంటున్నారు. చివరి నిముషంలో అసెంబ్లీహాలు ముందు నుంచి మెలికలు తిరిగిపోతూ బాత్‌రూం కోసం పరుగులు తీస్తున్నారు.

## తోకలు

**ఒకరోజు సాయంత్రం బడి అయిపోయాక ఇంటికి వెళ్ళే ప్రయత్నంలో వుంది టోటోచాన్. ఒయి పరిగెత్తుకుంటూ వచ్చి "హెడ్‌మాస్టరు ఎవరిమీదో కోపంతో**

నిప్పులు కక్కు తున్నాడు," అన్నాడు.

"ఎక్కడ!" అడిగింది టోటోచాన్.

టోటో చాన్‌కు హెడ్‌మాస్టరు కోపంగా వున్నాడంటే బోలెడంత ఆశ్చర్యం వేసింది. ఒయి కూడా అందువల్లనే ఉద్వేగంతో పరిగెత్తు కుంటూవచ్చి చెప్పాడు.

"వంటింట్లో! ఒయి అందమైన కళ్ళు వెడల్పు అయాయి. ముక్కు పుటాలు కొద్దిగా ఉబ్బాయి.

"పద! చూద్దాం!"

టోటోచాన్ ఒయి చెయిపట్టుకొని హెడ్‌మాస్టర్ ఇంటికేసి పరుగు తీసింది. అది అసెంబ్లీహాలు పక్కన ఉంది. వంటగది బడి ఆవరణలోని వెనక పక్కదారి పక్కనవుంది. టోటోచాన్ మురికి గుంటలో పడిపోయిన రోజు వంటగదిలోకి తీసుకెళ్ళే శుభ్రంచేసారు. మధ్యాహ్నావు భోజనం ఇక్కడే తయారు చేసి కావాల్సిన పిల్లలకు పెడ్తారు.

పిల్లలిద్దరూ చప్పుడు కాకుండా తలుపు వెనక నిల్చున్నారు. హెడ్‌మాస్టరు కోపంగా అరవడం విన్పించింది.

"టాకాహాషికి తోకవుందని అంత బుద్ధి లేకుండా ఎందు కన్నావ్?"

ఆయన కోప్పడుతున్నది తమ క్లాసు టీచర్నేనని అర్థం అయింది వాళ్లకు.

"నేను కావాలని అనలేదు. అకస్మాత్తుగా ఆ పిల్లవాడు కన్పించాడు. ఎంతో ముద్దొచ్చాడు." అన్నది టీచర్.

"అలా అనడం ఎంత దారుణమో నీకు తెలియడం లేదు. ఆ పిల్లవాడికోసం నేనెంత జాగ్రత్త పడుతున్నానో నీకు అర్థంకాదు."

"ఆ రోజు పొద్దుట క్లాసులో జరిగిన విషయం గుర్తొచ్చింది టోటోచాన్‌కు. ఒకప్పుడు మనుషులకు తోకలు వుండేవని క్లాసు టీచరు చెబుతోంది. పిల్లలకు అదిచాలా వింత విషయంగా అన్పించింది. పెద్దవాళ్ళకయితే అది పరిణామవాద సిద్ధాంతం అనితెలుసు. ఇప్పటికీ ఆ తోక అవశేషం వుంటుందని ఆటీచరు చెప్పింది. అది విన్న పిల్లలు తమకు ఆ అవశేషం ఎక్కడ వుందబ్బా అని ఆలోచించ సాగారు. టీచరు హాస్యానికి "ఇక్కడ కూడా ఎవరికైనా తోక వుందా? ఏం? టాకాహాషి! నీకుందా తోక" అని అన్నది.

వెంటనే టాకాహాషి లేచి నిలబడి "నాకేంలేదు" అన్నాడు.

ఆ విషయంలోనే హెడ్ మాస్టరు టీచర్ని కోప్పడు తున్నాడని అర్థం చేసుకుంది. ఆయన గొంతులో కోపం తగ్గింది.

"నీకు తోకవుందా? అని అడిగితే ఆ పిల్లవాడు ఎంత బాధపడ్తాడో నీకు తట్టలేదా?"

ఆ తర్వాత ఆ టీచరు ఏం సమాధానం ఇచ్చిందో విన్పించలేదు. తోక అంటే హెడ్‌మాస్టరుకు అంతకోపం ఎందు కొచ్చిందో టోటోచాన్‌కు అర్థం కాలేదు. హెడ్‌మాస్టర్ తనను నీకు తోకవుందా అని అడిగితే తనకేం బాధ అన్పించదు.

టోటోచాన్‌కు ఏమీ అన్పించదు. ఎందుకంటే ఆ పిల్ల శరీరం ఎదుగుదలలో ఎలాంటి అవకరం లేదు. కాని టాకాహాషి విషయంవేరు. అతడి ఎదుగుదల ఆగిపోయింది. అతడు మరుగుజ్జు. అందుకే హెడ్‌మాస్టరు ఆటలరోజు ఆకుర్రాడు ఆడగలిగిన ఆటల్నే ఆడించాడు. ఈత నేర్చుకొనేటప్పుడు దుస్తులు వేసుకోనక్కర్లేదని చెప్పడానికి కారణం, కూడా ఆకుర్రాడు ఆత్మన్యూనతా భావంనుంచి బయట పడాలనే. టాకాహాషి. యాసువాకి చాన్ ఇద్దరూ అంగ వైకల్యం కలిగిన వారే. అందుకే వాళ్ళను వీలైనంత జాగ్రత్తగా చూసుకున్నాడు హెడ్‌మాస్టరు. వాళ్లల్లో, మిగతా పిల్లలకంటే తాము తక్కువ అనేభావం రాకుండా వుండేందుకు అన్ని ప్రయత్నాలూ చేశాడు. టాకాహాషి లాంటి పిల్లవాడ్ని ఎవరైనా నీకు తోక వుందా అని ఎలా అడుగుతారో ఆయనకు అర్థం కాని విషయం.

హెడ్‌మాస్టర్ అటుగా వెళుతూ అనుకోకుండానే ఆ మాట విన్నాడు.

టీచర్ ఏడుస్తోంది. "నేను చాలా తప్పు చేశాను. టాకాహాషికి క్షమాపణ చెప్పుకుంటాను," అన్నది.

హెడ్‌మాస్టరు మాట్లాడలేదు. అద్దంతలుపులో నుంచి చూస్తే టోటోచాన్‌కు హెడ్‌మాస్టరు కన్పించలేదు. అసలు అంతగొడవ ఎందుకో ఆ పిల్లకు అర్థం కాలేదు. అయితే, హెడ్‌మాస్టరుకు పిల్లలంటే చాలా ఇష్టం అని మాత్రం అన్పించింది.

అందరి ముందూ కాకుండా, ఆమెను వేరుగా వంటగదిలోకి పిల్చి

మందలించడం, టోటోచాన్‌కు ఇప్పటికీ గుర్తుంది. ఈ సంఘటన వల్ల ఆయన ఎంత మంచి అధ్యాపకుడో అర్థం చేసుకోవచ్చు. ఆయన కంఠ స్వరం, మాటలు, టోటోచాన్ మనసులో కలకాలం నిలిచిపోయాయి.

వసంతరుతువు మొదలైంది. టోటో చాన్‌కు ఆ బడిలో ఇది రెండో వసంతరుతువు. ఇది కొత్త సంవత్సరపు ప్రారంభం.

## టోమోలో రెండో సంవత్సరం

బడి ఆవరణలోని చెట్లు చిగురిస్తున్నాయి. నేలమీద లాన్‌లో పూలు విరగబూసి వున్నాయి. రంగురంగుల పూలు పిల్లల్ని పరామర్శిస్తున్నట్టుగా ఉన్నాయి. చెర్రీ మొగ్గలు గాలిలో ఊగుతూ వికసించడానికి సిద్ధంగా ఉన్నాయి.

ఈత కొలను పక్కన కాళ్ళు కడుక్కో వడానికి ఒక చిన్న నీళ్ల తొట్టె వుండేది. అందులో చేపపిల్లలూ-తోక పురుగులూ తమషాగా కదులుతూ ఉండేవి.

"వసంతరుతువు వచ్చేసిందోచ్!" అని ఎవరూ చెప్పక్క ర్లేకుండానే, ఆ వాతావరణమే చెబుతోంది వసంతం వచ్చిందని.

తల్లితో కలిసి టోటోచాన్ ఆ బడికి వచ్చి సరిగ్గా సంవత్సరం అయింది. ఆరోజు ఆ బడిలోని వింతలు చూసి ఆ పిల్ల ఉద్వేగంతో ఊగిపోయింది. తమ స్థాయి పెరిగి రెండో తరగతి వచ్చినందుకు పిల్లలు సంతోషపడ్డారు. కొత్తవాళ్ళు మొదటితరగతిలో చేరడానికి వచ్చారు. వాళ్ళు తమలాగే ఉద్వేగంతో ఊగిపోవడం గమనించారు రెండో తరగతి పిల్లలు.

ఈ సంవత్సరం టోటోచాన్‌కు ఎన్నో వింత అనుభవాలను ఇచ్చింది. రోజూ ఉదయం ఎప్పుడౌతుందా అని ఎదురు చూసేది. ఆ పిల్లకు, ఇప్పటికీ వీధిబాజా వాళ్లంటే ఇష్టమే. కాని ఇంకా ఎన్నెన్నో చుట్టూ ఉన్న విషయాలు కూడా ఇష్టమే. గుదిబండలావుందని ఒక స్కూలు నుంచి బహిష్కరించ బడిన ఆపసిపిల్లే, ఇప్పుడు టోమోలో ఒక అద్భుతమైన విద్యార్థినిగా గుర్తించ బడుతోంది.

కొంత మంది తల్లి దండ్రులకు టోమో విద్యావిధానం మీద అనేక సందేహాలు వుండేవి. టోటోచాన్ తల్లితండ్రులు కూడా పిల్లను ఆ బళ్ళో చేర్చి

తప్పు చేశావేమో అనుకున్న సమయాలు కూడా వున్నాయి. కొందరు తల్లి దండ్రులు తమ పిల్లల్ని ఆస్కూలు మానిపించాలని కూడా ప్రయత్నించారు. కాని పిల్లలు అక్కడే వుండాలని కోరుకున్నారు. వాళ్లకు ఆ బడివదలడం ఇష్టం లేదు. టోటోచాన్ క్లాసు పిల్లల్లో ఒక్కరు కూడా టోమో వదిలి వెళ్ళలేదు. ఒక పిల్లవాడ్ని తల్లి దండ్రులు బలవంతంగా తీసుకు వెళ్ళారు. ఆ పిల్లవాడు ఏడుస్తూ హెడ్‌మాస్టరు వీపుమీద గుద్దడం మొదలుపెట్టాడు. హెడ్‌మాస్టరుకు కూడా కళ్ళల్లో నీరుతిరిగింది. తల్లి దండ్రులు లాక్కెళు తూవుంటే ఆ కుర్రాడు వెనక్కు తిరిగి చేతులు ఊపసాగాడు.

ఇలాంటి విషాద సన్నివేశాలు ఎక్కువ లేవు. టోటోచాన్ ఇప్పుడు రెండో తరగతిలోకి వచ్చింది. అప్పటికి పుస్తకాల సంచి ఆ పిల్లవీపుమీద బాగానే అమరిపోయింది.

## హంసల సరస్సు

'హంసల సరస్సు' అనే నృత్య రూపకాన్ని చూపించడానికి టోటో చాన్‌ను హిబియా హాల్‌కు తీసుకెళ్ళారు. మంచి బృందం ఈ రూపకాన్ని ప్రదర్శిస్తోంది. టోటోచాన్ తండ్రి వైలన్ వాయిస్తున్నాడు. అలాంటి ప్రదర్శనకు రావడం టోటోచాన్‌కు మొదటిసారి. హంసలరాణి తల మీద కిరీటం పెట్టుకుంది. అది వెలుగులు విరజిమ్ముతోంది. మిలమిల మెరిసిపోతున్నది. హంసలాగా ఆమె గాలిలోకి చాలా తేలిగ్గా ఎగిరింది. అచ్చం హంసలాగేవుంది అనుకుంది టోటోచాన్. హంసల రాణిని ఒక రాజకుమారుడు ప్రేమించాడు.

మిగతావాళ్ళను తరిమేశాడు. ఇద్దరూ చాలాసేపు నృత్యం చేశారు. సంగీతం కూడా బాగుంది. టోటో చాన్‌కు ఆరూపకం ఎంతగానో నచ్చింది. ఇంటికి వచ్చాక కూడా చాలాసేపు దాన్ని గురించే ఆలోచించింది. తెల్లవారి నిద్రలేస్తూనే, ముఖం మీదకు పడ్తున్న జుట్టును కూడా పట్టించు కోకుండా తల్లి గదిలోకివచ్చింది.

"అమ్మా! అమ్మా! నేను గూఢచారిగా పనిచెయ్యను. బాజాలవాళ్ళలా బాజాలు వాయించను. రైల్వేస్టేషన్లో టికెట్లు కూడా అమ్మను. నేను నాట్యం నేర్చుకుంటాను. హంస సరస్సులో నాట్యం చేస్తాను," అన్నది.

"అట్లా గేలే!" అంది తల్లి. కూతురి మాటలు ఆమెకు ఏమీ వింతగా అన్పించలేదు.

టోటోచాన్ నృత్య రూపకం చూడడం మొదటి సారే అయినా వినడం మొదటిసారికాదు. హెడ్‌మాస్టరు, ఇజడోరాడంకన్ గురించి చెప్పాడు. అందులో ఒక అమెరికన్ స్త్రీ బ్రహ్మాండంగా నాట్యం చేస్తుందట. కొబియాషిలాగే, ఇజడోరా డంకన్, డాల్‌క్రోజ్‌వల్ల ప్రభావితు రాలైంది. ఆమెను చూడ కపోయినా చూసినట్టే అన్పించింది టోటోచాన్‌కు. కారణం ఆమె అంటే హెడ్‌మాస్టరుకు ఇష్టం. తనకేమో హెడ్‌మాస్టరంటే ఇష్టం. అందుకే ఇజడోరా అంటే కూడా తనకు ఇష్టం. అందువల్ల నర్తకి కావడం అసాధారణమైన విషయం కాదని అనిపించింది.

హెడ్‌మాస్టరు స్నేహితుడు, ఒకాయన టోమోకు వచ్చి యురిథమిక్స్ నేర్పించేవాడు. ఆయనకు ఒక నృత్యం నేర్పేబడివుంది. బడి అయిపోయాక, అక్కడి కెళ్ళి నృత్యం నేర్చు కోవడానికి ఏర్పాటు జరిగింది. టోటోచాన్ తల్లి ఏనాడూ 'ఇది చెయ్యి-అదిచెయ్యి' అని శాసించలేదు. కూతురు ఏం చెయ్యాలని కోరుకున్నా వెంటనే అంగీకరించేది. ప్రశ్నలు వేసేది కాదు. మౌనంగా అందుకు కావాల్సిన ఏర్పాట్లు చేసేది.

టోటోచాన్ నృత్య శిక్షణాలయంలో చేరింది. హంసల సరస్సులో లాగ నాట్యం చెయ్యాలని ఆ పిల్లకోరిక. ఇక్కడ నృత్య పద్ధతి వేరుగా వుంది. వాయిద్య సంగీతానికి అనుగుణంగా పిల్లల చేత అడుగులు వేయించేవాడు నాట్యాచార్యుడు. "కొండమీద వెలుగు" వంటి మాటలు పదేపదే పలికించే వాడు. ఫ్యూజికొండ ఎక్కేప్పుడు భక్తులు ఈ మాటను ఎక్కువగా అంటారు. "ఒకొండ మీద వెలుగా మా పాపాల్ని పోగొట్టు" అనే పాటనుంచి తీసుకున్న మాటలు అవి. పిల్లలు సంగీతానికి అనుగుణంగా అడుగులు వేస్తుండగా, వున్నట్టుండి "పాజ్" అనేవాడు. పిల్లలు ఏదో ఒక భంగిమలో ఆగిపోయేవాళ్ళు. టీచరు కూడా ఏదో ఒక భంగిమలో నిలబడి పోయేవాడు. అతడు రకరకాల భంగిమలు చూపెట్టేవాడు.

టోటోచాన్ మనసులో మాత్రం హంసలసరస్సులోని నృత్య భంగిమలే నిలిచి పోయాయి. జిగేల్‌మని మెరిసి పోయే కిరీటం పెట్టుకొని మెరిసిపోయే తెల్లచిదుస్తుల్లో ఉన్న హంస మాత్రమే ఆమె మనసులో వుండేది. ఇక్కడ

నేర్చుకొనే ఏ భంగిమా ఆమె మనసులోకి చొరబడలేదు.

ఒక రోజు టోటోచాన్ టీచరు దగ్గర కెళ్ళింది. ఆయన జుట్టును తమాషాగా కట్టు కున్నాడు. టోటోచాన్ రెండు చేతుల్నీచాచి, హంసరెక్కల్లా గాలిలోకి విసురుతూ "ఇట్టాంటి నాట్యం మనం చెయ్యమా?" అని అడిగింది.

"మనం అటువంటి డ్యాన్సులు ఇక్కడ చెయ్యం" అన్నాడు.

అంతే ఆ పిల్ల ఆ డ్యాన్సుస్కూలుకు వెళ్ళడం మానేసింది. ఆ మెరిసిపోయే కిరీటం పెట్టుకొని, హంసలా నృత్యం చెయ్యాలనేది ఆపసిదాని కోరిక.

"హంసల సరస్సు బాగానేవుంటుంది. కాని సహజంగా వుండే నృత్యం నేర్పాలని నా కోరిక" అన్నాడు టీచర్.

అతడి పేరు బాకు ఇషి అని పెద్ద అయ్యాక కానీ ఆ పిల్లకు తెలియదు. జపాన్‌లో స్వేచ్ఛాయుతమైన, ప్రయోగాత్మకమైన, నృత్యపద్ధతులకు నాంది పలికింది ఆయనే. ఆ ప్రాంతానికి జియుగౌకా (స్వేచ్ఛా పర్వతం) అనే పేరు పెట్టింది కూడా ఆయనే. అప్పుడు ఆయన వయసు ఏభయ్‌ఏళ్లు.

## వ్యవసాయం టీచర్

"ఇవ్వాళ ఈ టీచరు మీకు చాలా విషయాలు నేర్పిస్తాడు." అంటూ హెడ్ మాస్టరు పిల్లలకు ఒకకొత్త టీచర్ని పరిచయం చేసాడు. టోటోచాన్ అతని కేసి దీక్షగా చూసింది. అసలు ఆయన వేషం చూస్తే టీచర్‌గానే అన్పించలేదు. పని చేసే వాళ్లలాంటి దుస్తులు వేసుకున్నాడు. మెళ్లో టైకి బదులుగా ఒకతువ్వాలు వేలాడుతూ వుంది. చేనేత గుడ్డతో కుట్టిన నీలంరంగు ప్యాంటు వేసుకున్నాడు. అది చాలా బిగుతుగా వుంది. పనిపాటలు చేసుకొనే వాళ్లు, తొడుక్కొనే లాంటి, మందపాటి రబ్బరు చెప్పులు తొడుక్కున్నాడు. నెత్తిమీద చిరిగిపోయిన గడ్డి టోపీ ఉంది.

ఆయన పిల్లలందర్నీ తనవెంట తీసుకెళ్ళాడు. కుహొంబుట్సు గుడి దగ్గర కూర్చో బెట్టాడు.

ఆయనను చూస్తుంటే టోటోచాన్‌కు అంతకుముందే అతడిని ఎక్కడో చూసినట్టుగా అన్పించింది. చటుక్కున ఏదోగుర్తుకొచ్చింది.

"కాలవ పక్కన వున్న పొలంలో పనిచేసేది మీరేగదూ?"

"ఔను! నేనే!" అన్నాడు అతడు పళ్ళన్నీ కన్పించేలా నవ్వుతూ. "మీరు గుడికి వెళ్తున్నప్పుడు మాపొలంమీదగానే వెళ్తారు. అక్కడ ఆవాల వూలతో నిండుగ వుండే పొలం నాదే," అన్నాడు.

"బలే! బలే! అయితే ఇవ్వాళ మీరే మాకు పాఠాలు చెప్తారన్న మాట!" పిల్లలందరు సంబరంగా అడిగారు.

"కాదు. కాదు. నేను పాఠాలు చెప్పే టీచర్నుకాదు. మీ హెడ్‌మాస్టరుగారు నన్ను కొన్ని విషయాలు చెప్పమన్నారు. ఆ! అంతే!"

లేదు. ఈయన మీకు టీచరే ఇవ్వాళ వ్యవసాయం ఎలా చేస్తారో మొక్కలు ఎలా నాటుతారో చెప్పే టీచరు. మీకు, అప్పుడప్పుడు వచ్చి "బ్రెడ్ వగైరా ఎలా తయారు చేస్తారో" చెబుతాడు చూడండి—అలాంటి టీచరే ఈయన అన్నాడు, అప్పుడే వచ్చి నిలబడిన హెడ్‌మాస్టరు. "ఇక మీరు పాఠాలు ప్రారంభించండి," అన్నాడు ఆ వ్యక్తితో.

సాధారణంగా విద్యాలయాల్లో ఏ విషయం గురించి బోధించాలన్నా ఏదో ఒక క్వాలిఫికేషన్ వుండాలనే నియమం వుంటుంది. కాని టోమోలో అలాంటి నియమంలేదు. ఏపనైనా చేస్తున్నప్పుడు చూసి నేర్చు కోవాలనేదే ఆ హెడ్‌మాస్టరు సిద్ధాంతం.

"సరే! అయితే మొదలు పెడదాం," అన్నాడు ఆ కొత్త టీచరు.

వాళ్ళందరూ గుడి పక్కన వున్న సరస్సు ఒడ్డున కూర్చున్నారు. ఆ వాతావరణం ప్రశాంతంగా వుంటుంది. చెట్ల నీడలు సరస్సు నీళ్లలో కదులుతూ వుంటే చూడడానికి బలేగా వుంటుంది. అప్పటికే ఒకపొలం మధ్యలో రైలు పెట్టె భాగం ఒకటి పెట్టివుంది. పిల్లలు వ్యవసాయపనిముట్లు దానిమీద పెట్టుకోవచ్చును. పారలూ, పలుగులూ తెచ్చుకోమని పిల్లలకు చెప్పాడు టీచరు. రైలు పెట్టెలోపెట్టిన పనిముట్లను తలా ఒకటి తీసుకున్నారు.

ఆయన పొలంలో మొలిచే కలుపు మొక్కల గురించి చెప్పాడు. అవి పంటకు ఎలా హాని చేస్తాయో వివరించాడు. పంటలను తినేసే పురుగులకు కలుపు మొక్కలు ఎలా రక్షణ కలిగిస్తాయో చెప్పాడు. ఆయన చెప్తూనే వున్నాడు. మరో వైపు కలుపుమొక్కల్ని ఏరేస్తూనే వున్నాడు. పిల్లలు కూడా ఆయనను అనుకరించారు. తర్వాత పలుగుతో భూమిని ఎలా తవ్వాలో నేర్పించాడు.

పొలంలో ఎరువులు ఎలా చల్లాలో చూపించాడు. ప్రతిపనీ తను చేసి చూపెట్టి వాళ్ళ చేత చేయించాడు.

ఓ పాము పిల్ల రంధ్రంలోనుంచి తల బైటకు పెట్టి టోటోచాన్‌ను కాటెయ్య బోయింది. "ఇక్కడున్న పాములకు విషం వుండదు. భయపడకు. నువ్వేమీ చెయ్యకపోతే అది కూడా నిన్నేమీ చెయ్యదు," అన్నాడు ఆ టీచర్ టోటోచాన్‌తో.

పొలం పనుల గురించి వివరంగా చెప్పాడు. తను చేస్తూవాళ్ళ చేత చేయించాడు. ఆయన చేతులు లావుగా బలంగా వున్నాయి. కష్టం చేసిన చేతులు అవి.

పిల్లలు పొలంలో మొక్కలు నాటారు. ఆపొలం ఎంతో కనులపండువగా వున్నట్టు అన్పించింది. పిల్లలు చెమట ముద్దలే అయి పోయారు. అలసిపోయారు.

ఆరోజు నుంచి ఆ పిల్లలకు ఆయన మీద ఎనలేని గౌరవం ఏర్పడింది. అటుగా వెళ్తూ "అడుగో! మా వ్యవసాయం టీచర్!" అంటూ అరిచేవాళ్ళు. ఆయన తన దగ్గర మిగిలి పోయిన ఎరువులు తెచ్చి పిల్లల పొలంలో చల్లేవాడు. మొక్కలు బాగా ఏపుగా పెరుగుతున్నాయి. ప్రతిరోజూ ఎవరో ఒకరు చూసి వచ్చి మిగతా పిల్లలకూ, హెడ్‌మాస్టరుకూ, మొక్కలు ఎలాపెరుగు తున్నాయో వివరంగా చెప్పేవాళ్లు.

ఆ సమయంలో ప్రపంచంలోని అనేక చోట్ల భయం కరమైన సంఘటనలు జరుగుతున్నా, ఆపసి వాళ్లు తమ పొలంలోని బుల్లి బుల్లి మొక్కల్ని గురించి కబుర్లు చెప్పుకుంటూ వుండేవారు. వారి హృదయాలు శాంతి కపోతాలు.

## "ప్రేమ తోటలో వన భోజనాలు"

ఆరోజు బడి అయిపోగానే టోటో చాన్ ఉద్వేగంగ ఇంటి ముఖం పట్టింది... ఎవరికీ చెప్పకుండా స్టేషన్ కేసి పరుగు తీసింది. అలా పరుగు తీస్తూనే "గర్జించే ప్రేమ తోటలో వనభోజనాలు" అనే వాక్యాన్ని మళ్ళీ మళ్ళీ మననం చేసుకుంటున్నాది. అంత చిన్నపిల్లకు అది చాలాపెద్ద వాక్యమే. కాని రకూగో హాస్య కథలోని నాయకుడి పేరు కంటే పొడవైంది కాదు. ఆకథా నాయకుడు బావిలో పడ్డాడు. అతడ్ని బయటికి తియ్యడానికి వచ్చినవాళ్ళు పేరు అడిగారు.

ఆతడు పేరు పూర్తిచేసే లోపే మునిగి పోయాడు. అతని పేరు అంత పొడుగైంది అన్నమాట.

టోటోచాన్‌కు ఆవాక్యం మర్చిపోతానేమోననే భయంకలిగింది. అందుకే మరో ఆలోచనను రానివ్వడం ఇష్టంలేదు. అందుకే ఎవరితోనూ మాట్లాడకుండా పరుగు తీసింది. అదృష్టం కొద్దీ రైల్లో కూడా ఎవరూ టోటోచాన్‌ను పలకరించలేదు.

"అబ్బ అది ఎంత బాగుందో! అది ఏమిటో!" అనేలాంటి ప్రలోభాలకు లొంగ కుండా స్టేషన్ చేరుకుంది. కాని రైలుదిగి వస్తుండగా ఒకతను "అప్పుడే స్కూలు అయిపోయిందా పాపా?" అన్నాడు. టోటోచాన్‌కి బదులు చెబితే తను మననం చేసుకొనే మాటలు ఆబదులు చెప్పే మాటల్లో కలిసిపోయి గజిబిజిగా అయిపోతాయని పించింది. బదులు చెప్పకుండా చిరునవ్వు నవ్వి ముందుకు పరుగు తీసింది.

ఇంట్లో అడుగు పెడ్తూనే గావుకేకపెట్టింది.

"అమ్మా మరే! గర్జించే పేముతోటలో వనభోజనాలు" అని అరిచింది. ఆమె తల్లి ఆశ్చర్యపోయింది. అదేమిటి? జూడోలో అరిచే అరుపా? లేక నలభయ్ ఏడుగురు రొనిన్లు ఇచ్చిన స్లోగనా? ఆమెకు ఒక విషయం గుర్తొచ్చింది. జియుగొకా స్టేషన్ తరవాత, మూడు స్టేషన్లు దాటితే టోడోరొకి స్టేషన్ వస్తుంది. ఆ స్టేషన్ దగ్గరగా ఒక స్థలం వుంది. దాన్ని గర్జించే పేముతోట అంటారు. పాత టోక్యో నగరంలో ప్రసిద్ధి కెక్కిన ప్రదేశాలలో అదొకటి. అక్కడ ఒక జలపాతం ఉంది. ఒక సెలయేరు ఉంది. ఆకర్షణీయమైన అడవివుంది. వనభోజనం అంటే పిల్లలు అక్కడ వండుకొని తినబోతున్నారన్న మాట. తల్లికి అద్భుతంగా అన్పించింది. పిల్లలకు ఒక దానిమీద అభిరుచి కలిగితే, దేన్నయినా సులువుగా నేర్చుకోగలరు అనుకుంది.

అంత కష్టమైన వాక్యాన్ని అంతవరకు నోట్లో భద్రంగా పెట్టుకొని, తల్లిముందు వదిలెయ్యగానే, ఊపిరిపీల్చినట్టు హాయిగా, అన్పించింది. టోటోచాన్‌కు. ఉక్కిరిబిక్కిరి అవుతూ తల్లికి ఎన్నో విషయాలు చెప్పింది. వచ్చే శుక్రవారం పిల్లలందరూ బడిదగ్గర గుమిగూడాలి. ఒక చారుగిన్నె, ఒక అన్నంగిన్నె, చాంప్‌స్టిక్స్, ఒక కప్పుబియ్యం తీసుకువెళ్ళాలి. "ఒక కప్పుబియ్యం

వండితే రెండుకప్పులు అన్నం అవుతుందంటగా? మా హెడ్‌మాస్టరు చెప్పాడమ్మా!" అంది. "సీమపంది వులుసుకూడా చేయబోతున్నాం. సీమ పంది ముక్కలు, కూరగాయలు కావాలి. కావాలంటే మధ్యాహ్నానికి ఏదైనా టిఫెన్ తీసుకువెళ్ళవచ్చంట."

ఆ తర్వాత కొన్నిరోజులు ఆపిల్ల వంటగదిలో తల్లిని గమనిస్తూ వుండసాగింది. కత్తిని ఎలా ఉపయోగిస్తుందో, కూరగాయలు ఎంతెంత ముక్కలు కోస్తుందో గమనించసాగింది. పాత్రల్ని ఎలా పట్టుకుంటుందో, ఎలా వడ్డిస్తుందో కూడా శ్రద్ధగా చూడసాగింది. తల్లి వంటగదిలో పని చేస్తుంటే



చూట్టానికి ముచ్చటపడిపోయింది. ముఖ్యంగా వేడి గిన్నె పట్టుకొన్నప్పుడు "అబ్బ! కాలింది" అని తనవేళ్లను చెవువెనక ఆనించుకున్నప్పుడు, బలేసర్దాగా వుందని పించేది.

ఒకసారి అలా ఎందుకు చెయ్యాలో అమ్మ చెప్పింది-"చెవులు చల్లగా వుంటాయిగా? అందుకే!"

తల్లి హావభావాలు ఆపిల్ల మనసు మీద బాగా ముద్రవేసుకున్నాయి. "గర్జించే పేము తోటలో వనభోజనాలు చేస్తున్నప్పుడు నేను కూడా అచ్చం అమ్మలాగే చేస్తాను," తనలో తనే అనుకుంది.

శుక్రవారం వచ్చేసింది. రైలు దిగి గర్జించే పేముతోటకు చేరారు. అందరూ అడవిలో గుమిగూడారు. సూర్యకాంతి ఆకుల మధ్యనుంచి జాలువారుతున్నాది. పసివాళ్ళ ముఖాలు ఆవెలుగులో మెరిసిపోతున్నాయి. నిండుగావున్న సంచుల్ని భుజాలకు తగిలించు కొని హెడ్‌మాస్టరు చెప్పబోయేదాన్ని వినడానికి సిద్ధంగా వున్నట్టుగా నిలబడ్డారు. వాళ్ళ వెనకనుంచి జలపాతపు ప్రవాహధ్వని విన్పిస్తోంది.

"పిల్లలూ వినండి. మొట్టమొదట మనం గ్రూపులుగా విడిపోదాం. టీచర్స్ తీసుకొచ్చిన ఇటుకలతో పొయ్యిలు తయారు చేసుకుందాం. మీలో కొందరు ఏటి నీటితో బియ్యం కడగండి. కడిగిన బియ్యం పొయ్యిమీద పెట్టి అన్నం వండుదాం. సీమ పంది సూపు కూడా చేసుకుందాం. సరే! కదలండి-ఇక మొదలు పెడదాం," అన్నాడు హెడ్‌మాస్టరు.

"రాయి-కాగితం-కత్తెర" ఆటోలోలాగ పిల్లలు ఆరు గ్రూపులుగా విడిపోయారు. మొత్తం ఏభయ్‌మందే కావడంవల్ల ఆరుగ్రూపులుగా సులభంగానే విడిపోయారు. అక్కడి కక్కడే గోతులు తవ్వారు. ఇటుకలతో పొయ్యిలు తయారు చేశారు. ఆ ఇటుకల మీద పాత్రలు పెట్టడానికి అనువుగా ఇనుపకడ్డీలను అమర్చారు. కొందరు అడవిలోనుంచి ఎండుపుల్లలు ఏరుకొచ్చారు. పిల్లలందరూ తమకు తామే పనుల్ని విభజించుకున్నారు. టోటోచాన్‌కూరగాయలు తరుగుతానంది. సీమపంది సూపుకూడా తనేతయారు చేస్తానంది. టోటోచాన్ కంటే రెండుక్లాసులు పైన వున్న కుర్రాడికి కూడా కూరగాయలు తరిగే పని అప్పగించారు. కాని ఆని అబ్బాయి పెద్దపెద్ద ముక్కలు

తరిగాడు. మళ్లీ మరీ చిన్నముక్కలు తరిగాడు. మొత్తం మీద కూరముక్కలు బాగా తరగలేదు. ఆ అబ్బాయి ముక్కు మీద చెమటచుక్కలు ముత్యాల్లా మెరుస్తున్నాయి. టోటోచాన్ కూరముక్కలు అచ్చంతన తల్లికోసినట్టే కోస్తున్నది. వంకాయలు, బంగాళాదుంపలు, ఉల్లిపాయలు, చక్కగాతరిగింది. వంకాయల్ని దోసకాయల్నీ సన్నసన్న ముక్కలుగా తరిగి వాటికి ఉప్పు అద్ది పెట్టింది. తన కంటే పెద్ద పిల్లలు పనులు చేతకాక తికమక పడుతూవుంటే, వాళ్లకు సలహాలు ఇచ్చింది. తను అచ్చం అమ్మలా అయిపోయాననుకుంది. టోటోచాన్ ఉప్పు అద్దినముక్కలు అందరికీ నచ్చాయి.

"అసలు నాకు చేతనవుతుందో లేదో చేసి చూద్దామనుకున్నాను," అంది టోటోచాన్ మర్యాదను పాటిస్తూ.

సీమపంది సూపువాసన అందరూ బలేవుంది అన్నారు. కిలకినవ్వులు కేరింతలు. చెట్లమీది పిట్టలు కూడా కలకలధ్వనులు చేశాయి. ఈలోపల వంటకాల వాసనలు గుబాళించాయి. ఇంతవరకూ వాళ్ళకు తెలిసింది బల్లమీద పెట్టిన పదార్థాలు తినడమే. స్వయంగా కష్టపడి వండడంలో చిత్రమైన అనుభూతిని పొందారు.

వంటపూర్తి అయింది. హెడ్‌మాస్టరు, పిల్లలు గడ్డిమీద వలయాకారంగా కూర్చోడానికి అనువుగా ఆ ప్రదేశాన్ని శుభ్రం చేయించాడు. ప్రతిబృందం ముందు ఒక అన్నంగిన్నె, ఒకసూపుగిన్నె పెట్టాడు. టోటోచాన్ ముందు సూపుగిన్నెను దించనివ్వలేదు. మూత తియ్యబోయి "అబ్బ! కాలింది" అని వేళ్ళను చెవు వెనక ఆనించుకుంది. ఆతర్వాతే పొయ్యి మీది నుంచి తను తయారు చేసిన సూపుగిన్నెను దించడానికి అంగీకరించింది. ముందు అలా ఆపడం ఎవరికీ నచ్చ లేదు. కాని అందువల్ల టోటోచాన్‌కు మాత్రం చాలా సంతృప్తి కలిగింది.

పిల్లలకు మహా ఆకలిగా వుంది. ఎదురుగా ఘుమఘుమ లాడుతున్న సూపుగిన్నెవుంది. అది స్వయంగా వాళ్ళు తయారు చేసుకున్న భోజనం.

పిల్లలందరూ నములు, నములు, నములు, అన్నీబాగా నములు అనిపాడి "ఇటాడాకిమాను" అన్నారు. ఆ తర్వాత ఆ అడవిలో అంతా నిశ్శబ్దమే! ఒక జలపాతం చేసేధ్వని మాత్రం వినిపిస్తోంది.

## "నువ్వు నిజంగా మంచిపిల్లవు!"

"నువ్వు నిజంగానే మంచి పిల్లవు తెలుసా?"

టోటోచాన్ కన్పించినప్పుడల్లా హెడ్‌మాస్టరు అనేవాడు. అతను అలా అన్నప్పుడల్లా చిరునవ్వు నవ్వి చిన్నగంతేసి "అవును. నేను మంచిపిల్లను," అనేది. ఆయన మాటను పూర్తిగానమ్మింది.

టోటోచాన్ నిజంగానే ఎన్నో విధాల మంచి పిల్లే! అందరితో మంచిగా వుండేది. ముఖంగా అంగవైకల్యం కలిగిన స్నేహితులతో చాలా సున్నితంగా ప్రవర్తించేది. ఇతరబడి పిల్లలు వాళ్ళతో కఠినంగా ప్రవర్తిస్తే, టోటోచాన్ ఊరుకునేదికాదు. పోట్లాటకు దిగేది. ఒక్కోసారి ఆ వివాదం టోటోచాన్ ఏడ్పుతోగాని అంతం అయేదికాదు. ఏప్రాణికి దెబ్బ తగిలినా టోటోచాన్ దాని శుశ్రూష చేసేది. అన్నింటికంటే టీచర్లకు ఆశ్చర్యం కలిగించే విషయం ఏమిటంటే-టోటోచాన్ కుతుహలంతో అనేక సార్లు ప్రమాదంలో చిక్కుకోవడం.

టోటోచాన్‌కు ఉదయం పూట అసెంబ్లీహాలులోకి వెళ్ళేప్పుడు ఒక చిత్రమైన అలవాటు వుండేది. తన రెండు పిలకజడల్ని వెనక నుంచి చంకల్లోకి ఇరికించుకొని నడిచేది. ఒకసారి టోటోచాన్‌కు అసెంబ్లీహాలు ఊడ్చే పనిపడింది. ఆగదిలో రహస్యంగా వుండే తలుపు ఒకటి, నిరంతరం వింతకోసం వెదికే ఆ పిల్లకళ్లల్లో పడింది. ఇంకేం దాన్ని తెరిచి ఆ చెత్తంతా ఆరంధ్రంలో పడేసింది. తలుపు తెరవగలిగింది. కాని మళ్ళీ దాన్ని మొయ్యలేక పోయింది. పిల్లలందరూ సహాయం చేసినా అదిమూసుకోలేదు. దాంతో చాలా ఇబ్బంది పడాల్సివచ్చింది. దుకాణాల్లో మాంసాన్ని ఎలా వేలాడ దీస్తారో టోటోచాన్ ఒకసారి విన్నది. అంతే! ఏం చేసిందో తెలుసా? బళ్లో ఎక్సర్ సైజు చేసేకడ్డీకి ఒక చేత్తో వేలాడింది అలా ఎంత సేపు వేలాడిందో ఆ పిల్లకే తెలియదు. "ఏం చేస్తున్నావక్కడ?" ఎవరో అడిగారు. "మరే! నేను ఇవ్వాళ ఒక మాంసం ముక్కనట అంటూండగానే చెయ్యి పట్టు తప్పి కిందపడిపోయింది. పక్క ఎముకలకు బాగా తెబ్బతగిలింది. ఆరోజంతా మాట్లాడ లేక పోయింది. మురికి గుంటలో ఎలాపడిందో మనకు తెలిసిందే!"

టోటోచాన్ ఎప్పుడూ ఇలాంటి పనులేచేస్తుండేది. దెబ్బలు తగిలించుకునేది

కాని హెడ్‌మాస్టరెప్పుడూ మీ పిల్ల ఇలాచేస్తుందని తల్లి దండ్రులకు కబురు చెయ్యలేదు.

అలాంటి విషయాలు పిల్లల మధ్యా-హెడ్‌మాస్టర్ మధ్యా పరిష్కారం అయిపోయేవి. పిల్లలు చెప్పే విషయాలను హెడ్‌మాస్టరు ఓపిగ్గా ఎంత సేపైనా వినేవాడు. వాళ్ళు చెప్పే సాకుల్ని కూడా శ్రద్ధగా వినేవాడు. పిల్లలతో నువ్వు చేసింది తప్పు. అని ఆయన అనేవాడు కాదు. వాళ్ళే గుర్తించి తప్పుచేసినట్టు ఒప్పుకుంటే మాత్రం "క్షమాపణ అడుగు" అనేవాడు.

టోటోచాన్ ప్రవర్తన గురించి ఇతర పిల్లల తల్లి దండ్రులకు అనేక సందేహాలు వుండేవి. భయాలు కూడా వుండేవి. ఆ విషయం హెడ్‌మాస్టరుకు తెలుసు.

అందుకే టోటోచాన్ కన్పించినప్పుడల్లా ఆయన "నువ్వు నిజంగా చాలా మంచి పిల్లవు, తెలుసా?" అనేవాడు. ఆయన అలా అంటున్నప్పుడు 'నిజంగా' అన్నమాటనునొక్కి మరీ అనేవాడు.

"నువ్వు అంత మంచి పిల్లవు కావని చాలా మంది అనుకోవచ్చు. కాని నువ్వు నిజంగా మంచి పిల్లవు. నీ స్వభావంలోని మంచితనాన్ని నేను గుర్తించాను తెలుసా?" అని చెప్పడానికి హెడ్‌మాస్టరు ప్రయత్నించేవాడు. కాని టోటోచాన్ ఆ విషయం గుర్తించటానికి చాలా కాలం పట్టింది. ఏది ఏమైనా ఆపిల్లలో "తను చాలా మంచి పిల్ల" అనే నమ్మకాన్ని కలిగించాడు హెడ్‌మాస్టరు. ఏదైనా సాహసం చేస్తున్నప్పుడు హెడ్‌మాస్టరు అన్న మాటలు గుర్తొచ్చేవి. చాలా సార్లు తను చేసిన పనిని గురించి ఆ తర్వాత ఆలోచించు కొనేది. ఆ మాటలు టోటోచాన్ జీవితానికి బాటలు వేశాయి.

"టోటో! నువ్వు నిజంగా చాలా మంచి పిల్లవు, తెలుసా?"

## పెళ్ళి కూతురు

టోటోచాన్‌కు చాలా బాధగావుంది.

ఇప్పుడు మూడో తరగతిలోవుంది. ఆమెకు టాయిచాన్ అంటే చాలాచాలా ఇష్టం. ఆపిల్లవాడు తెలివైనవాడు. భౌతిక శాస్త్రంలో గట్టివాడు. ఇంగ్లీషు కూడా

చదివాడు. ఇంగ్లీషులో నక్కను ఏమంటారో టోటోచాన్‌కు నేర్పించాడు.

"నక్కను ఇంగ్లీషులో ఏమంటారో తెలుసా? ఫాక్స్ అంటారు."

"ఫాక్సా?"

"ఫాక్స్! ఫాక్స్" ఆపదం టోటోచాన్‌కు బలేగా నచ్చింది. ఆరోజంతా మననం చేసుకుంటూనేవుంది. ఆరోజు నుంచి టోటోచాన్ బడికి వెళ్ళగానే ఆ పిల్లవాడి పెన్సిళ్లు చక్కగా చెక్కి పెట్టేది. తన పెన్సిళ్ల గురించి మాత్రం పట్టించుకోనేది కాదు. పళ్లతో కొరికి రాయడానికి అనుకూలంగా చేసుకొనేది.

ఇంత చేసినా టాయిచాన్ మాత్రం టోటోచాన్‌తో కటువుగా మాట్లాడేవాడు. ఆసంఘటన ఒకరోజు మధ్యాహ్నపు భోజనాల సమయంలో జరిగింది. వెనక భాగంలోని మురికిగుంట దగ్గర టోటోచాన్ పచార్లు చేస్తున్నది.



"టోటోచాన్!"

గొంతు కటువుగా వుంది. టోటోచాన్ ఉలిక్కిపడి ఆగి పోయింది. కోపంతో రొప్పిపోతున్నాడు "టోటోచాన్. నేను పెద్దవాణ్ణి అయ్యాక నిన్ను మాత్రం పెళ్ళి చేసుకోను. నువ్వెంత బతిమాలినా చేసుకోను. తెలుసా!" గబగబా అనేసి గిర్రున తిరిగి వెళ్ళిపోయాడు టాయిచాన్.

టోటోచాన్ తెల్లబోయి నిలబడి పోయింది.

ఆ పెద్దతల కన్పించేంతవరకూ అలా చూస్తునేవుండిపోయింది. ఎన్నో తెలివితేటలతో నిండివుండే ఆ తలంటే ఆ పిల్లకు ఎంతో ఇష్టం. టాయిచాన్ తలపెద్దగా వుంటుంది. శరీరం చిన్నగావుంటుంది. అందుకే పిల్లలు, "గుమ్మడికాయితల" అనేవాళ్లు.

టోటోచాన్ జేబుల్లో చేతులు దూర్చి, నిల్చుని చాలాసేవు ఆలోచించింది. టాయిచాన్‌కు కోపం తెప్పించేపని తనేం చేసిందో అర్థం కాలేదు. ఆ విషయం మియోచాన్ దగ్గర అన్నది. మియోచాన్ టోటోచాన్ చెప్పింది విన్నది. పెద్ద ఆరిందాయిలా "ఏమైవుంటుందో చెబుతాను. నువ్వు సుమో కుస్తీ పోటీల్లో టాయిచాన్‌ను రింగునుంచి తోసేశావు. అతడి తలేమో గుమ్మడి కాయం తుందాయె బయటపడ్డాడు ఆబరువుకు. అందుకే నీమీద వుండి పోతున్నాడు," అన్నది.

టోటోచాన్ పశ్చాత్తాపడింది. రోజూ పెన్సిళ్లు చెక్కి ఇస్తుంది. అంతలో తను ఇష్టపడే అబ్బాయిని, రింగు బయటికి ఎందుకు తోసేసిందో? ఏమైనా ఆలస్యం అయిపోయింది. ఇకతను టాయిచాన్‌కు పెళ్లి కూతురు అయే అవకాశంలేదు.

"కాని నేను రోజూ అతడి పెన్సిళ్లు చెక్కిపెడుతూనే వుంటాను. మరి నేను ఆ అబ్బాయిని ప్రేమిస్తున్నానుగా?" అనుకుంది టోటోచాన్.

## మురికొట్టుకు పోయిన పాతబడి

ప్రాథమిక విద్యార్థులందరికీ తెలిసిన ఒకపాట వుండేది. అది చాలా గమ్మత్తుగావుండేది. ఒక పల్లవిని పోలివుండేది. టోటోచాన్ మొదటి బడి

పిల్లలు ఆ పాట పాడుతూ వుండేవాళ్ళు. పుస్తకాలసంచులు భుజాన వేసుకొని ఇంటికి వెళుతూ, వెనక్కి తిరిగి బడిని చూస్తూ ఆ పాట పాడేవాళ్లు.

అకమట్సు మురికి కొట్టుకు పోయిన పాతబడి లోపలేమో అద్భుతమైన గొప్పబడి. ఆస్కూలు ముందు నుంచి వెళ్ళే వేరేబడి పిల్లలు చేతులెత్తి దాన్ని చూపిస్తూ:

బయటేమో అద్భుతమైన గొప్పబడి లోపల మురికి కొట్టుకు పోయిన పాతబడి అనిపాడేవాళ్లు. పాట ముగించి గోలగా అరిచేవాళ్లు.

అసలు ఈపాట సారాంశం ఏమిటంటే-బడిమంచిదా చెడ్డదా అని భవనం చూసి చెప్పకూడదు. లోపలబడి ఎలా నడుస్తుందనేది ముఖ్యం అని.

ఒకరోజు సాయంకాలం బడి వదిలాక పిల్లలందరూ ఆడుకుంటున్నారు. చివరి గంట మోగేంత వరకూ పిల్లలు వాళ్ల ఇష్టం వచ్చిన ఆటలు ఆడుకోవచ్చు. చివరి గంట మోగగానే బడివదిలి వెళ్ళిపోవాలి. వేరే స్కూళ్లల్లో కంటే ఈ స్కూల్లో చివరి పీరియడ్ పెద్దదిగా వుండేది. ఆరోజు కొందరు పిల్లలు బంతి ఆట ఆడుతున్నారు. మరికొందరు ఇనుప కడ్డీలతో ఆడుతున్నారు. ఇంకా కొందరు ఇసుక కుప్పల మీద ఆడుతున్నారు. పెద్దపిల్లలు కొందరు మెట్లమీద కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు. కొందరు చెట్లు ఎక్కుతున్నారు. టాయిచాన్ గదిలోనే వుండిపోయాడు. భౌతికశాస్త్రానికి సంబంధించి ప్రయోగం ఏదో చేస్తున్నాడు. అతనిలాగే మరికొందరు పిల్లలు కూడా తరగతి గదుల్లోనే ఉండి పోయారు. వాళ్ళు గాజు కుప్పెల్లో ఏదో మరగపెడ్తున్నారు. ప్రయోగాలు చేస్తున్నారు. మరి కొందరు. లైబ్రెరీలో కూర్చుని చదువుకుంటున్నారు.

అకస్మాత్తుగా బయటి నుంచి పాట విన్పించింది:

"టోమోబడి పాతబడింది-మురిగ్గావుంది లోపల కూడా పాతబడింది-మురిగ్గావుంది."

ఆ సమయంలో టోటోచాన్ గేటులోనే నిల్చునివుంది. గేటంటే మామూలు గేటుకాదు. రెండువైపుల స్తంభాల్లావున్న చెట్లు ఆకులతో నిండుగా వున్నాయి. ఆపాటవిని చాలాఘోరం అనుకుంది. తమబడిలోపలా, బయటా పాతబడి పోయిందా? మురిగ్గావుందా? కోపం వచ్చేసింది. మిగాతా పిల్లలకు కూడా కోపం వచ్చింది. అందరూ గేటుకేసి పరిగెత్తారు. గోలచేస్తున్న పిల్లలు

"పాతబడింది-మురిగ్గావుంది" అనిపాడుతూ పరిగెత్తసాగారు.

టోటోచాన్ కోపంతో వాళ్ళవెనకే పరుగు తీసింది. వెనకా ముందూ చూసుకోకుండా వాళ్ళను తరుముతూ పరుగుతీసింది. ఒక్కతే పరుగుతీసింది. ఆ పిల్లలు చాలా వేగంగా పరిగెత్తు తున్నారు. మలుపు తిరిగి క్షణంలో మాయం అయిపోయారు. టోటోచాన్ వెనక్కి తిరిగివచ్చింది. అలానడుస్తూ నడుస్తూనే ఒక పాట కట్టింది—

అద్భుతం! టోమోబడి అద్భుతం!

లోపలా బయటాకూడా అద్భుతం!

తన పాట తనకే ఎంతో బాగుందని పించింది. సంతోషం కలిగింది. తను ఎక్కడ్నుంచోవచ్చినట్టుగా చెట్లగుబురు చాటు నుంచి గొంతెత్తిపాడసాగింది.

"అద్భుతం! టోమో బడి అద్భుతం!"

ఆడుకుంటున్న పిల్లలకు పాడుతుందెవరో వెంటనే తెలియలేదు. అది టోటోచాన్ గొంతు అని గుర్తు పట్టగానే, వాళ్ళు ఆమెగొంతులో గొంతు కలిపి పాడసాగారు. అన్నిగొంతులూ కలిసి ఒకే గొంతుగా పైకెగసింది. పిల్లలంతా అలా పాడుతూ స్కూలుచుట్టూ తిరుగుతున్నారు.

తనగదిలో కూర్చుని ఆ పాటవింటున్న హెడ్‌మాస్టరు గుండె సంతోషంతో ఎంతగా పొంగిపోయిందో ఆపసివాళ్ళకు తెలియదు.

ఏ టీచరుకైనా అలాంటి ఆనందమే కలుగుతుందేమో? కాని పిల్లలపట్ల ప్రత్యేకమైన శ్రద్ధగల వాళ్ళకు బడి నడపడం తేలికైన పనికాదు. టోమోలో అంతా అసాధారణంగానే వుంటుంది కనక ఇక్కడ మరీ ఎక్కువ సమస్యల్ని ఎదుర్కోవాల్సివుంటుంది. ఎన్నెన్ని విమర్శల్ని ఎదుర్కోవాలి?

అటువంటి బడిని నడుపుతున్న హెడ్‌మాస్టరుకు చిన్నారుల అభిమానం అందినప్పుడు కలిగే ఆనందమే ఆనందం.

ఆరోజు చివరిగంట బాగా ఆలస్యంగా మోగింది.

## జుత్తు రిబ్బన్

అది మధ్యాహ్నం భోజనాల సమయం. పిల్లలందరూ భోజనాలు పూర్తి చేశారు.

టోటోచాన్ అసెంబ్లీహాలులో గంతు లేస్తున్నది. హెడ్‌మాస్టరు ఎదురుపడ్డారు.

"నువ్విక్కడున్నావా? నేను నీకోసమే వెదుకు తున్నాను. నిన్ను ఒకటి అడగనా?"

"అడగండి" ఆనందంగా అన్నది. హెడ్‌మాస్టరు తననుంచి ఏదో తెలుసుకోవాలను కుంటున్నట్టుగా అన్పించింది.

"నీ కా రిబ్బన్ ఎక్కడ దొరికింది?"

టోటోచాన్ ముఖం వెలాతెలాపోయింది. తను ఆ రిబ్బన్ నిన్నటి నుంచికట్టుకుంటున్నది. దీన్ని తనే సంపాదించుకుంది. హెడ్‌మాస్టరుకు రిబ్బన్ బాగా కన్పించేలా దగ్గర కెళ్ళి, నిలబడింది.

"ఇది మా అత్తయ్య పాతస్కూలు యూనిఫారం మీద వుంది. మా అత్తయ్య ఆ దుస్తుల్ని బీరువాలో పెడ్తుండగా దీన్ని చూశాను. అత్త నాకు ఇచ్చేసింది. నేను అన్నీ చాలా శ్రద్ధగా గమనిస్తానని మా అత్తయ్య అంది," గర్వంగా చెప్పింది.

"అట్లాగా?" అన్నాడు హెడ్‌మాస్టరు ఏదో ఆలోచిస్తూ.

తను ఆ రిబ్బను అత్త దగ్గిర ఎలా సంపాదించిందో వివరంగా చెప్పింది.

టోటోచాన్ చూపుల్లో ఆరిబ్బన్ మీద ఆ పిల్లకు ఎంత మోజువుందో చూడగలిగింది. వాళ్ళ అత్తయ్య.

"ఈ రిబ్బన్ కావాలా? ఇవ్వనా? ఎట్లాగూ నేనింక ఆ పాత గౌనులేసు కోనుగా?" అంటూ అత్తయ్య కత్తెర పట్టుకొచ్చింది. దారం కత్తిరించి రిబ్బన్ టోటోచాన్‌కు ఇచ్చింది.

కథంతా విన్నాడు హెడ్‌మాస్టరు. కాని ఆయనకు ఆ కథ తృప్తిని కలిగించిన ట్టుగాలేదు.

"అదన్న మాట. నిన్న మియోచాన్ నీ రిబ్బన్ లాంటిదే కావాలంది. అన్నిదుకాణాలూ తిరిగాను. కాని దొరకలేదు. ఇది విదేశాలనుంచి వచ్చిన రిబ్బను. అదీ అసలు సంగతి" అన్నాడు హెడ్‌మాస్టరు.

అప్పుడు ఆయన ముఖం హెడ్‌మాస్టరు ముఖంలా లేదు. కూతురి కోర్కె తీర్చలేని ఒక తండ్రిముఖంలా ఉంది.

"టోటోచాన్! రేపట్నుంచి ఈ రిబ్బన్ బడికి వచ్చేప్పుడు కట్టుకు రాకపోతే

మంచిది. మియోచాన్ గురించి నీకు తెలుసుగా? ఇక రోజూ నా ప్రాణాలు తోడేస్తుంది."

టోటోచాన్ చేతులు కట్టుకొని కొద్దినిముషాలు ఆలోచించింది.

"అలాగే! అలాగే! ఇంకెప్పుడూ ఈ రిబ్బన్ కట్టుకొని బడికిరాను," అంది.

"థ్యాంక్యు" అన్నాడు హెడ్‌మాస్టరు.

టోటోచాన్‌కు బాధగానే ఉంది. కాని హెడ్‌మాస్టరు కూడా ఇబ్బందిలో వున్నాడు. అంత పెద్ద హెడ్‌మాస్టరు, తన రిబ్బన్‌లాంటి రిబ్బన్ కోసం దుకాణాలన్నీ తిరిగాడంటే జాలిలేసింది. ఒకరి సమస్యల్ని ఒకరు, వయసులతో నిమిత్తం లేకుండా, అర్థం చేసుకొని ప్రవర్తించడమే టోమోలోని విశేషం, అది అక్కడ చాలా సహజమైన విషయం.

మర్నాడు టోటోచాన్ స్కూలుకు వెళ్ళాక, తల్లి గది శుభ్రం చెయ్యడానికి వచ్చింది. టోటోచాన్‌కు చాలా ఇష్టమైన ఎలుగు బంటి మెడలో ఆ రిబ్బన్‌ను అంత త్వరగా ఎందుకు వదిలేసిందో ఆమెకు అర్థం కాలేదు. అకస్మాత్తుగా అంత అందమైన రిబ్బన్ మెడలో పడినందుకు ఆ ఎలుగుబంటి సిగ్గుపడుతున్నట్టుగా తోచింది ఆమెకు.

## దెబ్బలు తగిలిన వాళ్ళని పరామర్శ

టోటో చాన్ అది మొదటి సారిగా ఒక ఆసుపత్రి చూడడం. అక్కడ దెబ్బలు తగిలిన సైనికులున్నారు. విభిన్న ప్రాథమిక పాఠశాలల నుంచి వచ్చిన విద్యార్థులతో కలిసి వెళ్ళింది. వాళ్ళు మొత్తం ముప్పయ్ మంది. ఆపిల్లలతో టోటోచాన్‌కు అంతకు ముందు పరిచయంలేదు. ఒక జాతీయ పథకంలోని కార్యక్రమంగా ఈ ఏర్పాటు చేయడం జరిగింది. పెద్ద పాఠశాలల నుంచి ఇద్దరూ, ముగ్గురూ-వచ్చినా, టోమోలాంటి చిన్న బళ్లనుంచి ఒక్కొక్కరు మాత్రమే వచ్చారు. టోటోచాన్‌ను టోమోతరపున పంపించారు.

ఈ బృందానికి పర్యవేక్షకురాలిగా ఒక టీచర్ ఉంది. ఆమె బక్క పల్చగా వుంది. కళ్ళ జోడు పెట్టుకుంది. పిల్లలందర్నీ ఒక వార్డులోకి తీసువెళ్ళింది. ఆవార్డులో పదిహేను మంది సైనికులు ఉన్నారు. అందులో కొందరు మంచాల

మీాద పడుకొనివున్నారు. మరికొందరు అటూ ఇటూ పచార్లు చేస్తున్నారు. గాయపడిన సైనికులంటే ఎలావుంటారోనని భయపడింది టోటోచాన్- వాళ్ళందరూ చిరునవ్వులతో చేతులు ఊపడం, సంతోషంగా కన్పించడం టోటోచాన్‌కు సంతృప్తిని కలిగించింది. ఇంకా కొందరి తలలకు కట్లు కూడా ఉన్నాయి.

టీచర్ పిల్లల్ని వాళ్ళ మధ్యలోకి చేర్చింది. వాళ్ళను ఉద్దేశించి అన్నది- "మేం మిమ్మల్ని చూడ డానికి వచ్చాం."

పిల్లలందరూ వంగి సైనికులకు అభివాదం చేశారు. 'ఇవ్వాళ మే ఐదవ తేదీ. బాలలదినం. కనక మేం మీకు 'కార్ప్‌స్ట్రీమర్స్' పాట వినిపిస్తాం."

మ్యూజిక్ డైరెక్టరులా టీచర్ రెండు చేతులూ పైకీ కిందకూ ఊపుతూ పిల్లలతో "సిద్ధంగా వున్నరా? మూడు... నాలుగు..." అంటూ తాళం వెయ్యసాగింది.

పిల్లలందరూ ఏకకంఠంతో పాట అందుకున్నారు.

"ఇళ్ల కప్పుల సముద్రంపైనా"

"చిక్కని మబ్బుల సముద్రంపైనా"

టోటోచాన్‌కు ఈ పాటరాదు. టోమోలో ఇలాంటి పాటలు నేర్పించరు. అందుకే ఒక సైనికుడి మంచం పట్టెమీద కూర్చుని ఇతర పిల్లలు పాడడం విన సాగింది. అలా తోటి పిల్లలతో కలిసి పాడకుండా కూర్చోవడం కొంచెం ఇబ్బందిగానే వుంది. అపాట పూర్తికాగానే "ఇప్పుడు మెమ్మొల పండుగ పాటపాడదాం," అన్నది టీచర్. అందరూ ఆపాట కూడా ఎంతో మధురంగా పాడారు. పాడలేక పోయింది టోటోచాన్ ఒక్కత్తే.

"రండి లాంతర్లు వెలిగిద్దాం
ఒక్కొక్కటిగా వెలిగిద్దాం."

పిల్లల పాటపూర్తి అవగానే సైనికులు చప్పట్లు కొట్టారు. టీచర్ సంతోషంగా నవ్వింది. మరిప్పుడు 'గుర్రంపిల్ల-తల్లి' పాట పాడదామా అంది. టోటోచాన్‌కు ఈ పాట కూడా రాదు. మిగతా పిల్లలు పాట అందుకున్నారు. పాటముగిసింది. టోటోచాన్ కూర్చున్న మంచం తాలుకు సైనికుడు, ఆ పిల్ల తల నిమురుతూ "ఏం పాపా నువ్వుపాడడం లేదేం?" అని అడిగాడు,

టోటోచాన్‌కు తనేదో పెద్ద తప్పు చేసినట్టుగా అన్పించింది. తను వచ్చింది దెబ్బలు తగిలిన సైనికులను ఓదార్చడానికి కాని వాళ్ళకోసం ఒక్క పాటైనా పాడకపోతే ఎట్లా? చివ్వున లేచింది మంచంమీదనుంచి, కొంచెం దూరంగా వెళ్ళి నిలబడింది. "నేను ఇప్పుడు నాకు వచ్చిన పాటపాడతాను." అంది.

"ఏపాట పాడబోతున్నావ్!" టీచర్ అడిగింది. కాని అప్పటికే టోటోచాన్ గొంతు సవరించుకొని పాడడానికి సిద్ధం అయిపోయింది. టీచర్ మళ్ళీ ప్రశ్నించ దల్చుకోలేదు.

తను టోమోనుంచి వచ్చింది. అందువల్ల టోమోలో ముఖ్యంగా పాడేపాటనే పాడాలనుకుంది. గట్టిగా గాలిపీల్చుకుంది. గొంతుఎత్తింది.

"నములు, నములు, నములు, బాగా నమిలితిను
అన్నం నములు-అన్నంనములు-నములు-నములు"

కొందరు పిల్లలు గొల్లున నవ్వారు. కొందరు పక్కవాళ్ళతో "అదేం పాట? ఇదిపాటా?" అంటున్నారు. టీచర్ తాళం వెయ్యడం ప్రారంభించి మధ్యలోనే ఆపేసింది. టోటోచాన్‌కు సిగ్గు వేసింది. ఏమైనా సరే పాట పూర్తిగా పాడెయ్యాల్సిందే అనుకుంది.

"నములు నములు-అన్నీ నములు
మాంసం నములు-చేపలు నములు"

పాట పూర్తి చేసి, తలవంచి అభివాదం చేసి నిటారుగానిల్చుంది. ఎదురుగా వున్న సైనికుని బుగ్గలమీదుగా కన్నీళ్లు కారిపోతున్నాయి. టోటోచాన్ తనే దో తప్పు చేశాననుకుంది. మనసు చిన్నపోయింది. ఆసైనికుడు తన తండ్రికంటే కొంచెం పెద్దవాడే అనుకుంది. ఆ సైనికుడు టోటోచాన్ తలనిమురుతూ "థ్యాంక్యూ పాపా! థ్యాంక్యూ!" అన్నాడు. ఆసైనికుడు దుఃఖం ఆపుకోలేకపోతున్నాడు, టోటోచాన్ తలనిమురుతూనే ఉన్నాడు.

"పాటలు అయిపోయాయి: ఇక మనం సైనికుల కొరకు రాసిన వ్యాసాలు చదువుదాం." అన్నది టీచర్ ఆసైనికుడి దుఃఖాన్ని ఉపశమింప చేసేప్రయత్నంలో.

పిల్లలందరూ బిగ్గరగా వ్యాసాలు చదువు తున్నారు. టోటోచాన్ సైనికునివైపు చూసింది. అతడు చిరునవ్వు నవ్వాడు. టోటోచాన్ మనసు కుదుట పడింది.

ఆసైనికుడికి ఆపాటవింటే ఎందుకంత ఏడుపు వచ్చిందో అతడికే తెలుసు. ఆయనకు టోటోచాన్‌లాంటి చిన్నారిపాప వుందేమో! టోటోచాన్ తనకోసం పాటపాడినందుకే వచ్చిందేమో ఏడుపు. లేదా యుద్ధరంగంలో తిండిలేక బాధపడిన నిముషాలు గుర్తొచ్చాయెూ ఏమో! లేక ఇక ముందుముందు నమలడానికి-బాగానమల డానికి ఏమీ దొరకదని పించి దుఃఖం వచ్చిందేమో? ఏది ఏమైనా ఆసైనికుడిని ఆపాట కదిలించింది.

అప్పటికే పసిఫిక్ యుద్ధానికి ప్రయత్నాలు జరుగు తున్నాయని ఆనాడు ఆ చిన్నారులకు తెలియదు.

## వైద్యానికి చెట్టుబెరడు

గేటు దగ్గర నిల్చున్న టికెట్ కలెక్టర్‌కు తను మెడలో తగిలించు కున్న పాసుచూపించి. టోటోచాన్ స్టేషన్ బయటకు నడిచింది. అతడు ఆ పిల్లను రోజూ చూస్తూనేవున్నాడు.

స్టేషన్ వెలుపల ఏదో వింత జరుగుతున్నది. జనం మూగి వున్నారు. టోటోచాన్ వెళ్ళి జనంలో కలిసి నిల్చుంది. అక్కడ ఒక యువకుడు చెట్టు బెరడు ముక్కల్లాంటివి కుప్ప పోసుకొని కూర్చునివున్నాడు. "అయ్యలూ చూడండి, బాబులూ చూడండి, బాగా చూడండి. బాబులూ!" ఆయువకుడు అరుస్తున్నాడు. టోటోచాన్ శ్రద్ధగా చూడసాగింది. "వినండి బాబూ! జాగ్రత్తగా వినండి. ఆరోగ్యమే మహా భాగ్యం అన్నారు పెద్దలు. మీ ఆరోగ్యం బాగుందో లేదో రోజూ ఉదయం లేవగానే తెలుసుకోవడం చాలా అవసరం, ఈ బెరడు ముక్కతో మీ ఆరోగ్యం ఎలావుందో తెలుసుకోండి బాబూ! తెలుసుకోండి! మీరు చెయ్యాల్సిందల్లా, రోజూ నిద్రలేవగానే ఈ బెరడు ముక్కను పిసరంత కొరికి నమలడం. అంతే! మీకు అది చేదుగా అన్పిస్తే మీ ఆరోగ్యం బాగా లేదన్నమాట. చేదుగా లేదనుకోండి-అప్పుడు మీ ఆరోగ్యం చాలా బాగుందన్న మాట జ్వరం లాంటి రోగం ఏదీ లేదన్న మాట. మీ ఆరోగ్యం గురించి రోజూ తెలుసుకోండి బాబూ! ఈ బెరడు చాలా చవక—కారు చవక-ఇరవై సెన్లు మాత్రమే! కొనండి బాబూ! బాబూ! ఓ పెద్దబాబూ! మీరు తీసుకోండి." అరుస్తున్నాడు ఆయువకుడు.

ఒకాయన ఆ బెరడు అందుకొని, తనపక్కన అంతవరకూ నిల్చుని వున్న ఓబక్కపల్చని మనిషికి అందించాడు. అతడు బెరడు కొరికాడు. కాస్త తలవంచి దాన్ని పరిశీలనగా చూశాడు.

"ఇది...ఇది...ఇది కొంచెం చేదుగానేవుంది," అన్నాడు.

మందులవాడు ఒక్క ఉదుటన లేచి నిలబడ్డాడు. నేను చెప్పలేదూ? మీరు కాస్త జాగ్రత్తగా వుండాలి. ఆరోగ్య విషయంలో శ్రద్ధ తీసుకోవాలి. భయపడకండి. కొద్దిగానే చేదుగా వుంది. అన్నాడు. అంటే రోగం ముదర లేదన్నమాట "అని మరో బెరడు తీసుకొని ఒక స్త్రీ ముందుకెళ్ళి నిల్చున్నాడు," "అమ్మా! మీరు ఒకసారి కొరికి చూస్తారా?" అంటూ బెరడు అందించాడు. ఆమె బెరడులోనుంచి పెద్ద ముక్కే కొరికి కసకస నమిలింది.

"ఇది బొత్తిగా చేదుగాలేదు!" అన్నది.

"అలాగా తల్లీ! నువ్వు అదృష్టవంతురాలివి. చాలా ఆరోగ్యంగా వున్నా వన్నమాట," అన్నాడు. "ఇరవై సెన్లు మాత్రమే మీ ఆరోగ్య పరీక్ష ఖర్చు ఇరవై సెన్లు మాత్రమే. మంచి అవకాశం. చౌక బేరం" అని ఉత్సాహంగా అరుస్తున్నాడు.

ఆ గోధుమ రంగు బెరడును ఒక్కసారి కొరికి చూడాలనిపించింది. అతడికి ఆ విషయం చెప్పాలంటే సిగ్గు వేసింది. "సాయంకాలం మాబడీ వదిలేదాకా ఇక్కడే వుంటావా?" అని అడిగింది.

"వుంటాను పాపా! తప్పకుండా వుంటాను," ఆ పిల్లకేసి చూస్తూ అన్నాడు మందులవాడు.

టోటోచాన్ బడికేసి పరుగు తీసింది. వీపు మీద పుస్తకాల సంచి ఎగిరిపడ్తోంది. ఈ రోజు బడికి ఆలస్యంగా వెళ్ళకూడదను కుంది. అందుకు కారణం లేక పోలేదు. తరగతిలో కాలు పెడ్తూనే తోటి పిల్లల్ని చూస్తూ "ఎవరిదగ్గరైనా ఇరవై సెన్లు ఉంటే నాకిస్తారా?" అని అడిగింది.

ఎవరి దగ్గరా ఇరవై సెన్లు లేవు. పది సెన్లకేపొడవాటి బిస్కెట్ ప్యాకెట్ దొరుకుతుంది. అయినా ఎవరి దగ్గిరా పదిసెన్లు కూడా లేవు.

"మా అమ్మను అడిగితేనా?" అన్నది మియోచాన్.

మియోచాన్ హెడ్‌మాస్టరు కూతురు కావడం వల్ల పిల్లలను అప్పుడప్పుడు,

ఇబ్బంది సమయాల్లో ఆదుకుంటూ ఉంటుంది. ఇల్లు కూడా ఆ ఆవరణలోనే కనుక ఆమె తల్లి కూడా బళ్లో వున్నట్టు గానే అన్పించేది.

"మానాన్న నీకు ఇరవై సెన్లు ఇస్తానన్నాడు. కాని ఎందుకో అడగమన్నాడు," అన్నది మియోచాన్ మధ్యాహ్నపు భోజనాల సమయంలో టోటోచాన్‌తో టోటోచాన్ పరుగెత్తి ఆ హెడ్మాస్టర్ దగ్గర కెళ్ళింది, "ఇరవై సెన్లు కావాలా నీకు? అని అవి ఎందుకు" అన్నాడు?

"నేను ఒక చెట్టు బెరడు ముక్క కొనుక్కోవాలి. అది రోజూ మన ఆరోగ్యం బాగుందో లేదో చెబుతుంది."

"ఎక్కడ అమ్ము తున్నారు?" హెడ్‌మాస్టరు కూతురు, కుతూహలంగా అడిగింది.

"స్టేషన్ దగ్గర."

"సరే! నువ్వు కావాలంటే కొనుక్కో—కాని నన్ను కూడా ఒక్కసారి ఆముక్కను కొరక నిస్తావా? కొరకనిస్తావుగదూ?" అన్నాడు హెడ్‌మాస్టరు.

ఆయన పర్సు తెరచి ఇరవై సెన్లు తీసి టోటోచాన్ చేతిలో పెట్టాడు.

"మీరు చాలా మంచివారు. అమ్మను అడిగి మీడబ్బు వాపసు ఇచ్చేస్తాను. అమ్మ పుస్తకాలకు డబ్బు ఇస్తుంది. ఏమన్నాకొనాలంటే ముందుగా అడిగితేతప్పక ఇస్తుంది. ఆరోగ్యం గురించి రోజూ తెలుసుకుంటే మంచిదేకదండీ. అందువల్ల ముందే కొనేసినా అమ్మ ఏమీ అనదు," అన్నది.

బడి వదలగానే టోటోచాన్ ఇరవై సెన్లు గుప్పెట్లో గట్టిగా పట్టుకొని పరుగు తీసింది. మందుల మనిషి ఇంకా స్టేషన్ దగ్గరే వున్నాడు. మందుల గురించి అరిచి అరిచి చెప్తున్నాడు. టోటో చాన్ చేతిలో ఉన్న పైసలు చూడగానే అతనిముఖం విప్పారింది.

"తెచ్చావా అమ్మా! మీ అమ్మా నాన్నా చాలా సంతోషిస్తారు తెలుసా?" అన్నాడు.

"రాకీ కూడ!"

"రాకీ ఎవరు?!" ఒక బెరడు ముక్క తీస్తూ అడిగాడు.

"రాకీ అంటే మా కుక్కపిల్ల."

"కుక్కపిల్ల!" ఒక్షణం ఆగి మళ్లీ అన్నాడు. "ఈ బెరడు దానికి కూడా

ఉపయోగ పడుతుందిలే! దీన్ని అది తినలేదనుకో! దానికి ఇది చేదుగా అన్పించింది, అనుకోవాలి. అంటే దాని ఆరోగ్యం బాగా లేదన్న మాట."

ఒక అంగుళం వెడల్పూ, రెండుగుళాల పొడవు వున్న బెరడు ముక్క తీశాడు.

"ఇదుగో! తీసుకో! రోజూ పొద్దునే దీన్ని కొరికి చూడు. చేదుగా వుందనుకో నీ ఆరోగ్యం బాగా లేదన్న మాట."

దాన్ని కాగితంలో చుట్టుకొని అపురూపంగా ఇంటికి తీసుకెళ్ళింది. ఇంటికి వెళ్ళగానే కొరికిచూసింది. అది చేదుగా లేదు. అసలు ఎలాంటిరుచి లేదు.

"బలే! నా ఆరోగ్యం చాలా బాగుంది. అవును నీ ఆరోగ్యం మంచిది. అయినా ఇప్పుడు నీకా సందేహం ఎందు కొచ్చింది?" తల్లి అడిగింది.

టోటోచాన్ కథంతా చెప్పింది. తల్లి కొరికి చూసింది. "ఇది చేదుగాలేదే," అంది.

"అయితే! అమ్మా! నీ ఆరోగ్యం కూడా బాగుందన్నమాట," అన్నది టోటోచాన్."

దాన్ని తీసుకెళ్ళి రాకీ మూతి దగ్గర పెట్టింది. రాకీ వాసన చూసి, ఒకసారి నాలుకతో నాకి వదిలేసింది.

"అలా కాదు నువ్విది కొరకాలి" అంది. కాని రాకీ కొరికే ప్రయత్నం చెయ్యలేదు.

"ఊ! కొరుకు. నీ ఆరోగ్యం బాగావుందో లేదో తెలుస్తుంది."

కాని రాకీ బెరడు కొరికే ప్రయత్నం చెయ్యలేదు.

టోటోచాన్ బెరడు ముక్కను రాకీ నోట్లో కుక్కి "ఊ! కొరుకు" అంది.

రాకీ పెద్దగా ఇష్టపడ్డట్టులేదు. అయినా బెరడు అంచు నుంచి చిన్న ముక్కను కొరికింది. మళ్ళీ దాన్ని వాసన చూసింది. అయితే అది ముఖం చిరాగ్గా పెట్టలేదు.

"బలే! బలే! రాకీ ఆరోగ్యం కూడా బ్రహ్మాండంగా వుంది" అంటూ చప్పట్లు కొట్టింది.

రెండోరోజు ఉదయం తల్లి టోటోచాన్‌కు ఇరవై సెన్లు ఇచ్చింది. తిన్నగా హెడ్ మాస్టరు గదిలోకివెళ్ళి బెరడు ముక్కను చూపించింది. ముందు ఆయనకు

అర్థం కాలేదు. కాని ఆ పిల్లచేతిలో వున్న పైసలు చూడగానే అసలు విషయం గుర్తుకొచ్చింది.

“కొరికి చూడండి. చేదుగావుంటే మీ ఒంట్లో బాగాలేనట్టు. హెడ్‌మాస్టరు కొరికి చూశాడు. ఆతర్వాత ఆబెరడును పరిశీలనగా చూసాడు.”

“చేదుగా వుందా?”

“లేదు. ఏరుచీ లేదు.”



“అంటే మీ ఒంట్లో బాగుందన్న మాట. బలే! బలే! మా హెడ్ మాస్టరు గారి ఆరోగ్యం చాలా బాగుందోచ్!” అంటూ గంతులేసింది.

ఆరోజు స్కూల్లో వున్న పిల్లలందరి చేతా కొరికించింది. ఒక్కరికి కూడా అది చేదని పించలేదు. “అంటే బళ్లో పిల్లలందరూ ఆరోగ్యంగా వున్నారన్న

మాట," అనుకుంది. ఆరోజంతా ఆ పిల్ల ఎంతో సంతోషంగా ఉంది.

పిల్లలందరూ గుంపుగా వెళ్ళి "మేమందరం చాలా ఆరోగ్యంగా వున్నాం" అని చెప్పారు హెడ్‌మాస్టరుతో. హెడ్‌మాస్టరు ప్రతి పిల్లకు "చాలా సంతోషం" అని చెప్పాడు.

హెడ్‌మాస్టరుకు ఆ బెరడు గురించి ముందే తెలుసు. అది ఎవరు కొరికినా చేదుగా వుండదని తెలుసు. అందరూ ఆరోగ్యంగా వున్నారనే ఆలోచన టోటోచాన్‌కు సంతోషకరం కావడం ఆయనకు చాలా ఆనందంగా వుంది. ఆ పిల్ల స్వభావం ఎంత మంచిదో అర్థం చేసుకున్నాడు.

బడి ముందు నుంచి వెళుతున్న ఓ కుక్కను పట్టుకొని బెరడు కొరి కించే ప్రయత్నంచేసింది. అకుక్క టోటోచాన్‌ను కరవబోయింది. అయినా ఆపిల్ల పట్టువిడవలేదు.

"ఇది కొరకు. రా! నీ ఒంట్లో బాగుందో లేదో తెలుస్తుంది" అంటూ బలవంతంగా ఆ కుక్క చేత ఆబెరడు కొరికించింది. ఆకుక్క చిన్న ముక్క కొరికి నమిలేసింది. అది చూసి టోటోచాన్ కుక్కచుట్టూ గంతులేస్తూ "నీ ఆరోగ్యం చాలా బాగుంది" అంది.

ఆకుక్క కృతజ్ఞతలు తెలుపు తున్నట్టుగా తలవంచింది. ఆతర్వాత పరుగు తీసింది.

హెడ్‌మాస్టరు అనుకున్నట్టుగానే ఆ మందులవాడుమళ్ళీ ఆస్టేషన్ దగ్గర్లో కన్పించలేదు.

రోజూ టోటోచాన్ బడికి బయలుదేరేముందు డ్రాయరు సొరుగులోనుంచి అపురూపమైన ఆబెరడు ముక్కను బైటికి తీసికొరుకుతుంది. "నా ఆరోగ్యం బాగుందోచ్" అనుకుంటూ బయటికి పరుగు తీస్తుంది.

టోటోచాన్ నిజంగానే ఆరోగ్యంగావుంది.

## ఇంగ్లీషు మాట్లాడే విద్యార్థి

టోమోలోకి ఆరోజు కొత్త విద్యార్థి ప్రవేశించాడు. ఆ అబ్బాయి ఆబళ్ళో వున్న విద్యార్థులందరికన్నా పొడవుగా, లావుగా వున్నాడు. ఏడో తరగతి చదివే విద్యార్థిలా కన్పిస్తున్నాడు. ఆ కుర్రాడు వేసుకొన్న దుస్తులు కూడా

పెద్దవిగా, ప్రత్యేకంగా ఉన్నాయి.

హెడ్‌మాస్టరు ఆ విద్యార్థిని అందరికీ పరిచయంచేశాడు.

"ఈ అబ్బాయి పేరు మియాజాకి. అమెరికాలో పుట్టి పెరిగాడు. అందువల్ల జపనీస్ భాష సరిగ్గా మాట్లాడలేడు. మనబడికి ఎందుకు వచ్చాడో తెలుసా? ఇక్కడ అందరూ స్నేహంగా వుంటారని. ఇవాల్టినుంచి ఈ అబ్బాయి మీతో పాటు చదువుకుంటాడు. ఏక్లాసులో చేర్చుకుంటే బాగుంటుందంటారు? టా-చాన్‌తో ఐదో క్లాసులో చేర్చుకుంటే ఎలావుంటుందంటారు?"

"చాలా బాగుంటుంది." అన్నాడు టాచాన్. అతడు బొమ్మలు చాలా బాగాగీస్తాడు.

హెడ్‌మాస్టరు చిరునవ్వు నవ్వాడు. మళ్ళీ చెప్పసాగాడు "మియాజాకికి జపనీస్ బాష సరిగారాదు. కాని ఇంగ్లీషు చాలా బాగా మాట్లాడగలడు. మీరు అతడి దగ్గర ఇంగ్లీషు నేర్చుకోవచ్చు. అతడికి జపాన్ పద్ధతులు తెలియవు. మీరు నేర్పించండి. ఆ అబ్బాయి నుంచి అమెరికా వింతలూ, విశేషాలూ తెలుసుకోండి. సరే! ఇప్పుడు ఈ అబ్బాయి మీనేస్తం, నేను వెళ్తున్నాను."

మియాజాకి తలవంచి పిల్లలందరికీ అభివాదంచేశాడు. పిల్లలందరూ తలలువంచి ప్రత్యభివాదంచేశారు.

మధ్యాహ్నం భోజనాల సమయంలో మియాజాకి హెడ్‌మాస్టరు ఇంటికివెళ్ళాడు. పిల్లలందరూ అతడ్ని అనుసరించారు. ఆకుర్రాడు చెప్పులు విడవకుండా లోపలకు వెళ్ళబోయాడు. "చెప్పులు-చెప్పులు" పిల్లలు అరిచారు.

మియాజాకి బిత్తరపోయాడు. చెప్పులు విడుస్తూ "క్షమించండి, గుర్తులేదు," అన్నాడు.

పిల్లలు మియాజాకి పక్కనకూర్చుని అక్కడి పద్ధతులు వివరించ సాగారు.

"తివాచీవున్నగదుల్లోనూ—అసెంబ్లీహాల్లోనూ చెప్పుల కాళ్ళతో వుండొచ్చు."

"కుహోంబుట్స్ గుడికెళ్ళామనుకో! అప్పుడు గుడి లోపలకు వెళ్ళినప్పుడు మాత్రమే తీసెయ్యాలి." ఇలా అనేక విషయాలు పిల్లలద్వారా తెలుసుకున్నాడు మియాజాకి.

రెండో రోజు పెద్దపెద్ద ఇంగ్లీషు బొమ్మల పుస్తకాన్ని తీసుకొచ్చాడు

మియాజాకి. మధ్యాహ్నపు భోజన సమయంలో పిల్లలందరూ అతడిచుట్టూ మూగారు. బొమ్మలు చూశారు. ఆశ్చర్య పోయారు. అంతవరకూ వాళ్లు అలాంటి బొమ్మల పుస్తకం చూడలేదు. అంతవరకు వాళ్ళు చూసిన పుస్తకాల్లో బొమ్మలు ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ రంగుల్లో మాత్రమే మెరుస్తూ వుండేవి. ఆరంగులు ఎంతో ముదురుగా వుండేవి. కాని ఈ పుస్తకంలోని రంగులు లేతగా వున్నాయి. నీరు కావి రంగులో, చర్మపు రంగులో ఈ బొమ్మలు ఉన్నాయి. ఇక నీలం రంగు సరేసరి. అందులో తెలుపు-గోధుమ రంగు కలిసి వున్నాయి. మియాజాకి రంగు పెన్సిళ్ల డబ్బాలో రకరకాల రంగు పెన్సిళ్లు వున్నాయి. టోటోచాన్ దగ్గర ఎనభై ఎనిమిదిరంగుల ప్రత్యేక డబ్బావుంది. కాని మియాజాకి డబ్బాలో అంతకంటే ఎక్కువ రంగులు ఉన్నాయి. పిల్లలందరికీ ఆరంగులు బలేగా నచ్చాయి. ఇక బొమ్మలు సరేసరి. మొట్ట మొదటి బొమ్మలో ఒక కుక్క పొత్తిళ్లలో వున్న పసిబిడ్డను లాగుతోంది. ఆ బిడ్డ బొమ్మలా లేదు. లేతచర్మం రంగులో అచ్చం బిడ్డలాగేవుంది. బిడ్డను చూసి పిల్లలుచాలా సంబరపడ్డారు. అంతమంచి కాగితం మీద, అంతంత అందమైన రంగుల్లో, పెద్దపెద్ద బొమ్మల్ని అంతవరకూ వాళ్ళు చూడలేదు. అంత పెద్ద బొమ్మల పుస్తకాన్ని కూడాచూడలేదు. టోటోచాన్‌కు చొరవ ఎక్కువ కదామరి! అందువల్ల మియాజాకికీ, ఆబొమ్మల పుస్తకానికీ దగ్గరైపోయింది.

ఆబొమ్మల కింద రాసివున్న ఇంగ్లీషు మాటలు చదివి వినిపించాడు మియాజాకి. పిల్లలకు ఆభాష చాలావచ్చింది. తర్వాత అక్రుర్రాడు జపనీస్ భాష నేర్చుకో సాగాడు.

మియోజాకి ఆ బడికి ఒక కొత్త విలక్షణతను తెచ్చాడు.

"అకాచాన్ అంటేపాప."

"అకాచాన్ అంటేపాప" పిల్లలందరూ మియోచాన్ మాటల్ని వల్లించారు

"ఉట్సుకుషి అంటే అందమైనది" అన్నాడు వత్తిపలుకుతూ. పిల్లలు వళ్లీ ఆమాటల్ని వల్లించారు.

మియాజాకి చాలా తొందరగా మిగతా పిల్లందరితో కలిసి పోయాడు. ప్రతిరోజూ కొత్త కొత్త పుస్తకాలు తెచ్చి అందరికీ చూపించేవాడు. ఇంగ్లీషు

చదివి వినిపించేవాడు.

ఒకరకంగా మియాజాకి పిల్లలకు ఇంగ్లిషు టీచరు అయాడు. అతను జపనీస్ భాష కూడా బాగా నేర్చుకున్నాడు. వాళ్ళ పద్ధతులు కూడా తెలుసుకున్నాడు. ఇప్పుడు పొరపాట్లు చెయ్యడం లేదు.

అమెరికా గురించి పిల్లలు ఎన్ని విషయాలో తెలుసుకున్నారు. టోమోలో జపాన్-అమెరికాల మధ్య స్నేహంకుదిరింది. మిగతా పాఠశాలల్లో ఇంగ్లిషును తొలగించారు. ఇంగ్లిషు శత్రువుల భాష అయింది.

"అమెరికా వాళ్లు భూతాలు" ప్రభుత్వం ప్రకటించింది. కాని టోమోలో మాత్రం అందరూ కలిసి కట్టుగావున్నారు. అక్కడిగాలి ఇంకా కలుషితం కాలేదు.

## ప్రోత్సాహిక నాటకం

"మనం నాటకం వెయ్య బోతున్నాం."

టోమో చరిత్రలో అది మొదటి నాటకం-మధ్యాహ్న భోజన సమయాల్లో పాటపాడే అనవాయితీ ఉంది. అక్కడ వున్న చిన్న రంగస్థలం మీద నాటకం వేస్తారట. ప్రేక్షకుల్ని పిలుస్తారట. అంతవరకు ఆపిల్లల్లో ఎవరూ నాటకం చూడలేదు. "హంసల సరస్సు" తప్ప టోటోచాన్ కూడా నాటకం చూడలేదు. వార్షికోత్సవంలో ఇవ్వబోయే ప్రోగ్రాం గురించి చర్చించుకున్నారు.

టోటోచాన్ తరగతి పిల్లలు "కన్జిన్‌చో" అనే నాటకం వెయ్యడానికి నిర్ణయించుకున్నారు. అది ప్రసిద్ధ ప్రాచీన కుబుకి నాటకం. ఆ నాటకం వాళ్ళ పుస్తకంలో వుంది. ఇప్పుడు ఆ నాటకం, చూడడానికి కాస్త వింతగానే ఉంటుంది. ఐకోసైషో లావుగా, పొడవుగా వుంటుంది కనుక, బెన్‌కీ పాత్రకు సరిపోతుందనుకున్నారు. ఆనాటకంలోని యోధుడిపేరు బెన్‌కీ. మొరటుగా, గంభీరంగా, పెద్దగొంతుతో మాట్లాడే అమెడెరాతో సైన్యాధిపతి వేషం వేయించాలనుకున్నారు.

చాలాసేపు చర్చించి, చివరకు ముఖ్య పాత్ర అయిన యొషిట్సునెగా టోటోచాన్ నటించాలనే నిర్ణయం తీసుకున్నారు. యొషిట్సునె సజ్జనుడు. మారువేషంలో సామాన్లు మోసే కూలీగా వుంటాడు. మిగతా పిల్లలు సన్యాసుల వేషాలు వెయ్యాలి.

రిహార్సల్స్ ప్రారంభానికి ముందు తమతమ పాత్రల సంభాషణల్ని అప్పచెప్పాల్సి వుంటుంది. టోటోచాన్‌కూ, సన్యాసుల వేషాలు వేసే పిల్లలకూ ఈ బెడద తప్పింది. ఎందుకంటే నాటకంలో వారికి మాటలు ఉండవు. టోటోచాన్ చెయ్యవలసిందల్లా మోకాళ్ల మీదకు వంగి, గడ్డిటోపీతో ముఖాన్ని దాచుకోవడం— బెన్‌కే వాస్తవానికి యొషిట్సునెకు నౌకరు. కాని తమ బృందాన్ని అటాకా చెక్ పాయింటు దాటించడానికి ఒక ప్లాను వేశారు. ఆ ఎత్తుకు అనుగుణంగా బెన్‌కీ యుషిట్సునెను కొట్టాలి, తిట్టాలి. మిగతా వాళ్లు గుడి కట్టడానికి చందాలు సేకరించేవాళ్లలా సన్యాసి వేషధారుల్లా నటించాలి. అందులో ప్రధానమైన సన్నివేశం, సైనికాధికారి ఆజ్ఞాపించినప్పుడు, బెన్‌కీ చందాలవసూలుకు సంబంధించిన శాసనం చదివే ఘట్టం.

"మొదటిగా, టోడాజి ఆలయ పునర్నిర్మాణానికి గాను..." అని చదవాలి. ఆ కాగితం మీద ఏమీ రాసి వుండదు. అది ఒఠి తెల్లకాగితం మాత్రమే.

ఐకోసైకో ఈ ఉపన్యాసాన్ని రోజూ వల్లించేది. టోగాషి పాత్రకు కూడా మాటలు చాలా వున్నాయి. వాటన్నింటినీ గుర్తుంచుకోవడానికి అమడెరా కిందుమీదులయ్యేవాడు.

రిహార్సల్ రోజు రానేవచ్చింది. టొగాషి, బెన్‌కీ ఎదురెదురుగా నిలబడ్డారు. బెన్‌కీ వెనక సన్యాసులందరూ నిలబడ్డారు. టోటోచాన్ మోకాళ్ళమీద అందరి కంటే ముందు కూర్చుంది. ముడుచుకు కూర్చుంది. టోటోచాన్‌కి ఏం జరుగుతుందో తెలియడం లేదు. అయోమయంగా వుంది. బెన్‌కీ పాత్రధారి, ముందుకుతోసి, కొట్ట బోయేసరికి టోటోచాన్ ఎదురు తిరిగింది. ఆపిల్లను కొట్టింది. తన్నింది. తిట్టింది. రక్కింది. ఐకో ఏడుపుకులంకించుకుంది. సన్యాసుల వేషాల్లో వున్న పిల్లలు నవ్వేశారు.

నాటకం ప్రకారం ఐకోకు టోటోచాన్ ఎదురు తిరగకూడదు. తిట్లు తినాలి. దెబ్బలు తినాలి. అప్పుడే వాళ్ళా చెక్ పాయింటు దాటగలరు. అలాకాక దెబ్బలు తినకుండా ఎదురు తిరిగితే నాటకమే లేదు. ఈ సంగతి టోటోచాన్‌కు అర్థం అయేలా చెప్పడానికి, నాటకం నేర్పిస్తున్న మరుయామా చాలా ప్రయత్నించాడు. టోటోచాన్ ఐకో చేత దెబ్బలు తినడానికి అంగీకరించలేదు. తనను కొడ్తే తనూ కొడ్తా నన్నది. ఎన్ని సార్లు ఆసన్నివేశం రిహార్సలు వేసినా టోటోచాన్

ప్రతిసారీ ఎదురు తిరుగుతూనేవుంది. తనను కొట్టబోయిన ఐకో మీద ఎదురు తిరుగుతూనేవుంది.

"ఇక నువ్వు ఈ పాత్ర చెయ్యలేవు. ఈ మాట చెప్పడానికి బాధపడ్తున్నాను. తప్పదుమరి. నీ పాత్రను టాయిచాన్ చేత వేయిస్తాను," అన్నాడు మరుయామా.

టోటోచాన్ హాయిగా గుండెల నిండుగా గాలి పీల్చుకుంది. ఆ నాటకంలో తనొక్కర్తె దెబ్బలు తినడం నామోషిగా అన్పించింది టోటోచాన్‌కు.

"పోనియ్ సన్యాసి వేషం వేస్తావా?"

టోటోచాన్ సన్యాసుల వరసలోని చివరలో వెళ్ళినిల్చుంది. ఆ తర్వాత అంతా ఇంక బాగా జరిగిపోతుందను కున్నారు. కాని అనుకున్నట్టుగా జరగలేదు.

సన్యాసి వేషం వేసిన వాళ్ల చేతుల్లో కర్రలున్నాయి. టోటోచాన్ చేతికి కర్ర ఇవ్వకుండా వుంటే బాగుండేది. నిల్చుని నిల్చుని విసుగు పుట్టింది. తన కర్రతో పక్కన నిలబడిన పిల్లల కాళ్లమీద గీకడం మొదలు పెట్టింది. వాళ్ళచంకలో గిలిగింతలు పెట్టింది. మ్యూజిక్ డైరెక్టరులా కర్ర పైకీ కిందకూ ఊపబోయింది, కొంచెమయితే ఆకర్ర ఎవరికో ఒకరికి తగిలేది. చివరకు టోటోచాన్‌ను నాటకంలో నుంచి తీసేశారు.

టోటోచాన్‌కు అక్కడ పనిలేదు. వంటరి అయిపోయింది. అక్కడ్నుంచి బడి ఆవరణలోకి వెళ్ళింది. కాలి జోళ్లు విప్పి నృత్యం చెయ్యసాగింది. అలా తనకు ఇష్టమైనట్టు నృత్యం చెయ్యడంలో ఆనందం కలిగింది. కాసేపు తుదకు తాను హంసగా అనుకుంది. పడవగా అనుకుంది. చెట్టుననుకుంది. గాలి ననుకుంది. తనిష్టం! తనిష్ట మొచ్చినరీతిలో నృత్యం చెయ్యొచ్చు!

అయినా తను ఆ నాటకంలో వేషం వెయ్యలేక పోయినందుకు, మనసులో ఎక్కడో ఒక మూల వెలితిగానే అన్పించింది. టోమోలో మొదటిదీ, చివరిదీ కూడా అయిన ఆ నాటకంలో నటించలేకపోయింది.

## చాక్‌పీస్

టోమో స్కూలు పిల్లలు బయట ఎవరిగోడల మీదా చాక్‌పీస్‌తో గీతలు

గీసేవాళ్లు కాదు. వాళ్లకు బళ్లోనే ఆపని చెయ్యడానికి బోలెడంత అవకాశం వుంది. సంగీతం పాఠాలు నేర్పే సమయంలో, హెడ్‌మాస్టరు పిల్లలకు ఒక చాక్ పీస్ ఇచ్చేవాడు. అదిపట్టుకొని పిల్లలు హెడ్‌మాస్టరు ఇవ్వ బోయే సూచనల కోసం ఎదురు చూసేవారు. హెడ్‌మాస్టరు పియానో వాయిస్తాడు. ఆయన పియానో వాయిస్తూ వుంటే పిల్లలు నేలమీద సంగీత చిహ్నాలతో ఆస్వరాలను రాస్తుండేవారు. గోధుమరంగు చెక్క మీద అలా రాయడానికి పిల్లలు చాలా సంబర పడేవాళ్లు. టోటోచాన్ తరగతిలో దాదాపు పదిమంది పిల్లలు వుండేవాళ్లు. అందువల్ల ఆ పెద్ద అసెంబ్లీ హాలులో ఒక్కొకరికి రాసుకోవడానికి చాలినంత స్థలం వుండేది. వాళ్ళు తమకు ఇష్టం వచ్చినంత పెద్ద చిహ్నాలు రాసుకోవచ్చు. మరొకరి స్థలంలోకి జొరబడాల్సిన అవసరం వుండేది కాదు.

సంగీత స్వరమాలిక రాయడానికి అవసరమైన ఐదు అడ్డగీతలూ వాళ్ళు రాయనక్కర్లేదు. వాళ్ళు రాసేవి కేవలం స్వరాలు మాత్రమే. టోమోలో సంగీత చిహ్నాలకు ప్రత్యేకమైన పేర్లువుండేవి. అవన్నీ హెడ్‌మాస్టరు సహాయంతో పిల్లలు కనిపెట్టినవే.

## ఆ పేర్లు

 ను గంతు అనేవాళ్లు. ఈ స్వరం ఎగరడానికీ, గెంత డానికి వీలుగావుండేది.

 ను జండా అనేవాళ్లు. అది జండాలాగే కన్పిస్తుంది.

 ను జెండా-జెండా అనేవాళ్లు.

 ను రెండు జండాలు అనేవాళ్లు.

 ను నలుపు అనేవాళ్లు.

 ను తెలుపు అనేవాళ్లు.

 ను తెల్ల పుట్టు మచ్చ అనో-తెల్ల చుక్క అనో అనేవాళ్లు.

 ను వృత్తం అనేవాళ్లు.

ఈ విధంగా వాళ్ళకు సంగీత స్వరాలు తెలిసిపోయేవి. ఆడుతూ పాడుతూ తెలుసుకొనేవాళ్ళు. అందుకే సంగీతం క్లాసంటే పిల్లలు చాలా ఇష్టపడేవాళ్ళు.

నేలమీద చాక్‌పీస్‌తో రాయడం అనే ఆలోచన పూర్తిగా హెడ్‌మాస్టరుదే. కాగితం చాలదు. బ్లాక్‌బోర్డులు తగినన్ని లేవు. అందుకే ఆయన అసెంబ్లీహాలు నేలనే బ్లాక్ బోర్డుగా ఉపయోగించారు. సంగీతం ఎంత వేగంగా వున్నా పిల్లలు కష్ట పడకుండా రాయగలిగేవారు. పాఠం పూర్తి అయ్యాక, సమయం వుంటే పిల్లలు, అక్కడ వాళ్లకు ఇష్టమైన బొమ్మల్ని గియ్యవచ్చు. ఒక్కోసారి ఒకబొమ్మతో మరొక బొమ్మ కలిపేస్తూ, మొత్తం బొమ్మల్ని కలిపేవాళ్లు. అప్పుడు నేలంతా బొమ్మలతో చిత్రంగా కన్పించేది.

సంగీత పాఠాల సమయంలో కూడా హెడ్‌మాస్టరు వచ్చి పిల్లలకు సలహాలు ఇస్తూ వుండేవాడు. వాళ్లురాసిన స్వరాలను సరి చేసి, మళ్లీ వెళ్ళి పియానో దగ్గర కూర్చునేవాడు. పియానో వాయించగానే, తాము రాసిన స్వరమాలిక సవరించు కొనేవాళ్లు. ఎన్ని పనులున్నా సంగీతం క్లాసుకు మాత్రం హెడ్‌మాస్టరు స్వయంగా వచ్చేవాడు. ఆక్లాసు మరొకరికి అప్పగించేవాడు కాడు. కొబయాషి లేని సంగీత క్లాసును పిల్లలు ఊహించుకోలేరు.

క్లాసు పూర్తి అయ్యాక పిల్లలే మళ్ళీ ఆ నేలంతా శుభ్రంగా తుడిచేవాళ్ళు. చీపుళ్లూ, పాతగుడ్డలతో నేలను శుభ్రంగా మెరిసేలా తుడిచేసేవాళ్ళు. సంగీతం క్లాసు వారానికి రెండు సార్లు మాత్రమేవుండేది. అందువల్ల పిల్లలకు ఈ పని సరదాగా వుండేది.

టోమో పిల్లలకు దీనివల్ల సుద్దముక్కల్ని ఎలా వాడాలో తెలిసి పోయేది. వాటిని ఎలా పట్టుకోవాలి, ఏది మంచిది-మొదలైన విషయాలు వాళ్లకు తెలిసిపోయేవి.

## "యాసువాకీ చాన్ చనిపోయాడు!"

వసంతకాలపు శెలవులు అయిపోయాయి. బడితెరిచిన మొదటిరోజు ఉదయం ఆవరణలో పిల్లలంతా నిలబడి వున్నారు. ఎప్పటిలాగే హెడ్‌మాస్టరు జేబుల్లో చేతులుపెట్టుకొని పిల్లల ఎదురుగా నిలబడి వున్నాడు. ఆయన విచారంగా వున్నాడు.

"యాసువాకీ చాన్ చనిపోయాడు. మనందరం అంత్యక్రియలకు వెళ్దాం" అన్నాడు మెల్లగా. జాలిగొంతుతో. ఒక్షణం ఆగి మళ్లీ "యాసువాకీ అంటే మీ అందరికీ చాలా ఇష్టం అనినాకు తెలుసు. అతడు మనల్ని వదిలి చాలా దూరం వెళ్ళిపోయాడు. అందుకు చాలా బాధగా వుంది." అన్నాడు ఏడుపుగొంతుతో. ఆపైన దుఃఖంతో గొంతు పెగల్లేదు. మాటలు రాలేదు. ముఖం ఎర్రబడింది. కళ్ళల్లో కన్నీరు. పిల్లలందరూ కొయ్యబారిపోయారు. ఎవరూ ఒక్క మాటకూడ మాట్లాడే స్థితిలో లేరు. అందరిమనస్సులో అతడి రూపం నిండుకుంది. ఆవాతావరణంలో విషాదం ఆవరించింది.

"ఇంత చిన్న తనంలో చచ్చి పోవడం దారుణం."

"అంకుల్ టామ్స్‌కాబిన్ చదవమని నాకిచ్చాడు. ఇంకా ఆ పుస్తకం నేను పూర్తిగా చదవనేలేదు" టోటోచాన్ మనసులోనే అనుకుంది.

సెలవులకు ముందు పుస్తకం ఇస్తున్నప్పుడు ఆపిల్లవాడి చేతివేళ్ళు మెలికలు తిరిగిపోయి వుండడం టోటోచాన్ గమనించింది. ఇప్పుడు అదిగుర్తొచ్చింది. మొట్టమొదటిసారి యాసువాకీని చూసినప్పుడుతను "ఎందుకలా నడుస్తావు?" అని అడగడం-"నాకు పోలియో?" అని ఆ పిల్లవాడు జవాబివ్వడం గుర్తొచ్చింది. తాము ఇద్దరూ చెట్టు ఎక్కడానికి చేసిన ప్రయత్నం గుర్తొచ్చింది. టోటోచాన్ తన కంటే ఎత్తుగా ఎంతో ఎత్తుగా బరువుగా వుండేవాడు. అయినా తనమీద నమ్మకంతో ఆబరువునంతా తనమీద వేశాడు.

టోటోచాన్‌కు యాసువాకీ చాన్ అంటే చాలా ఇష్టం. మధ్యాహ్నం భోజనం ఇద్దరూ కలిసి చేసేవాళ్లు. బళ్లో విరామ సమయాలు ఇద్దరూ కలిసే గడిపేవాళ్లు. బడివదిలాక స్టేషన్‌కు ఇద్దరూ కలిసే నడిచేవాళ్ళు. ఇక యాసువాకీ చాన్ లేడు అంటే బాధ అనిపించింది. చచ్చి పోవడం అంటే బడికి రాలేక పోవడం అని ఆ పిల్లకు అర్థం అయింది. ఆనాడు చచ్చిపోయిన కోడి పిల్లలు గుర్తొచ్చాయి. తను ఎంత పిల్చినా కదలకుండా పడివుండిన కోడిపిల్లలు కళ్ళముందు మెదిలాయి.

యాసువాకీ చాన్ అంత్యక్రియలు. అతడువుండే చోటుకు దగ్గర్లో వున్న చర్చిలో జరిగాయి.

పిల్లలందరూ ఒకే వరసలో మౌనంగా జియుగేకే నుంచి చర్చి దగ్గరకు

నడిచారు. సాధారణంగా దిక్కులు చూస్తూ నడిచే అలవాటున్న టోటోచాన్ నేలకేసిచూస్తూ నడిచింది. హెడ్‌మాస్టరు ద్వారా సమాచారం విన్నప్పటికంటే ఇప్పుడు మనసు మరీ భారంగావుంది. మొదట ఆవార్తమీద నమ్మకం కలగలేదు. తర్వాత బాధకలిగింది. ఇప్పుడు ఒకసారి యాసువాకీని సజీవంగా చూడా లనివుంది. అతడితో మాట్లాడాలనివుంది. ఎన్నో విషయాలు చెప్పాలని ఉంది. టోటోచాన్‌కి ఏడుపువస్తోంది.

చర్చి అంతటా తెల్లటి లిల్లీపూలు పరుచుకొని వున్నాయి. యాసువాకీ తల్లి, బంధువులు చర్చి బయట దిగులు ముఖాలతో నిల్చుని వున్నారు. నల్లదుస్తుల్లో వున్నారు. టోటోచాన్‌ను చూడగానే వాళ్ళు ఏడవసాగారు. టోటోచాన్ మొదటిసారిగా అంత్యక్రియల కార్యక్రమం చూసింది. అందరూ మౌనంగా వున్నారు. అలాంటిది చూడడం ఎంత బాధాకరమో తెలిసింది. సన్నగా వాద్యాలలో నుంచి ప్రార్థనా గీతం విన్పిస్తోంది. మిట్ట మధ్యాహ్నం చర్చంతా వెలుగుతో నిండిపోయింది. పిల్లలందరికీ ఒక్కొక్క తెల్లటి పువ్వును ఇచ్చారు. వాళ్ళంతా వరసగా వెళ్ళి యాసువాకీచాన్ శవపేటిక దగ్గర పూలు ఉంచాలి.

శవపేటికలో, యాసువాకీ పడుకొని ఉన్నాడు. కళ్ళు మూసుకొని వున్నాడు. చుట్టూ తెల్లటిపూలు. టోటో మోకాళ్ల మీదవంగి యాసువాకీ చేతి ప్రక్కగా పువ్వు ఉంచింది. ఆచేతిని మెల్లగా పట్టుకుంది. ఆపిల్ల ఎన్నోసార్లు పట్టుకున్న చెయ్యి అది. తన మురికి చేతి కంటే ఆచెయ్యి ఎంతో తెల్లగా వున్నట్టు కన్పించింది.

"నేస్తం. శెలవు. మనం పెద్దవాళ్ళం అయ్యాక ఎక్కడో ఒకచోట తప్పక కల్సుకుంటాం. అప్పటికి నీపోలియో తగ్గిపోతుంది," మనసులో అనుకొని లేచి నిల్చుంది.

అంతలోకే మరో విషయం గుర్తొచ్చి. "అయ్యయ్యో! అంకుల్ టామ్‌పుస్తకం నీకు ఇవ్వలేదు. మర్చిపోయాను. ఇప్పుడు ఇవ్వలేను. మళ్ళీ మనం కలుసుకున్నప్పుడు తప్పక ఇస్తాను, అంతవరకూ భద్రంగా వుంచుతాను. సరేనా?" చిన్న గొంతుతో గొణిగింది.

అక్కడ్నుంచి వస్తున్నప్పుడు ఆ పిల్లకు వెనక నుంచి యాసువాకీ గొంతు

విన్పించినట్టు అన్పించింది. "టోటో! మనిద్దరం కలిసి బలే సర్దాగా ఆడుకొనేవాళ్ళం కదూ? నేను నిన్ను ఎప్పటికీ మర్చిపోను. ఎప్పటికీ మర్చిపోను...మర్చిపోను."

టోటో ఆగి వెనక్కు తిరిగి "నేను కూడా నిన్ను మర్చిపోను." అన్నది. రైలు పెట్టెలో కూర్చున్న టోటోచాన్ బుగ్గలు కన్నీటితో తడిచిపోయినై.

## గూఢచారి

టోమో పిల్లల మనసుల నుంచి యాసువాకీ చాన్ జ్ఞాపకం చాలా కాలం తొలగిపోలేదు. ముఖ్యంగా ప్రార్థన సమయంలో మరీ గుర్తొచ్చేవాడు. యాసువాకీ ఇక రాడనీ తమతోపాటు ప్రార్థన సమయంలో నిల్చోడనీ వాళ్ళకుతెలుసు. అయినా కఠోర నిజాన్ని వాళ్ళ మనసులు ఒక పట్టాన అంగీకరించడంలేదు. తరగతిలో తక్కువమంది పిల్లలు వుండడం వల్ల, అతడు లేని లోపం మరీ కొట్టవచ్చినట్టుగా కన్పించేది. టోమోలో విద్యార్థులకు, ఒక్కొక్కరికి ప్రత్యేకంగా కేటాయించిన సీటులేక పోవడం వల్ల కొంత మెరుగు. లేకపోతే అతడురోజూ ఒకే కుర్చీలో కూర్చొనేవాడు. అది ఖాళీగా కన్పిస్తే పిల్లలు మరీ బాధ పడి వుండేవాళ్ళు.

"పెద్ద దాన్ని అయ్యాక ఏం చెయ్యాలి! ఏం చెయ్యాలి?" అని ఆలోచించడం మొదలు పెట్టింది టోటోచాన్. మరీ చిన్నప్పుడు వీధుల్లో మేళాలు వాయించే బృందంలో చేరిపోవాలనుకుంది. ఆతర్వాత నృత్యకారిణి కావాలనుకుంది. టోమోలో చేరడానికి వచ్చిన రోజు, స్టేషన్‌లో టికెట్ కలెక్టర్‌ను చూసి, అతడిలాగే టికెట్ కలెక్టర్ కావాలను కుంది. ఇప్పుడు తను నర్సుగా వుంటే బాగుంటుందేమోనని ఆలోచించసాగింది. ఉన్నట్టుండి గాయపడిన సైనికులను పరామర్శించడానికి వెళ్ళిన సంఘటన గుర్తొచ్చింది. అక్కడ నర్సులు రోగులకు ఇంజెక్షన్లు ఇవ్వడం గుర్తొచ్చింది. ఆపని చాలా కష్టమైనదనీ, అదితన వల్లకాదనీ అనుకుంది. మరి ఇంకేం చెయ్యాలి? ఒక ఆలోచన వచ్చింది- "అరే! మర్చే పోయాను, నేను పెద్దదాన్ని అయ్యాక ఏం చెయ్యాలో ఎప్పుడో అనుకున్నానుగా?"

వెంటనే లేచి సారాయి దీపం వెలిగిస్తున్న టాయిచాన్ దగ్గరకు వెళ్ళింది. "నేను గూఢచారిని అవుతాను తెలుసా?" అన్నది గర్వంగా.

టాయిచాన్ దీపం వెలుగు మీద నుంచి దృష్టి మరలించి టోటోచాన్ కేసి చూసాడు. ఆతర్వాత చూపులుతిప్పి కిటికీలో నుంచి బయటకు చూసాడు. ఆ విషయం గురించే దీర్ఘంగా ఆలోచించిన వాడిలా, టోటోను చూస్తూ అన్నాడు: "గూఢచారి కావడం మాటలుకాదు. చాలా తెలివివుండాలి. ఎన్నో భాషలు తెలిసివుండాలి."

ఒక్షణం టోటోను చూసి "గూఢచారి కావాలంటే, ముఖ్యంగా ఆడవాళ్లు- చాలా అందంగా వుండాలి," అన్నాడు.

టోటోచాన్ అతని చూపులతో చూపులు కలపలేనట్టుగా తలదించుకొని నేలచూపులు చూడసాగింది. కొంచెం సేపు మౌనంగా వుండి-"పైగా వాగుడుగాయలు గూఢచారిగా అసలు పనికిరారు," అన్నాడు.



టోటోచాన్ పెదవి విప్పలేదు. అతడు చెప్పిన వన్నీ నిజాలే అన్పించింది. అవన్నీ తను కూడా అనుకున్నవే. టాయిచాన్ కోపంతో, అసూయతోనో అన్నాడు అనిపించలేదు. గూఢచారి కావడానికి అవసరమైన తెలివితేటలూ, అందం తనకు లేవని గ్రహించింది. అందుకే గూఢచారి కావాలనే ఆలోచనను వదివేసింది.

"టాయిచాన్‌కు నా వయసే! అయినా ఎన్ని విషయాలు తెలునో?" ఆశ్చర్యపోయింది.

"టాయిచాన్ భౌతికశాస్త్ర వేత్తను కావాలనుకుంటున్నానని చెబితే నేను ఏమంటాను? బావుంటుంది. నువ్వు అగ్గి పుల్లలతో సారాయి దీపాన్ని బలేగా వెలిగిస్తావులే అనిమాత్రం అనగలనేమో? చిన్న పిల్లలా తెలివితక్కువగా అన్నట్టుగా వుండదూ? అలా కాకుండా ఇంగ్లీషులో నక్కను ఫాక్స్ అంటారనీ, జోళ్ళను షూస్ అంటారనీ నీకు తెలుసు. అందుకే నువ్వు మంచి భౌతికశాస్త్ర వేత్తవు కాగలవు, అని అంటే? ఛ! ఏం బాగాలేదు."

ఏదిఏమైనా టాయిచాన్ పెద్దయి ఏదో గొప్పపనే చేస్తాడని పించింది. "థ్యాంక్యూ! నీ సలహా నాకునచ్చింది. గూఢచారిని కాను. నువ్వు మాత్రం గొప్పవాడివవుతావు," అన్నది.

టాయిచాన్ సారాయి దీపాన్నే దీక్షగా చూస్తున్నాడు. ఏదో గొణుక్కున్నాడు, తలగోక్కున్నాడు.

టాయిచాన్ పక్కన నిలబడి అతను చేస్తున్న పనిని దీక్షగా చూస్తూ నిలబడింది. తను గూఢచారి కాలేదు, మరేంచెయ్యాలి?

## నాన్న వయొలిన్

టోటోచాన్ కుటుంబం మీద, వారికి తెలియకుండానే యుద్ధ ప్రభావం పడసాగింది. ప్రతిరోజూ యువకులనూ, మగవారినీ, "బాన్‌జొయ్" అంటూ సాగనంపుతున్నారు. ఇరుగు పొరుగు ప్రాంతాలనుంచి వచ్చే ఎందరినో జండాలు ఊపుతూ సాగనంపుతున్నారు. క్రమంగా దుకాణాలలోనుంచి ఆహార పదార్థాలు మాయ మవుతున్నాయి "సముద్రంనుచి కాస్త- కొండలనుంచి కాస్త" అనే భోజనంలోని, నియమాన్ని పాటించడం కష్టమైపోతున్నది. టోటోచాన్ తల్లి

కొంతకాలం సముద్రంపాచినీ, ఒరుగుల్నీ ఉపయోగించి మధ్యాహ్నపు భోజనం తయారు చేసింది. ఆ తర్వాత అది కూడా వీలుపడలేదు. దాదాపు ప్రతి వస్తువూ రేషన్‌లో తీసుకోవాల్సివస్తోంది. మిఠాయిలు దొరకడం లేదు.

తను దిగే స్టేషన్‌కు ముందు స్టేషన్‌లో, ఒక మిషన్ వుందనీ, అందులో డబ్బులు వేస్తే చాక్‌లేట్ ప్యాకెట్లు బయటికి వస్తాయనీ టోటోచాన్‌కు తెలుసు. ఆ యంత్రం మీద వున్న బొమ్మను, చూస్తేనే నోరూరుతుంది. ఐదు సెన్లువేస్తే చిన్న ప్యాకెట్ వచ్చేది. పదివేస్తే పెద్దప్యాకెట్ వచ్చేది. కాని కొంత కాలంగా ఆ యంత్రంలో ఎన్ని డబ్బులు వేసినా ఒక్క ప్యాకెట్ కూడా రావడం లేదు. టోటోచాన్ చాలాయత్నం చేసింది, ఎలాగయినా చాక్లెట్ పొట్లం సంపాదించాలని.

"లోపల ఒక ప్యాకెట్ వుండే వుంటుంది. ఎక్కడో ఒక మూల ఇరుక్కు పోయి వుండివుంటుంది," అనుకొనేది టోటోచాన్.

అందుకే రోజూ ముందు స్టేషన్‌లోనే దిగిపోయేది. ఆయంత్రంలో ఐదుసెన్లో పదిసెన్లో వేస్తునేవుండేది. కాని చాక్లెట్ల పొట్లం బదులు, తను వేసిన డబ్బులే వెనక్కు తిరిగివచ్చేవి.

ఆరోజుల్లోనే టోటోచాన్ తండ్రికి ఒక కబురు అందింది. యుద్ధ పరికరాలు తయారు చేసే కార్ఖానాలో వయొలిన్ వాయిస్తే, పంచదార,-బియ్యం ఇస్తామని కబురు చేశారు. ఇంకా అనేక సౌకర్యాలు కల్పిస్తామన్నారు. ఆ మధ్యనే ఆయనకు ప్రతిష్ఠాత్మకమైన పురస్కారం కూడా వచ్చింది. ఆయన సంగీత విద్వాంసుడిగా గుర్తింపుపొందాడు. అందుకే ఆయన వెళ్ళి వయొలిన్ వాయిస్తే అనేక సౌకర్యాలు కల్పిస్తామని కబురు పంపారు.

"ఏమిటి? ఏం ఆలోచించావ్? మరి ఒప్పుకుంటావా?" భార్య అడిగింది.

సంగీత ప్రదర్శనలు తగ్గిపోయాయి. చాలా మంది మిలటరీలోకి వెళ్ళి పోయారు. రేడియో ప్రసారాలలో ఎక్కువ భాగం యుద్ధం గురించిన విషయాలే, సంగీతానికి ప్రాధాన్యత తగ్గిపోయింది. న్యాయంగా చూస్తే, వచ్చిన అవకాశాన్ని జారవిడుచుకోకూడదు.

కొద్ది క్షణాలు ఆలోచించి "నేను నా వయొలిన్ మీద అలాంటి సంగీతం వాయించాలను కోవడం లేదు," అన్నాడు.

"బతికించావ్! నాకూ ఇష్టంలేదు. నువ్వు అంగీకరిస్తా వేమోనని భయ పడ్డాను. ఏదోరకంగా మనకు తిండిదొరక్కపోదు," అన్నది.

టోటోచాన్‌కు కూడా సరైన తిండి పెట్టలేకపోతున్నా మనీ, చాక్లెట్లకోసం రోజూయంత్రంలో డబ్బులు వేస్తున్నదనీ ఆమె తండ్రికి తెలుసు. కొన్ని గంటలు వయొలిన్ వాయిస్తే కుటుంబానికి సరిపడే తిండి దొరుకుతుందనీ తెలుసు. కాని ఆయన తన సంగీతానికి తిండికంటే ఎక్కువ విలువనిచ్చేవాడు. అందుకే అతని భార్యకు కూడా అతడు ఆపని చెయ్యడం ఇష్టం లేదు.

"ఒరే టాట్స్కీ—నీకోసం ఏమీ చెయ్యలేకపోతున్నాను రా కన్నా" అన్నాడు టోటోచాన్‌తో దిగులుగా.

కళలగురించీ, సిద్ధాంతాల గురించీ తెలుసుకోగల వయసు కాదు టోటో చాన్‌ది. అయితే నాన్నకు సంగీతమంటే మహా ఇష్టం. అని ఆ పిల్లకు తెలుసు. ఆయన వయొలిన్ వాయించడం ఆ కుటుంబం వారికి ఇష్టం లేదు. అందరూ ఆయనతో మాట్లాడడం మానేశారు. ఒకరకంగా వెలివేశారు. అయినా ఆయన రాజీపడ లేదు. ఆ విషయం కొంతవరకు అర్థం అయింది టోటోచాన్‌కు. "పర్వాలేదు నాన్నా! నాకు కూడా నీ వయొలిన్ అంటేచాలా ఇష్టం తెలుసా?" సంతోషంగా గంతులేస్తూ అన్నది.

ఆమర్నాడు కూడా చాకెట్ల యంత్రం దగ్గరకు వెళ్ళింది. యంత్రంలోకి తొంగి చూసింది. అందులోనుంచి చాక్లెట్లు బయటికి రావు. కాని టోటోమనను అందుకు అంగీకరించడం లేదు. ఇంకా ఆశ పడుతూనే ఉంది.

## నిజంగా!

మధ్యాహ్న భోజనాలకోసం అసెంబ్లీహాలులో వలయా కారంలో అమర్చిన కుర్చీలను, భోజనాల తర్వాత తొలగించారు. ఆ హాలు చాలా విశాలంగా కన్పించింది.

"ఇవ్వాళ హెడ్‌మాస్టరు వీపు మీదకు నేను ఎక్కు తాను" అనుకుంది టోటో చాన్.

రోజూ అనుకుంటూనే వుంటుంది. కాని సంకోచంతో ఆపని చెయ్యలేక పోతున్నది. మరొకరెవరో చొరవ తీసుకుంటారు. ఆయన వళ్లో కూర్చుంటారు.

హాలు మధ్యలో ఆయన బాసింపట్లు వేసుకొని కూర్చుంటాడు. ఇద్దరు ముగ్గురు పిల్లలు పోటీపడి ఆయిన వీపు మీద వేలాడుతూ వుంటారు.

"అరెరె! ఆగండర్రా! ఆగండి!" కేకలు వేస్తూవుండే వాడు. ఆయన ముఖంలో ఆనందంతో కూడిన చిరునవ్వు కన్పించేది. ఎప్పుడు ఆయన వీపు మీద ఖాళీవుండేదు కాదు. ఏది ఏమైనా ఆరోజు మొట్ట మొదటిగా తనే ఆవీపుమీద జారాలను కుంది టోటోచాన్. హెడ్‌మాస్టరు రావడం చూసింది. దగ్గర కెళ్ళి అన్నది- "సార్! మీకోవిషయం చెప్పాలి."

"ఏమిటది! చెప్పు!" అక్కడికక్కడే నేలమీద బాసింపట్లు వేసుకు కూర్చున్నాడు. చాలా సంతోషంగా వున్నాడు.

ఎన్నో రోజులుగా తను ఆలోచిస్తున్న విషయం చెప్పాలనుకుంది. ఆయన తీరా కూర్చున్నాక ఆయన వీపు మీదకు ఎక్కాలనే కోర్కెను వెనక్కు నెట్టేసుకుంది. తనూ ఆయన ఎదురుగా కూర్చుని చిరునవ్వు నవ్వింది. అలా నవ్వితే, తల్లి "నా చిట్టి తల్లి ఎంతముద్దొస్తుందో?" అనేది. చాలా మంది తను అలా నవ్వితే ముచ్చట పడేవాళ్లు. అందుకే ఆత్మ విశ్వాసంతో అలాగేనవ్వింది.

"ఏమిటో చెప్పమ్మా?" హెడ్‌మాస్టరు మళ్లీ అడిగాడు.

టోటోచాన్ చిన్నగా, మృదువుగా, పెద్ద మనిషిలా అన్నది- "నేను పెద్దదాన్ని అయ్యాక ఇక్కడే పనిచేస్తాను. టోమోలో పాఠాలు చెప్తాను, నిజంగా..."

హెడ్‌మాస్టరు సంతోషంగా నవ్వుతాడని అనుకుంది. కాని ఆయన గంభీరంగా ముఖం పెట్టి "నిజంగా?" అన్నాడు.

ఆయన, నిజంగానే, టోటోచాన్ అక్కడ పని చెయ్యాలని ఆశిస్తున్నట్టుగా అన్పించింది.

"తప్పకుండా! నిజంగా!" అంది. తప్పక అక్కడే పనిచెయ్యాలని మనసులో నిర్ణయించుకుంది.

టోటోచాన్‌కు తను మొదటిరోజు టోమోకు రావడం, ఆయనతో ఎన్నో విషయాలు చెప్పడం, ఆయన ఎంతో ఓపిగ్గా వినడం గుర్తొచ్చింది. టోటోచాన్‌కి హెడ్‌మాస్టరంటే చాలా ప్రేమ. అందుకే ఆయన కోసం ఏదైనా చెయ్యాలని

నిర్ణయించుకుంది.

ఆయన చిరునవ్వు నవ్వాడు. టోటోచాన్ వాగ్దానం చేస్తున్నట్టుగా తన చిటికిన వేలు చాచింది. ఆయనకూడా అలాగే చేశాడు. హెడ్‌మాస్టరు వేలు దృఢంగా కన్పించింది. జపాన్ పద్ధతి ప్రకారం, ఇద్దరూ, చిటికెన వేళ్లు కలిపి ప్రమాణం చేశారు. హెడ్‌మాస్టరు ముఖం చిరునవ్వుతో వెలిగిపోతున్నది. టోటోచాన్ ఆనందం ఇంతా అంతా కాదు. తను టోమోలో టీచరు కాబోతున్నది. ఎంత అద్భుతం!

తను టీచరు అయితే ఏం చెయ్యాలో ఆలోచించింది. పిల్లలకు మరీ ఎక్కువ పాఠ్యాంశాలు వుండవు. ఆటల రోజులు ఎక్కువగా వుంటాయి. వనభోజనలూ, షికార్లూ చాలా వుండాలి.

హెడ్‌మాస్టరు కూడా ఆలోచించాడు. ఆ పిల్ల టోమోలో తప్పక టీచరు అవుతుందని భావించాడు. టోమో విద్యార్థులు మంచి టీచర్లు కాగలరని ఆయన నమ్మకం.

ఇక్కడ, టోమోలో హెడ్‌మాస్టరూ, విద్యార్థినీ ఒక మంచి నిర్ణయం తీసుకుంటున్నారు. అది కార్యరూపం ధరించడానికి పదేళ్లూ, పదిహేనేళ్ళూ పట్టొచ్చు. కాని అక్కడ, ప్రజలు, నేడో రేపో బాంబులు నింపుకున్న అమెరికన్ విమానాలను గగన తలంలో విహరించడం చూస్తామనే భయంతో ఉన్నారు.

## రాకీ మాయమైంది

యుద్ధంలో చాలా మంది సైనికులు చనిపోయారు. ఆహార పదార్థాలు దొరకడం లేదు. జనం భయంతో బతుకుతున్నారు. వేసవికాలం ఎప్పటిలాగే వచ్చింది.

గెలుస్తున్న దేశాల మీదా, ఓడిపోతున్న దేశాల మీదా, సూర్యుడు సమానంగానే తన వెలుగును ప్రసరిస్తున్నాడు.

కామాకూరాలో పెద్దనాన్న ఇంటి దగ్గర వున్న టోటోచాన్ టోకియోకు తిరిగి వచ్చింది. ఇప్పుడు టోమోలో విహారాలు లేవు. అందమైన వేడినీటిచలమల దగ్గరకు షికార్లు లేవు. ఆ వెనకటి రోజులు మళ్ళీ వస్తాయో, లేదో? ఈ సారి సెలవులు కామాలోని పెదనాన్న ఇంటిలో గడపలేక పోయింది. ఆయన కూడా యుద్ధంలోకి వెళ్ళాడు. ఆయన టోటోచాన్‌కి ఎన్నెన్ని కథలో చెప్పేవాడు.

టోటోచాన్ బంధువు ఒకాయన దయ్యాల కథలు చెప్పేవాడు. ఆయన కూడా యుద్ధంలోకి వెళ్ళాడు. ఆ కథలు నిజాలో-అబద్ధాలో తెలిసేవికావు. టోటోచాన్ పెదనాన్న పేరుపొందిన కెమెరామాన్.

నిహాన్ న్యూస్ బ్యూరో అధిపతిగా న్యూయార్క్‌లోపనిచేసి ప్రసిద్ధికెక్కాడు. ఆయన పేరు ఘజిటాగుచి. ఆయన టోటోచాన్ తండ్రికి అన్న. అయితే టోటోచాన్ తండ్రి తన అమ్మమ్మ ఇంటి పేరును పెట్టుకున్నాడు. లేకపోతే అతని పేరు వక్కన టాగుచి అని వుండివుండేది. ఆయన తీసిన సినిమాలు "రాబేల్‌యుద్ధం" మొదలైనవి సినిమా హాళ్ళల్లో చూపించేవాళ్ళు. యుద్ధంలో ఫొటోగ్రాఫర్లు సైనికుల ఫొటోలు తియ్యాలి. అందువల్లవారు సైనికులకంటే ముందు వుండాల్సి వచ్చేది.

కామాకురాలోని సముద్ర తీరం ఆ సంవత్సరం నిర్జనంగా కన్పించేది. టోటో పెదనాన్న కొడుకుపేరు యాట్‌చాన్. అతడు ఎప్పుడూ ఉత్సాహంగా వుంటాడు. ఈ పరిస్థితుల్లో కూడా అతను ఉత్సాహంగానే వున్నాడు. ఆ పిల్లవాడు టోటోచాన్ కంటే ఒక సంవత్సరం పెద్ద. పిల్లలందరూ ఒకే పెద్ద దోమతెరలో దూరి పడుకొనేవాళ్లు. పడుకొనే ముందు "మహారాజు వర్థిల్లాలి" అని అరిచేవాడు యాట్‌చాన్. తుపాకి దెబ్బతిని పడిపోయిన సైనికుడిలా పడిపోయి చచ్చి పోయినట్టు నటించేవాడు. మరో తమాషా జరిగేది. అతను అలా చేసినప్పుడల్లా, నిద్రలో నడిచి, అరుగు మీదినుంచి పడిపోయేవాడు. పెద్ద గొడవ అయ్యేది. టోటోను వాళ్ళనాన్న టోక్యోకు తీసుకొచ్చాడు.

అలవాటు ప్రకారం ఇంటికి రాగానే టోటోచాన్ రాకీ కోసం చూసింది. అది ఎక్కడా కన్పించలేదు. ఇల్లూ తోటా వెదికింది. కాని ఎక్కడా కన్పించలేదు. టోటోచాన్‌కు ఏడుపు వచ్చింది. తను బయటినుంచి రాగాకే రాకీ ఎదురు వచ్చేది. "రాకీ! రాకీ!" అని పిలుస్తూరోడ్డు మీద కువచ్చింది. ఎక్క డెక్కడో వెదికింది. తన కిష్టమైన రాకీ చెవులుకానీ, తోకగానీ ఎక్కడా కన్పించలేదు. తిరిగి ఇంటికి వచ్చింది. రాకీ ఇంట్లోనేవుండి వుంటుందనుకుంది. తను రోడ్డుమీద వెదకుతున్న సమయంలో రాకీ ఇంటికి తిరిగి వచ్చేసి వుంటుందని అనుకుంది. కాని ఇంట్లో రాకీ కన్పించలేదు.

"అమ్మా! రాకీ ఏదీ? కన్పించడం లేదేం?"

తల్లి సమాధానం ఇవ్వలేదు. తల్లి జాకెట్ పట్టుకొనిలాగుతూ "రాకీ ఏమైందమ్మా!" అని అడిగింది.

"రాకీ మాయమైపోయింది తల్లీ."

టోటోచాన్‌కు ఆమాటల మీద నమ్మకం కుదరలేదు. ఎట్లా మాయం అవుతుంది? "ఎప్పుడూ?" అన్నది.

"నువ్వు కామాకురా వెళ్ళగానే." ఓక్షణం ఆగిమళ్ళీ అన్నది. "మేం రాకీ కోసం చాలా వెతికాం. ఎందర్నో వాకబు చేశాం. కాని దాని ఆచూకి చిక్కలేదు.



నీకు ఆ విషయం ఎలా చెప్పాలా అని చాలా బాధపడ్డాం. ఇది చాలా బాధకరమైన విషయమే. కాని ఏం చేస్తాం చెప్పు!"

టోటోచాన్ అనుకుంది-"రాకీ చచ్చిపోయింది. ఆమాట చెప్తే నేను బాధపడ్తానని అమ్మ చెప్పడం లేదు."

అవును. అంతే అయివుంటుంది. లేక పోతే తను లేనప్పుడు తనకు చెప్పకుండా ఇల్లు విడిచి వెళ్ళిపోదు. చచ్చిపోయింది, మళ్ళీ అనుకుంది. అయితే టోటోచాన్ తన భావాలను తల్లికి చెప్పలేదు. తల్లి చెప్పిన దాన్ని నమ్ముతున్నట్టే" "అరెరె! వెళ్ళిపోయిందా? ఎక్కడి వెళ్ళిపోయిందో" అని మాత్రం అన్నది. ఆమాటలు అంటున్నప్పుడు ఆమె చూపులు నేలను చూస్తున్నాయి.

ఆ మాట ఎలాగో అని అక్కడ్నుంచి పరుగు తీసింది. తన గదిలోకి వెళ్ళిపోయింది. రాకీ లేని ఆ ఇల్లుబోసి బోసిగా అన్పించింది. వస్తున్న దుఃఖాన్ని దిగమింగుకుంది. తనమీద రాకీకి కోపం వచ్చిందేమో! అందుకే వెళ్ళిపోయిందేమో!

"జంతువుల్ని బాధించకండి అవి మిమ్మల్ని నమ్మినప్పుడు, వాటిని బాధపెడ్డడం ఘోరమైన పని. కుక్కల్ని ఎప్పుడూ ఆకలితోవుంచకండి. మీరు దానికి ఆకలేసినప్పుడు, తినడానికి పెట్టకుండా బాధపెడితే, అది మిమ్మల్ని నమ్మదు," అని హెడ్‌మాస్టర్ పిల్లలకు చెబుతూ వుంటాడు.

టోటోచాన్ రాకీని జాగ్రత్తగా చూసుకొనేది. తను దానిని ఎప్పుడూ బాధించలేదు దానికి కోపం తెప్పించలేదు. అది కూడా తన సూచనలను పాటించేది.

ఆలోచిస్తున్న టోటోచాన్ దృష్టి, ఎలుగు బంటిబొమ్మ కాలుకు చుట్టుకొని వున్న, రాకీ జుత్తు కన్పించింది. ఏడుపు వచ్చింది. కామాకురా వెళ్ళే ముందురోజ తను రాకీతో గదంతా దొర్లుతూ ఆడుకుంది. అప్పుడే దాని గోధుమరంగు జుత్తు ఊడిపోయి వుంటుంది. ఆ జర్మన్ షెఫర్డ్ జుత్తును చేతిలోకి తీసుకొని వెక్కివెక్కి ఏడ్చింది.

యాసువాకీ చాన్ చనిపోయాడు. ఇప్పుడు రాకీ కూడా పోయింది. ఇద్దరు నేస్తాలను పోగొట్టుకుంది.

## టీపార్టీ

టోమో కాపలాదారు పేరు ర్యోచాన్ రయోచాన్. అతడంటే పిల్లలకు చాలా ఇష్టం. ఆయన్ని కూడా యుద్ధానికి పిలిచారు. ఆయనకు చాలా వయసువున్నా, అతన్ని, అతని చిన్నప్పటి ముద్దు పేరుతోనే అందరూ పిలిచేవారు. రయోచాన్ ఒక రకంగా రక్షించే దేవుడులా వుండేవాడు. ఎవరికి ఏకష్టం వచ్చినా ఆదుకొనే వాడు. అతడు ఎప్పుడూ చిరునవ్వుతో, చిన్నగా మాట్లాడేవాడు. టోటోచాన్ మురికి గుంటలో పడిపోయినప్పుడు, రక్షించింది అతడే! ఆపిల్ల వంటికి అంటించుకున్న మురికిని కడిగి శుభ్రం చేసింది కూడా అతడే.

"మనం రయోచాన్‌కు మంచి టీపార్టీ ఇద్దాం," అన్నాడు హెడ్‌మాస్టరు పిల్లలతో

"టీపార్టీయా?"

జపాన్‌లో రోజంతా, ఆకుపచ్చని టీనీరు తాగుతూనే వుంటారు. ఉత్సవాల్లోవాడే ఆకు వేరు. టీపార్టీ అంటే పిల్లలకు కొత్తగానేఉంది. అయినా ఆపిల్లలకు కొత్త విషయాల పట్ల ఆసక్తి ఎక్కువే. సాధారణంగా వీడ్కోలుకు విందు నిస్తారు. ఆ విందును "సోబెట్సుకాయ" అంటారు. టోమోలో హెడ్‌మాస్టరు దాని స్థానంలో తేనీటివిందుకు ఆయన సవాకాయి అని నామకరణం చేశాడు. వీడ్కోలు విందులో విషాదం వుంటుంది. తేనీటి విందు అన్నారు కనక పిల్లలు ఉత్సాహంగా వున్నారు.

బడి అయిపోయాక, అసెంబ్లీహాలులో, బల్లల్ని వలయకారంలో వేయించాడు హెడ్‌మాస్టరు, పిల్లల చేత. పిల్లలందరూ కూర్చున్నారు. వాళ్ళ ముందుకు తేనీరువచ్చింది. టీలో నంజుకోవడానికి ఎండు చేపముక్కలు ఇచ్చారు. ఆ యుద్ధపు రోజుల్లో, ఈ మాత్రపు పార్టీ ఇవ్వడం గొప్ప విషయం గానే భావించాలి. హెడ్‌మాస్టరు రయోచాన్ పక్కన కూర్చున్నాడు. రయోచాన్ ముందు బియ్యపు సారాగ్లాసు పెట్టాడు. అది యుద్ధంలో వెళ్ళ బోయేవారికి ఇచ్చే రేషన్.

"టోమోలో ఇది మొదటి తేనీటి విందు. అందరం సరదాగా గడుపుదాం. మీలో ఎవరైనా రయోచాన్‌కు ఏదైనా చెప్పాలనుకుంటే చెప్పొచ్చు. అంతేకాదు. మీలో మీరు ఏమైనా మాట్లాడాలను కుంటే మాట్లాడు కోవచ్చు. మీరు

ఏదైనా చెప్పాలను కుంటే వలయం మధ్యలో నిలబడి చెప్పవచ్చు," అన్నాడు హెడ్‌మాస్టరు.

టోమోలో ఎండు చేపలు తినడం అది మొటిసారి. రయోచాన్ వాళ్ళతో కలిసి కూర్చోవడం కూడా మొదటిసారే. రయోచాన్ సారాతాగుతుండగా చూడడం కూడా ఇదే మొదటిసారి.

పిల్లలు ఒకరి తర్వాత ఒకరు లేచి నిల్చుని, రయోచాన్‌తో మాట్లాడారు. మొదటి పిల్లవాడు ఆయనను జాగ్రత్తగా, ఆరోగ్యంగా, వుండమని అన్నాడు. మిజిటా మాట్లాడుతూ "ఈ సారి నేను మాఊరికి వెళ్ళినప్పుడు నీకోసం బూరెలు తెస్తాను. అంత్యక్రియల్లో తింటారే అలాంటివి," అన్నాడు మిజిటా.

అందరూ పక్కున నవ్వారు. అంతకు ముందు కూడా మిజిటా ఆ బూరెల గురించి పిల్లలకు చెప్పాడు. ఎక్కడో అంత్యక్రియల్లో తిన్నాడట. భలేగ వున్నాయట. ఎన్నో సార్లు ఆబూరెలుతెచ్చి అందరికీ పెడ్తానని చెప్పాడు. కాని ఎప్పుడూ తేలేదు.

మిజిటా మాటలకు హెడ్‌మాస్టరు కరిగిపోయాడు. అంత్యక్రియలలో పెట్టే బూరెలు తెస్తాననడం అపశకునం అని, పాపం ఆ పసివాడికి తెలియదు. తనకు బాగుంది కనక అందరికీ పెట్టాలని ఆ పిల్లవాడి కోరిక. రయోచాన్ కూడా అందరితో కలిసి హాయిగా నవ్వాడు. అతడికి, బూరెలు తెచ్చి పెడతానని మిజిటా ఎన్నోసార్లు చెప్పాడు.

తర్వాత ఒయి లేచి నిల్చున్నాడు. జపాన్ దేశంలోకే ఒక గొప్ప హార్టి కల్చెరిస్టుగా పేరుతెచ్చు కుంటానన్నాడు. అతని తండ్రికి ఒక పెద్ద తోట వుంది. ఆ తర్వాత కీకోజాకి లేచింది. మౌనంగా నిల్చుంది. కొద్ది నిముషాల తర్వాత వెనక్కు తిరిగి వెళ్ళి తన సీట్లో కూర్చుంది. టోటోచాన్ లేచింది. కీకోచాన్ బదులు మాట్లాడింది. "కీకో చాన్ దగ్గర కోళ్ళు ఉన్నయ్. అవి ఎగురుతాయి. నేను మొన్న చూశాను," అంది.

ఆమాడేరాలేచి "నీకు ఎక్కడైనా గాయపడిన పిల్లులు గానీ, కుక్కలు గానీ కన్పిస్తే నా దగ్గరకు తీసుకురా. నేను వాటికి నయం చేస్తాను," అన్నాడు.

టాకాహాషి పొట్టివాడని తెలుసుగా? బల్లకింద నుంచి దూరి వలయం మధ్యలోకి వచ్చాడు. "థ్యాంక్యూ రయోచాన్. నువ్వు మాకు ఎన్నో సహాయాలు

చేశావు థ్యాంక్యూ." అన్నాడు.

ఐకో సైషో నిలబడింది- "రయోచాన్, నువ్వు అప్పుడు నేను పడిపోయాను చూడూ... అప్పుడు నాకు కట్టుకట్టావు. నేను మర్చిపోను. థ్యాంక్యూ." అంది. ఆపిల్ల ముత్తాత చాలా ప్రముఖమైన వ్యక్తి. రష్యా-జపాన్ యుద్ధంలో అడ్మిరల్‌గా పని చేశాడు. ప్రసిద్ధ కవయిత్రి అట్సుకో వాళ్లకు బంధువు. ఆమె మిజీ చక్రవర్తి ఆస్థానంలో కవయిత్రిగా వుండేది.

కాని ఐకో ఎప్పుడూ వాళ్ళగురించి చెప్పేదికాదు.

హెడ్‌మాస్టరు కూతురు కనక మియోచాన్‌కు రయోచాన్ చాలా దగ్గరగా తెలుసు. ఆ పిల్ల కళ్ళల్లో నీరు తిరిగింది. "రయోచాన్. జాగ్రత్తగావుండు. ఉత్తరాలు రాస్తూవుండు. రాస్తావుగదూ? మేము కూడా రాస్తాం," అంది.

టోటోచాన్‌కు ఎన్నెన్నో చెప్పాలని వుంది. కాని ఎక్కడ మొదలు పెట్టాలి, ఏ విషయం మొదలు పెట్టాలి. అనేది తెలియడంలేదు. చివరకు ఒకే వాక్యంలో "రయోచాన్! నువ్వు వెళ్ళి పోయినా మేం రోజూ టీపార్టీ చేసుకుంటాం" అన్నది.

హెడ్‌మాస్టరు నవ్వాడు. రయోచాన్‌కూడా నవ్వాడు. పిల్లలందరూ నవ్వారు. ఆఖరికి టోటోచాన్ కూడా నవ్వేసింది.

టోటోచాన్ అన్నది నిజమని రెండో రోజుకే రుజువైపోయింది. కాస్త సమయం దొరికితేచాలు పిల్లలందరూ టీపార్టీ ఆట ఆడు కోవడం మొదలు పెట్టారు. తేనీరాకు బదులుగా గ్లాసుల్లో నీళ్లు పోసుకొని, ఎండు చేపలకు బదులుగా చెట్టు బెరడులు నంజుకుంటూ, ఆనీరు తాగేసేవాళ్లు. ఆసమయంలో ఎవరో ఒకరు లేచి మీ అందరికోసం "అంత్యక్రియల బూరెలు తెస్తాను," అనేవాళ్లు. అందరూ గొల్లున నవ్వేవాళ్ళు. ఆతర్వాత అందరూ హాయిగా కబుర్లు చెప్పు కొనేవాళ్లు. నిజంగా తినేది ఏమీ లేకపోయినా ఆ టీపార్టీలు మాత్రం బాగానే జరిగేవి.

రయోచాన్ వెళుతూ వెళుతూ పిల్లలకు ఇచ్చిన బహుమతి ఈ "తేనీటివిందు." టోమోలో పిల్లలు చాలా సరదాగా ఆడుకున్న చివరి ఆట అదే. ఆతర్వాత వాళ్లు విడిపోయారు.

రయోచాన్ టోమొకొ రైల్లో వెళ్ళిపోయాడు. ఆయన అటువెళ్ళడం.

ఇటు అమెరికన్ విమానాలు రావడం ఒకేసారి జరిగిపోయింది. ఆవిమానాలు టోక్యోమీద తిరుగుతూ బాంబులు కురిపించసాగాయి.

## "సాయొనారా-సాయొనారా!"

టోమో తగలబడిపోయింది. బుగ్గి అయిపోయింది.

ఒకరోజురాత్రి టోమోను అగ్నిజ్వాలలు మింగేశాయి. బడికి ఆనుకొని వున్న ఇంట్లోనే హెడ్‌మాస్టరు కుటుంబం వుండేది. ఆయన భార్యా, కూతుళ్లయిన మియోచాన్, మిసాచాన్ బయటికి పరుగు తీశారు. కుహోంబుట్సు చర్చి పక్కన వున్న పొలాల్లోకి పరిగెత్తి ఊపిరి పీల్చుకున్నారు.

బి 29, బాంబర్ విమానాలనుంచి పడిన బాంబుల మంటలు, తరగతి గదుల్లా ఉపయోగపడిన రైలు పెట్టెల్ని కాల్చివేశాయి.

హెడ్‌మాస్టర్ కలలకు ప్రతిరూపమైన ఆ బడి అగ్నికి ఆహుతి అయింది. అంతవరకూ చిన్నారుల కిలకిలలతో ప్రతిధ్వనించిన ఆ బడి భయంకరమైన చప్పుళ్లతో తగలబడి పోతున్నది. బడి బూడిదగ మారింది. జియొగేకాను మంటలు మింగేశాయి.

ఆభీభత్స దహన కాండను చూస్తూ రోడ్డుమీద నిలబడిపోయాడు హెడ్‌మాస్టరు. అలవాటు ప్రకారం కోటు జేబుల్లో చేతులు పెట్టుకొని, తన కలలపంట మాడి మసైపోవడం చూస్తూ నిలుచున్నాడు.

ఆయన పక్కనే ఆయన కుమారుడు టోమోకూడా నిలబడి వున్నాడు. టోమో యూనివర్సిటీలో చదువుతున్నాడు. "మళ్లీ ఎలాంటి బడి నిర్మిద్దాం కన్నా!" అన్నాడు హెడ్‌మాస్టరు కొడుకుతో. టోమో మాటలు మర్చిపోయిన వాడిలా నిలబడి పోయాడు.

కొబయాషికి పిల్లల పట్లగల ప్రేమ, బోధనపట్ల అభిరుచి, ఎదురుగా కన్పించే మంటల కంటే బలమైనవి. అందువల్లనే ఆయన కుంగిపోలేదు. నిరుత్సాహపడలేదు. మళ్ళీ ఎటువంటి బడి పెట్టాలా అన్న ఆలోచనలో వున్నాడు.

టోక్యో నుంచి జనాన్ని తరలిస్తుంది. ఒక కిక్కిరిసిన రైలు పెట్టెలో

పడుకొనివుంది టోటోచాన్. రైలు ఈశాన్య దిశకేసి పరుగుతీస్తోంది. కిటికీలోనుంచి బయటికి చూసింది. అంతా కటిక చీకటి. ఆ పిల్లకు హెడ్‌మాస్టరు అన్న చివరి మాటలు గుర్తొచ్చాయి. "నువ్వు చాలా మంచిపిల్లవు." "మళ్లీ కలుద్దాం" టోటోచాన్ కనిపించినప్పుడల్లా అంటూవుండేవాడు. ఆ మాటల్ని ఎప్పటికీ గుర్తుంచుకోవాలను కుంది. త్వరలోనే కొబయాషిని చూడగలనీనే ఆశ కలిగింది. టోటోచాన్ హెడ్‌మాస్టరు గురించి ఆలోచిస్తూనే, నిద్రలోకి జారిపోయింది.

భయంతో, ఆందోళనతో, బరువెక్కిన హృదయాలను మోసుకుపోతున్నది రైలు. 'ధన్-ధన్' శబ్దం చేస్తూ, చీకటికి చీల్చుకుంటూ ముందుకు పరిగెత్తుతోంది ఆ రైలు.

## చివరగా

ఆ రైలు పెట్టెల తరగతుల్లో' నాతో పాటు ప్రయాణం చేసిన నామిత్రు లందరూ, ఇప్పుడెక్కడున్నారో? ఏంచేస్తున్నారో?

### ఆకిరా టాకాహాషి

టోమోలో ఆటల దినం రోజు, అన్ని బహుమతులూ గెల్చుకొన్న ఆకిరా టాకాహాషి, పొట్టి వాడిగానే వుండిపోయాడు. జపాన్‌లో మంచి పేరుపడిన ఉన్నత పాఠశాలలో చదివాడు. ఆ తర్వాత మిజీ యూనివర్సిటీలో ఇంజనీరింగు డిగ్రీ తీసుకున్నాడు.

ఇప్పుడు, అతడు, హామానాసరస్సు దగ్గరలోవున్న ఒక పెద్ద ఎలక్ట్రానిక్ కంపెనీలో పర్సనల్ మేనేజరుగా పని చేస్తున్నాడు. స్వయంగా ఎన్నో కష్టాలను అనుభవించిన అతనికి కార్మికుల కష్టసుఖాలు బాగాతెలుసు. వారి సమస్యల్ని సహృదయంతో అర్థం చేసుకొని పరిష్కరిస్తుంటాడు. ఎప్పుడూ ఉత్సాహంగా వుండే ఆయన స్వభావం, ఆకర్షణీయమైన ఆయన వ్యక్తిత్వం, అతనికి సహకరించేవి. సాంకేతిక నిపుణుడిగా యువకులకు శిక్షణ కూడా ఇస్తాడు.

నేను, టాకాహాషినీ, ఆయన భార్యనూ చూడడానికి మమట్సుకు వెళ్ళాను. ఆయన భార్య చాలా మంచిది. అతన్ని బాగా అర్థం చేసుకున్న సహధర్మచారిణి. టోమో గురించి ఆమెకు ఎన్నో విషయాలు తెలుసు. తను పొట్టిగా వున్నాననే కాంప్లెక్సు (ఆత్మ న్యూనతాభావం) తన భర్తలో మచ్చుకైనా లేదని చెప్పింది. ఆమె చెప్పింది అక్షరాలా నిజం అనిపించింది. అతడిలో ఆత్మన్యూనతా భావమేవుంటే, హైస్కూలు, యూనివర్సిటీలో ఎన్నో ఇబ్బందుల్ని ఎదుర్కో

వాల్సివచ్చేది. ఈ స్థితికి చేరివుండే వాడే కాదు.

టోమోలో చేరిన మొదటిరోజును గుర్తు చేసుకున్నాడు. అంగవైకల్యంగల పిల్లల్ని అక్కడచూసి తను మానసికంగా ఊరటచెందాడు. ఆతర్వాత అక్కడి వాతావరణం అతడికి ఎంతో నచ్చింది. ఒక్కరోజు కూడా బడికివెళ్ళకుండా వుండలేక పోయేవాడట. కొలనులో నగ్నంగా ఈదాలంటే ముందు సిగ్గుగా అన్పించిందట. కాని ఒక్కొక్క గుడ్డ శరీరం మీది నుంచి తీసేస్తూ వుంటే, సిగ్గూ, బిడియమూ కూడా వాటితో పాటు మనసులో నుంచి బయటికి వెళ్ళిపోయాయట. ఆఖరుకు భోజనాల సమయంలో కూడా నగ్నంగా నిలబడడానికి సిద్ధం అయ్యాడట.

కొబయాషి తనలో ఎలా మనోధైర్యాన్ని పెంపొందించాడో వివరించాడు. తన కంటే ఎంతో ఎత్తయిన గుర్రాలమీద ఎక్కడానికి ప్రోత్సహించాడట. నువ్వు ఎగరగలవు! అంటూ ధైర్యం చెప్పేవాడట. కొబయాషి అతడు ఎగరడానికి దూకడానికి సహాయంచేసేవాడు. కాని తను సహాయం చేస్తున్నట్టు టాకాహాషికి అనుమానం రాకుండా చూసుకొనేవాడు. చివర్లో సహాయం అందించేవాడుకాడు. అందువల్ల టాకాహాషిలో ఆత్మవిశ్వాసం పెంపొందింది. టాకాహాషి ఎప్పుడైనా నలుగురిలోకి రావడానికి సందేహిస్తూ చాటుగా నిల్చుని వుంటే, ఆయన తనను ముందుకు తీసుకొచ్చి నిలబెట్టేవాడట. విజయం సాధించడంలో లభించే ఆనందం, ఆత్మవిశ్వాసం, ఎలా వుంటాయో టాకాహాషికి. ఆయన రుచిచూపించాడు. ఇష్టంవున్నా, లేకపోయినా, ఇలా చెయ్యడం వల్ల, తన జీవితానికి ఒక దృక్పథం అంటూ ఏర్పడిందట. ఆరోజు, ఆటలరోజు, అన్ని బహుమతులు గెల్చుకున్నప్పుడు కలిగిన ఆనందం, ఆత్మవిశ్వాసం, మరువురానివి అంటాడు.

టాకాహాషి వ్యక్తిత్వాన్ని తీర్చిదిద్దడంలో అతడి కుటుంబానికి కూడా పాత్రవుండి వుండొచ్చు. ఏదిఏమైనా హెడ్‌మాస్టరు ఎంతో దూరదృష్టితో మమ్మల్ని ప్రోత్సహించేవాడు. నన్నుచూసి నప్పుడల్లా "నువ్వు మంచి పిల్లవు" అన్నట్లుగానే, టాకాహాషిని చూసినప్పుడల్లా "నువ్వు ఇదిచెయ్యగలవు-అదిచెయ్యగలవు" అనేవాడు. ఆమాటలు టాకాహాషి జీవిత పథాన్ని నిర్ణయించడంలో ఎంతో ఉపకరించాయి.

నేను వచ్చేస్తున్నప్పుడు టాకాహాషి ఒక విషయం చెప్పాడు. నేనయితే మర్చి పోయాను. కాని అతడికి ఇంకా గుర్తుంది. వేరే బళ్ళ పిల్లలు ఎగతాళి పట్టించే వాళ్ళట. అతడు దిగులుగా వుంటే "పిల్లలు ఏమైనా అన్నారా?" అని అడిగి అక్కడ్నుంచి పరిగెత్తు కెళ్ళే దాన్నట. కొద్దిసేపటి తర్వాత తిరిగొచ్చి "బాధపడకు. అంతా సరిచేశాను. ఇక నిన్నెవరూ ఎగతాళి చెయ్యరు," అని చెప్పేదాన్నట.

"అప్పుడు నాకు నువ్వు ఎంత ధైర్యాన్నీ సంతోషాన్నీ, కలిగించేదానివో తెలుసా?" అని అన్నాడు. "నాకీ విషయం గుర్తులేదు. నువ్వు గుర్తుంచు కున్నందుకు కృతజ్ఞతలు," అన్నాను.

## మియోచాన్ ( మియోకానెకో )

కొబయాషి మూడో కూతురు మియోచాన్. కునిటాచి సంగీత కళాశాలనుంచి డిగ్రీ తీసుకుంది. ఇప్పుడు ఆమె ఒక ప్రాథమిక పాఠశాలలో సంగీత టీచరుగా పనిచేస్తోంది. తండ్రి గుణాలను పుణికి పుచ్చుకుంది. ఆమెకు చిన్న పిల్లలకు పాఠాలు చెప్పడం చాలా ఇష్టం. తండ్రి, ఆపిల్లలకు మూడేళ్ళున్నప్పట్నుంచీ, ఆమె అభిరుచుల్ని గమనిస్తూ వచ్చాడట. పసి తనంలోనే సంగీతానికి అనుగుణంగా అడుగులువేస్తూ, శరీరాన్ని కదిలించేదట.

## సాక్యో మత్సుయామా ( ఇప్పుడామె శ్రీమతి సైటా )

సాక్యోచాన్ గుర్తుంది కదూ? నేను టోమోకు వెళ్ళిన మొదటిరోజు కుందేలు బొమ్మలున్న గౌను వేసుకున్న పిల్లే! టోమో వదిలాక మిటా ఉన్నత పాఠశాలలో చేరింది. అక్కడ ఆడపిల్లలు చేరడం కష్టం అంటారు. ఆ తర్వాత టోక్యోలోని మహిళల క్రిస్టియన్ యూనివర్సిటీలో ఇంగ్లీషు చదివింది. వై.యం.సి.ఏ.లో ఇప్పుడు ఇంగ్లీషు టీచరుగా పని చేస్తోంది. టోమో అనుభవాలను తన విద్యాబోధనలో ఉపయోగించుకుంటూ వుంటుంది.

పర్వతారోహణ సమయంలో పరిచయమైన వ్యక్తిని ఆమె వివాహం చేసుకుంది. ఆమె తన కొడుక్కి యాసుటాకా అని పేరు పెట్టుకుంది. తాము

ఎక్కిన పర్వతానికి గుర్తుగా ఆ అబ్బాయి పేరుకు టాకా చేర్చారు.

## టాయిజీ యమనోచి

నన్ను పెళ్ళి చేసుకోనని బెదిరించిన కుర్రాడు, టాయిచాన్, జపాన్‌లో ప్రముఖ భౌతిక శాస్త్ర వేత్త అయ్యాడు. ఆయన అమెరికాలో వుంటున్నాడు. "బ్రయిన్‌డ్రయిన్"కు ఆ కుర్రాడ్ని ఒక ఉదాహరణగా చెప్పుకోవచ్చు. టోక్యో యూనివర్సిటీలో భౌతిక శాస్త్రంలో డిగ్రీపొందాడు. యం.యస్‌సి. తర్వాత స్కాలర్‌షిప్ మీద అమెరికా వెళ్ళాడు, ఐదేళ్ళ తర్వాత రోచెస్టర్ యూనివర్సిటీ నుంచి డాక్టరేట్ తీసుకున్నాడు. ఆ తర్వాత అమెరికాలోనే స్థిరపడిపోయాడు. అమెరికాలోని యాభైమూడు యూనివర్సిటీల నుంచి ఎంపిక చేసిన వారి పరిశోధనా కేంద్రంలో ఆయన అసిస్టెంటు డైరెక్టరుగా పని చేస్తున్నాడు. ఆ కేంద్రంలో 145 మంది భౌతికశాస్త్ర వేత్తలూ, 1400 మంది సాంకేతిక సిబ్బంది పనిచేస్తున్నారు. ఐదేళ్ల క్రితం 500 బిలియన్ ఎలక్ట్రాన్ ఓల్టుల శక్తివంతమైన కాంతిని ఉత్పన్నం చెయ్యడంలో ఈ సంస్థ విజయాన్ని సాధించింది. అంతటి సంస్థలో పనిచేస్తున్న టాయిచాన్ మేధావి అని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.

టాయిచాన్, కొలంబియా విశ్వవిద్యాలయానికి చెందిన మరో ప్రొఫెసర్‌తో కలిసి, అప్సిలాన్ అనేదాన్ని, ఈ మధ్యనే కనిపెట్టాడట. ఏదో ఒకరోజు టాయిచాన్‌కు నోబుల్ బహుమతి తప్పక వస్తుంది.

రోచెస్టర్ విశ్వవిద్యాలయంలో గణిత శాస్త్రంలో డిగ్రీ తీసుకున్న ఒక అమ్మాయిని పెళ్లి చేసుకున్నాడు. ఆమె కూడా మేధావి. టోమోలో పిల్లల అభిరుచికి అనుకూలమైన విద్యాబోధన వుండడం వల్లనే టాయిచాన్ ఈనాడు ఇంతవాడయ్యాడనిపిస్తుంది. మరెక్కడ చదివినా గొప్పవాడే అయివుండే వాడేమో! తరగతిలో సారాయి దీపం ముందు కూర్చుని దీక్షగా ఆలోచించేవాడు. గాజు కుప్పెలలో, పరీక్షనాళికలతో ఎప్పుడూ ఏదో ఒకటి చేస్తూనే వుండేవాడు. అదికాక పోతే భౌతిక శాస్త్రానికి సంబంధించిన పుస్తకాలు తిరగేస్తూ వుండేవాడు. అంతేగాని మరోపని చేస్తూ అతను ఏనాడూ కన్పించలేదు.

## కునియొ ఒయొ

ఒయొ--అదే నాజడలు పట్టుకొని లాగాడే—ఆ అబ్బాయి. ఇప్పుడు సుదూర తూర్పు జపాన్‌లో ఆర్చిడ్స్ మీద అగ్రశ్రేణి శాస్త్రజ్ఞుడిగా పేరు పొందాడు. అతను తయారు చేసిన ఆర్చిడ్ బల్బుల ధర వేలడాలర్స్‌లో వుంటుంది. అతడి ఫీల్డు చాలా విశిష్టమైనది. డిమాండ్ కూడా ఎక్కువే. జపాన్‌లోని అన్ని ప్రాంతాలూ తిరుగుతూవుంటాడు. అతడ్ని ఫోన్‌లో పట్టుకోవడం అంత తేలికకాదు. ఎలాగో అతడ్ని ఒకరోజు ఫోన్‌లో పట్టుకోగలిగాను. మా సంభాషణ ఇలాసాగింది.

"టోమో వదిలేశాక ఏస్కూలుకు వెళ్ళావు?"

"ఎక్కడికీ వెళ్ళలేదు."

"ఏ స్కూలుకూ వెళ్ళలేదా? అంటే టోమోలో మాత్రమే చదివావా?"

"అవును!"

"ఓ భగవాన్! అయితే మాధ్యమిక పాఠశాలకు కూడా వెళ్ళలేదా?"

"ఆ! అవును! వెళ్ళాను. క్యూశేవదిలి వెళ్ళిపోయాక, కొద్ది నెలలు ఒయితా సెకండెరీ స్కూలుకు వెళ్ళాను."

"కనీసం సెకండరీ స్కూలు చదువైనా పూర్తి చెయ్యాల్సిన అవసరం లేదా?"

"వుందనుకో! కాని నేను పూర్తి చెయ్యలేదు."

"అయినా ఎంత సంతృప్తిగా, ఆనందంగా వున్నాడు! మనసులోనే అనుకున్నాను. యుద్ధానికి పూర్వం ఒయొ తండ్రికి ఒక పెద్ద నర్సరీ గార్డెన్ వుంటేది. దక్షిణ పశ్చిమ టోక్యోలోని, తొడొరోకి అనే ప్రాంతం, చాలా వరకు ఆ గార్డెన్‌కు సంబంధించిందే. యుద్ధ సమయంలో బాంబులు పడి గార్డెన్ పూర్తిగా ధ్వంసం అయిపోయింది. ఆ తర్వాత జరిగిన సంభాషణలో అతనెంత సౌమ్య స్వభావుడో అర్థం పోయింది."

అతను విషయం మారుస్తూ అన్నాడు:

"అన్నిటికంటే ఎక్కువ సువాసనలు విరజిమ్మే పుష్పం ఏదో చెప్పగలవా? నా దృష్టిలో అది, చైనా స్ప్రింగ్ ఆర్చిడ్. ప్రపంచంలో మరే పుష్పాన్నీ దీనితో పోల్చడానికి వీల్లేదు. మరిచీని సుగంధం అలాంటిది."

"అవి చాలా ఖరీదు వుంటాయా!"

"కొన్ని వుంటాయి-కొన్ని వుండవు."

"చూడడానికి ఎలా వుంటాయి?"

"కళ్ళు చెదిరిపోయేలాగ వుండవు. అతి మామూలుగా వుంటాయి. అదేవాటి ఆకర్షణకు ప్రధాన కారణంకావచ్చు."

ఒయొ బొత్తిగా మారలేదు. టోమోలో ఉన్నప్పటిలాగే వున్నాడు. ఆ కంఠ స్వరంలో ఎంత ప్రశాంతత! స్కూలు చదువుకూడా పూర్తి చెయ్య లేనందుకు కొంచెం కూడా బాధ పడడం లేదు. ఎంత ఆత్మ విశ్వాసం! తన మనసుకు తోచిందే చేస్తాడు. అతని వ్యక్తిత్వం మీద నాకు గౌరవం పెరిగింది.

## కాజువో అమాడేరా

అమాడేరాకు పశువులంటే ప్రేమ. పశువుల డాక్టరు కావాలని కలలు కనేవాడు. దురదృష్టం-అతడి తండ్రి అకస్మాత్తుగా మరణించాడు. అతడి జీవిత లక్ష్యం పూర్తిగా మారిపోయింది. తండ్రి చనిపోయే సమయానికి అతను నిహాన్ యూనివర్సిటీ స్కూల్లో వెటర్నరీ డాక్టరు చదువు తున్నాడు. తండ్రి మరణంతో ఆచదువు సాగలేదు. యూనివర్సిటీ వదిలెయ్యాల్సి వచ్చింది. ప్రస్తుతం అతను ఆత్మరక్షణ కేంద్రానికి సంబంధించిన ఆసుపత్రిలో పని చేస్తున్నాడు, క్లినికల్ ఎగ్జామినేషన్ డిపార్ట్‌మెంటులో, బాధ్యత కలిగిన పదవిలో వున్నాడు.

## ఆయికో-సాయికో (శ్రీమతి తనాకా)

ఆయికొసాయికో, అడ్మిరల్ టోగోకు వరసకు మనుమరాలు. ఆయామా గాకునీ ప్రాథమిక పాఠశాల నుంచి, టోమోకు బదిలీ అయింది. ఆరోజుల్లో, ఆపిల్లను చూస్తూ, ఒక ఆదర్శ ప్రాయమైన స్త్రీమూర్తిని ఊహించు కొనే దాన్ని. బహుశా తండ్రిలేక పోవడంవల్ల అలా వూహించుకొనేదాన్ని అనుకుంటాను. ఆమె తండ్రి థర్డ్‌గార్డ్ రెజిమెంటులో పని చేసేవాడు. మాన్‌చిరియన్ సంఘటనలో అతను మరణించాడు.

కామాకురా హైస్కూలు చదువు పూర్తి కాగానే, ఆమెకు వివాహం

జరిగింది. అతడు వాస్తు శాస్త్రజ్ఞుడు. ఆమె ఇద్దరు కొడుకులూ పెద్ద వ్యాపారస్తులుగా స్థిర పడ్డారు. ఆమె తన సమయాన్ని కవిత్వం రాయడంలో గడుపు తున్నది.

"అయితే నువ్వు, చక్రవర్తి దర్బారులో కవయిత్రిగా ప్రసిద్ధి కెక్కిన మీ పినతల్లి అడుగుజాడల్లో నడుస్తున్నా వన్నమాట!"

"అబ్బే! అదేంకాదు" కొంచెం బిడియపడుతూ వినయంగా అన్నది ఆయికొసాయికొ.

"నువ్వు కొంచెం కూడా మారలేదు. టోమోలో వున్నప్పుడు ఎలా వుండే దానివో అలాగే వున్నావు. అవే వినయ విధేయతలు- అదే సంస్కారం- కొంచెం కూడా మారలేదు!"

"నారూపాన్ని కూడా చూస్తున్నావుగా? మార్పు లేదు. బెనకాయ్ ఆడే రోజుల్లో ఎలా వున్నానో, ఇప్పుడూ అలాగే వున్నాను," అన్నది సాయికొ

స్నేహ పూరితమైన ఆమె కంఠస్వరం వింటూ, ఆమె కుటుంబ జీవితం ఎంత సుఖమయంగా వుందో ఊహించుకున్నాను.

## కాయికో ఆవోకి (శ్రీమతి కువాబారా)

కాయికొ దగ్గర ఎగిరేకోడిపిల్ల లుండేవి ఆరోజుల్లో.

కొయివో యూనివర్సిటీకి సంబంధించిన స్కూల్లో ఉపాధ్యాయుడిగా పనిచేస్తున్న వ్యక్తిని వివాహం చేసుకుంది. ఆమెకు ఇప్పుడు, పెళ్లి అయిన ఒక కుమార్తె కూడావుంది.

## ఒయిచి మిగిటా

మిగితా ఎవరోకాదు. టోమోలో మృత్యు భోజనానికి అవసరమైన సామగ్రి తెస్తానంటూ వుండే వాడే—అతడే! అతడు హార్టికల్చర్‌లో డిగ్రీ తీసుకున్నాడు. కాని అతడికి చిత్రకళ అంటే మహా ఇష్టం. ముశాషినో ఫైనార్ట్సుకాలేజీలో మళ్ళీ చేరాడు. ఇప్పుడు అతను స్వంత గ్రాఫిక్ డిజైనింగ్ సెంటర్ నడుపుతున్నాడు.

## రయోచాన్

రయోచాన్ టోమోలో చౌకీదారుగావుండే వాడు. అక్కడ్నుంచి అతను యుద్ధంలోకి వెళ్ళాడు. సురక్షితంగా తిరిగి వచ్చాడు. ఇప్పటికీ, ప్రతి నవంబరు మూడో తేదీన టోమోలో జరిగే ఉత్సవంలో పాల్గొనడం మర్చిపోడు.

( సమాప్తం )

at J.J. Offset Printers, Press Area, Wazirpur, Delhi - 110035